

"కోపాలు చాలించరా మాపాలి
గోపాల నన్నేలరా"

—ఫొటో: ఎన్. రామకృష్ణ.

నేడే చూడండి



రవుతూ పిక్చర్సు వారి

# నిత్యకళ్యాణం పచ్చతోరణం



రచన, దర్శకత్వం

ఎస్. ఆర్. పినిశెట్టి

సంగీతం * ఛాయ * పాటలు

పెండ్యాల * ప్రసాద్ * ఆరుద్ర

నాట్యం. వేణుగోపాల్ * కళ. టి.ఎస్.కృష్ణ

నిర్మాత... తోట కృష్ణమూర్తి



CHITHRALEKHA

RAMDAS

డిస్ట్రిబ్యూటర్స్:- *ఆంధ్రా:- గౌతమీపిక్చర్స్, విజయవాడ. *సీడెడ్ :- భాస్కర్‌పిక్చర్స్, గుంతకల్. *నైజాం :- ఉదయశ్రీపిక్చర్స్, సికింద్రాబాద్, * సూర్:- ప్రసాద్ ప్రొడక్షన్స్, బెంగుళూర్.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 27

16-3-60
బుధవారం

వికారి ఫాల్గుణ బహుళ తృతీయ



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

జగపతి పిక్చర్స్ వారి "అన్నపూర్ణ"లో
జమున.


| | |
|---|---|
| రాజధానికబుర్లు | — 3 |
| న్యూఢిల్లీ లేఖ | — 5 |
| కాపురం | — 8 |
| ఆనాదంలో మా తెలివితేటలు | — 13 |
| తెలుగువెలుగులు | — 15 |
| కథకానికథ | — 16 |
| హరివంశము | — 17 |
| పుకారు చేసిన ఉపకారం | — 25 |
| అన్వేషణ | — 28 |
| బాజాలూ - బజారాలూ | — 32 |
| రాశిఫలాలు | — 35 |
| బాలసాహితి | — 39 |
| బాదిషాహుడి | — 40 |
| వనితాలోకం | — 46 |
| వ్యాఖ్యలు - విమర్శలు | — 50 |
| పాకశాల | — 5[illegible] |
| సినిమా | — 55 |
| పడికట్టు | — 64 |





## అల్లరి పిల్లలు అవునా కాదా?

ఆర్యా,

ఆంధ్ర వారపత్రిక అందుకోగానే అట్టమీదనే గల "మీరు అల్లరి పిల్లలు అవునా? కాదా?" అనే శీర్షిక మా చిరంజీవి గారి దృష్టిని ఆకర్షించినది. వెంటనే సమాధానములు వ్రాయగా 11 రైటు గుర్తులు వచ్చినవని, తను అల్లరిపిల్లవని తెలిసినదని చెప్పినది. ఈ 11 టిక్కులను 4 కు తగ్గించుటకుగల అవకాశములను గూర్చి చెప్పగా తాను ఎంతో ఉత్సాహపడి తన లోపములను మారామును తగ్గించుకోగలనని వాగ్దానము చేసినది.

ఈ ప్రశ్నావళి పిల్లల కెంతో ఉపకరించునని వారి అల్లరిని కొంతవరకు తగ్గించి కొన్ని సదభ్యాసములు అలవరచుకొనుటలో పిల్లల మనస్తత్వము పై బాగుగా పనిచేయు ననుటలో సందేహము లేదు. దీనిని ప్రోదీకరించిన కర్త అభినందనీయులు.

శం. పార్వతీ దేవి, కవల్లి.

* * *

"మీరు అల్లరి పిల్లలు అవునా? కాదా?" పత్రికలో ప్రచురించి నందుకు చాలా సంతోషం. మీరు చెప్పినట్లే నాకు సరిపోయిన వాటికి రైటుగుర్తులు పెట్టి అవునులు లెక్క పెడితే సరిగ్గా 13 వచ్చినవి. అంటే 15 కు దగ్గర దగ్గర అన్నమాట. నేను ఇంత అల్లరి పిల్లవాడినని నాకు యిప్పటికి తెలిసింది. ఇప్పుడే మా ఇంట్లో వాళ్లందరికీ "ఇంకెప్పుడూ అల్లరి చేయను బుద్ధిగా ఉంటాను అని చెప్పేశాను. మీరు ప్రచురించిన యీ ప్రశ్నలు చదివిన నాలాంటి అబ్బాయిలకు క్రొత్త జ్ఞానోదయం అయి అల్లరి తగ్గించుకొంటారని ఆశిస్తాను.

యం. కరీముల్లాఖాన్,
అమలాపురము.

* * *

ఈ శీర్షిక బాగుంది. మావంటి అల్లరిపిల్లలకు, బుద్ధి చెప్పాలని ప్రచురించారని అనుకుంటా.

ఇకనుంచి అల్లరి చేయకుండా శ్రద్ధగా చదువుతాను. తల్లిదండ్రులు చెప్పిన మాట, ముత్యాలమూటగా అందుకుంటాను, అని మా తమ్ముడు అన్నాడు.

ఇలాంటి శీర్షికలు ఎన్నో ప్రచురించారు, ప్రచురిస్తున్నారు. ప్రచురించుతారు కూడా అని నా నమ్మకము.

చందక ఈశ్వరరావు,
పాలూరు.

* * *

ఈ వారం పత్రికలో "మీరు అల్లరిపిల్లలు అవునా కాదా? అని మీరిచ్చిన

(52-వ పేజీ చూడండి)



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## "డామిట్! గాథ అడ్డం తిరిగింది"

ఓ చిత్రాంగి వచ్చి మరో సారంగధరుడి మెడలో బహిరంగంగా దండ వేయించడం చిత్రమైన విషయం! ఇంకా చిత్రమైనది: 'దండధరుడైన ఆ సారంగధరుడు రంగంపై నిలబడి తన ఉత్సాహాన్ని వెదజల్లడం!

ఈ సంఘటన చూచినకొందరు "రోజులు మారాయి" అన్నారు. మరికొందరు, ఎందుకైనా మంచిదని ఒళ్ళు దులుపుకొని "కాదు సుమా కల కాదు సుమా" అన్నారు. గిరీశంలా మొహాలు పెట్టిన ఇంకొందరు, "డామిట్! గాథ అడ్డంతిరిగిందే!" అన్నారు. అన్నవాళ్ళంతా నవ్వుతూనే అన్నారు. మోజాగా.

అసలు జరిగినసంగతి ఇది: పద్మశ్రీ స్థానం నరసింహారావు స్త్రీ పాత్ర నిర్వహణలోనే కాదు ఉపన్యాసాలలో కూడా రమణీయత కనబరుస్తారు. ఆయనది మధురవాణి. సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యాన సరోజినీదేవి హాలు ఆవరణలో జరిగిన ఒక సమావేశంలో ఆయన ఇటీవల ప్రసంగించారు. అకాడమీ అధ్యక్షులు శ్రీ రామకృష్ణరాజు అనుమతిని గ్రహించే ప్రసంగించారు శ్రీ స్థానం. కాని ఏం మాటాడతారో వారికి ముందు తెలియదు.

తమ ఉపన్యాసంలో శ్రీ స్థానం, శ్రీ రామకృష్ణరాజు సరసతను, సౌమ్యతను, కార్యదీక్షను నివాళులర్పించారు. శ్రీ రామకృష్ణరాజు ఆశ్చర్యపోయారు. ఈలోగా, శ్రీ స్థానం ఒక పూలమాలతీసి, సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ కాశీశ్వరరావుచేత రాజుగారి మెడలో వేయించారు. సదస్యులు కరతాళధ్వనులు చేశారు.

అసలు రహస్యం అప్పుడు శ్రీ రామకృష్ణరాజు బయటపెట్టారు. స్థానంవారి ఉపన్యాసంలో ప్రశంసలన్నీ తమపట్ల వారికున్న అభిమానాన్ని తెలియచేస్తున్నాయన్నారు. ఆ అభిమానానికి కారణం ఏమిటో కూడా వివరించారు. స్థానంవారి చిత్రాంగిపాత్ర నిర్వహణ తెలుగు ప్రేక్షకులు మరచిపోలేదు. రామకృష్ణరాజుగారు చిన్నప్పుడు నాటకాల్లో వేషాలేసేవారు. ముఖ్యంగా ఆయన నిర్వహించిన పాత్రల్లో సారంగధర ఒకటిట!

'సారంగధర' విషాదాంత నాటకం. విలన్— ఆ 'చిత్రాంగి'. ఈ 'సారంగధరుడు' ఒకే రంగంపై ఎన్నడూ 'తారసపడలేదట. ఈ సారి ఈ విధంగా తారసపడ్డారు. సారంగధరుడి గాథ సుఖాంతమైంది. తెర పడింది.

### స్వర్గద్వారాలకు నిచ్చెనలు:

ఆనాటి సమావేశం ఆహ్లాదకరంగా గడిచింది. ప్రేక్షకుల మనసులకు హాయి



...రాల్గరగించు విమలగాంధర్వంబు

కల్పించడానికి ఒక కారణం ఉంది. పూజ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మకి 'గానకళా ప్రపూర్ణ' బిరుదాన్నిచ్చి గౌరవించింది అకాడమీ.

సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు శాసనసభలో ఉన్నతస్థానంలో ఉపవిష్టులై ఉంటారు కాబట్టి ప్రభుత్వ ప్రతిపక్ష సభ్యులను తలవంచి చూడాల్సి వస్తుంది. ఇది మినహాయిస్తే, ఆయన ఎవరికీ ఎప్పుడూ తలవంచరు. ఆనాడు ఆయన సుప్రసిద్ధులైన పలువురు సంగీత విద్వాంసులకు తలవంచారు. అకాడమీ పక్షాన రాళ్ళపల్లి వారికి, ద్వారం వారికి. కాశీ కృష్ణమాచార్యులకు, తదితరులకు, శాలువలు కప్పి నమస్కరించారు శ్రీ అయ్యదేవర.

కర్ణాటక శాస్త్రీయసంగీతంపై నాలుగు రోజులగోష్ఠి జరిపించింది అకాడమీ. ఆ గోష్ఠికి శ్రీ రాళ్ళపల్లి అధ్యక్షత వహించారు. ఇటువంటి గోష్ఠులు ఏటేటా జరిపించాలని, ప్రతిభావంతులైన సంగీతవిద్వాంసులను ఈ గోష్ఠులకు అధ్యక్షత వహించమని ఆహ్వానించాలని, ఆ విద్వాంసులకు ఏటేటా ఇచ్చే విధంగా బిరుదు ప్రదానం చేయాలని అకాడమీ సంకల్పాలని శ్రీ రామకృష్ణరాజు వివరించారు.

ఈ గోష్ఠి సందర్భంలో ఎనిమిది తొమ్మిది సంగీత సభలు జరిగాయి. మొదటిరోజునే వాయులీనం సాధనంగా స్వర్గానికి నిచ్చెనలు వేసి, స్వర్గద్వారాలు తెరపించారు ప్రేక్షకులకు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు. చిత్తూరు సుబ్రహ్మణ్యంపిళ్ళై ప్రభృతులు మెట్లెక్కి నడిచారు, నాయుడుగారి వెనక, ప్రేక్షకులను నడిపించారు.

రాజధాని నగరంలో కర్ణాటక సంగీతాస్వాదన పిపాసువులు పలువురున్నారని ప్రప్రథమంగా నిరూపించిన సమావేశాలు ఇవి. ఈ సమావేశాలకు మొదటిసారిగా చక్కటి ఏర్పాట్లు చేసింది. ఈ ఏర్పాట్లకు కార్యకర్తలు అకాడమీ ఆర్గనైజర్ శ్రీయం. రామలింగేశ్వరరావును అభినందించాలి. వినా— రంగస్థలం వెనుక తెరపై గీయబడిన నటరాజుబొమ్మ అభినందించదగినదిగా లేదనే విమర్శలు కొందరు పెద్దల నుంచే వినవచ్చాయి. సవరించుకోగలిగిన, చలవిన, లోపం ఇది. ఇదేవిధంగా సంగీత సభలు జరుగుతూండగా రంగస్థలం పైన, క్రింద ముందు కొందరు 'రింగు మాస్టర్ల' హడావుడి. చెవులానందిస్తూంటే, 'దాసులు' కొందరు అటూ ఇటూ తిరుగుతూ కళ్ళకు బాధకలిగించడం మంచిదికాదు. ఇదికూడా ప్రేక్షకుల విమర్శకు పాత్రమైంది.

వేలాదిగా వచ్చిన ప్రేక్షక సమూహాన్ని చూసి హృదయపూర్వకంగా ఆనందించినది అధ్యక్షులు శ్రీ రామకృష్ణరాజు. "సంగీతం వినేవారిలో లోపంలేదు; వినిపించేవారిలో లోపం ఇంతవరకూ" అన్నారాయన. "ప్రభుత్వం ఇంతవరకు చెప్పించిన

# శ్రీ హరిసర్వోత్తమరావు కాలధర్మం

ప్రముఖ దేశభక్తులు, కాంగ్రెసు వయోవృద్ధులు, ప్రసిద్ధ రచయిత, వక్త శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఫిబ్రవరి 29న మద్రాసులో కన్నుమూశారు. ఆయన వయస్సు 77.

జననం– 1883లో. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి స్థాపకులలో ఒకరు. తొలిరోజులలో ఆంధ్రపత్రిక సంపాదకులుగా ఉన్నారు. 1908-11లో దేశభక్తి పూరితుడై వ్రాసిన వ్యాసానికి రాజద్రోహనేరం క్రింద శిక్ష అనుభవించారు. 1920 నుంచీ పదేళ్ళు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు. 1916లో ఆంధ్రమహాసభ అధ్యక్షులు.



రాజకీయక్షేత్రంలో అగ్రగామి అయినా నిష్కర్షకులు కావడంవల్ల ఫలసాయం పొందలేదు. కావచ్చుగాక. కాని సాంస్కృతిక రంగంలో ఆయన కృషి ఫలించి పట్టిందిబంగారంఅయింది. అందుకే ఈ తరంవారికి హరిసర్వోత్తమరావుగారు ఒక గ్రంథాలయంగాని, పత్రికగాని జ్ఞాపకం తెస్తారు. రాజకీయ నాయకుడుగా ఆయన ఈ శతాబ్ది తొలిరోజులలో లబ్ధప్రతిష్ఠులు.

శ్రీ రావుగారు అబ్రహాం లింకన్ చరిత్ర, ఢిల్లీ దర్బారు, చైనా–జపాన్ ప్రళయము, గ్రీస్ చరిత్రవంటి చరిత్ర గ్రంథాలు రచించారు. నాటిగా, ధాటిగా మాట్లాడడంలో ఆయనకు ఆయనేసాటి. వ్యక్తిగా పూర్ణాయుష్కుడు. పదహారణాల ఆంధ్రత్వం మూర్తిగొన్న తెలుగుబిడ్డ. ఆయనజీవితం ఒక విశేషవీచిక, నిరంతర కృషి. ఆయన ఉత్తమపురుషులు. ★

# ★ రాజధాని కబుర్లు ★

మొత్తాల్లో ఇదిఒక మంచిఖర్చు" అన్నారు.

శ్రీ అనంతకృష్ణశర్మకు బిరుదు సమర్పించిన సందర్భంలో ప్రసంగిస్తూ ద్వారం నాయుడు గారు: "సంగీతం, సాహిత్యం రెండూ సరస్వతీదేవి అనుగ్రహఫలితాలే. సంపూర్ణ సరస్వతి శర్మగారిని అనుగ్రహించింది. ఈ బిరుదు ప్రదానంవలన అకాడమీ వారిని గౌరవించిందనడం కంటె, తన్ను తాను గౌరవించుకొందనడంసమంజసం" అన్నారు.

అకాడమీ సంయుక్త కార్యదర్శి శ్రీ స్థానం రాళ్లపల్లివారి జీవిత సంగ్రహం వివరించారు.

## ఏ రాయైతేనేం—
## పన్ను లెగకొట్టడానికి?

పునాది రాయివేస్తేనే వంతెనలు, భవనాలు మొలుస్తాయని, పుష్కలంగా ఓట్లు కాస్తాయని అధికారుల్లో ఒక అభిప్రాయం ప్రబలిపోయినట్లు కనిపిస్తోంది. లేకుంటే- పునాదిరాళ్ళువేసి, సాధ్యమైనంతవరకు మరచిపోయి. పన్నులు పైకి ఎగదోయరు మంత్రులు.

1949వ సంవత్సరములో గౌతమిపై వంతెన నిర్మించడానికి కీర్తిశేషులు కళా వెంకటరావుగారు అలమూరువద్ద పునాది రాయి వేశారు. రాయి నాటితే, వంతెనలు మొలుస్తాయా? పెరిగి పెద్దవై ఓట్లు కాస్తాయా? వంతెన పడలేదు. నాలుగు సంవత్సరాలు గడిచిన తర్వాత, అప్పట్లో ఆంధ్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి మరో పునాదిరాయి మరోచోట అదే వంతెనకి వేయించారు. వంతెన లేవలేదు. 1957లో పని ప్రారంభించారట. స్తంభాలు లేచాయట. ఎనిమిది తొమ్మిది నెలలుగా పని జరగడంలేదట అక్కడ. ఇటీవల శ్రీ సంజీవరెడ్డి సిద్ధాంతంవద్ద వశిష్ఠపై వంతెనకు మరో రాయి వేశారు. ఈ వంతెన ఎప్పుడు లేస్తుందో చూడాలి.

అలమూరువంతెన ప్రసక్తి ఈ వారం ప్రదేశ్ శాసనసభలో కొత్తపేట నియోజకవర్గం సభ్యుడు శ్రీ సుబ్బరాజు (కాంగ్రెస్) తెచ్చారు. హైవేస్ శాఖ కార్యక్రమ నిర్వహణావిధానాన్ని గురించి దర్యాప్తు జరిపించాలని కూడా ఆయన సూచించారు. సమగ్రపరిశీలన జరపకుండా ప్రభుత్వం పరిశీలన ఏ విధంగా చేస్తుందో అర్థంకాని విషయం. పునాదిరాళ్ళు పడి, పని ప్రారంభం కాకుండా ఉంటం, నాగరికతా దేశాలలో ఊహించరాని విషయం. దురదృష్టవశాత్తు, అలమూరు వంతెన విషయంలో జరిగినది ఒక ఉదాహరణ మాత్రమే.

## అనర్థలేఖావళి

స్వామి అనర్థానందులు ఇలా వ్రాస్తున్నారు:

"మేమీ వారం ఒక పరిషత్తు సమావేశమున కేగుట సంభవించినది. సమావేశము కండని మనుష్యుల నెవ్వరును గాంచలేదు. పరిషత్తులు గాంచుటకే యేర్పడినను, యీ పట్లనిది సత్యము. ప్రాపంచిక సుఖదుఃఖములకు దూరముగనుండి, నల్లకుంట సరస్సునందు స్నానమాడి, నల్లగుట్ట పర్వతమున దపమాచరించు మా బోంట్లకు జీవకోటి యంతయు సమానమే. స్త్రీ పురుష భేదము, వర్ణభేదములు మేము గుర్తించము. అమీరులు, ఫకీరులు మా దృష్టియందు సమానులే."

"ఇదంతయు సత్యమేయైనను, పరిషత్సమావేశమున గూరుచున్న పండితుల వాగ్ధోరణి మా కర్ణద్వయమునకు కటువుగా దోచినది. పరిషత్సభ్యులలో విద్యావతులౌ స్త్రీలున్నారు. పండిత ప్రకాండులకుగూడ నక్కలు, చెల్లెళ్ళు నున్నారుకదా? వారి సముఖమున నుపయోగించజాలని నీచ వ్యంగ్యా(న)ర్థ ప్రతిపాదకమగు భాష నీపండితులేల నుపయోగింప వలయును? సామాన్యులభాషను, భావములను శాసింప సాహసించు పరిషత్సభ్యులు హద్దులు లేకుండ ప్రవర్తించిన నెవ్వ రేమనగలరు? కంచెయే చేను నిరాఘాటముగ మేసిన, చేను కీనరయందు అప్పీలు యేమి యుండ గలదు?

"పూజ్యులు, జ్ఞానవృద్ధులౌ వారలు పామరులను మందలించిరే యనుకొనుము. పామరులు తాత్కాలికముగ నైనను, తమ తప్పు గ్రహించి రనుకొనుము. బహిరంగ పరిషత్సమావేశములందు నిట్టి సంఘటనలు జరుగుటయే లజ్జాజనకముగదా? కలత నిద్దురవలన నీ వారమంతయు మా తపస్సు చెడిపోయినది."

పూర్వాశ్రమంలో పత్రికారచయితగా ఉండి, అర్థం కనపడని విషయాలను గురించి స్వామి అనర్థానందులు వ్రాయ తలపెట్టిన లేఖల్లో ఇది రెండోది. అనర్థానందులు తమ 'గ్రాంథిక గలమును' విసర్జించి వ్యావహారిక భాషలోనే వ్రాస్తే బాగుంటుందేమో? ఈ సంగతి వారికే వినయపూర్వకంగా మనవి చేసుకోవాలి. ★



## న్యూఢిల్లీ లేఖ — శ్రీకృష్ణ

# పరోక్షపన్నుల మూట కొత్తబడ్జెట్

భారత ప్రధాని ఆహ్వానం చైనా ప్రధాని అంగీకరించటం, ఆర్థిక మంత్రి సాధారణ బడ్జెట్ సమర్పించటం, రైల్వే బడ్జెట్—ఇవీ పార్లమెంటులో ఇటీవల చర్చకు వచ్చిన విశేషాలు.

రైల్వే బడ్జెట్ మీద చర్చకు రైల్వే మంత్రి ఇచ్చిన సమాధానం ఉదాత్తంగా ఉందని కొన్ని పత్రికలు వర్ణించాయి. అయితే తనకు మద్దతుగా అయిదుగురు సభ్యుల మెజారిటీయే ఉంటే, రైల్వే మంత్రి ఇంత నిర్లక్ష్యంగానూ సమాధానమిచ్చేవారా అని కొందరి అనుమానం. తను అన్న ప్రతి దానికి 400 తలకాయలు వాటంతట అవి ఊగుతాయిగనుకనే ఆయన ఆ విమర్శలపై అంత హేళనగా మాట్లాడగలిగారు. వింత లోకల్లా వింత—కాంగ్రెసు మంత్రులు గాంధీ సిద్ధాంతాలు ఒకప్రక్క చెబుతూనే ఉంటారు. మళ్లీ విమానాలలోతప్ప ప్రయాణాలు చెయ్యరు రైళ్ళలోనే ప్రయాణం చేస్తూ ఉంటే రైల్వేశాఖ ధర్మమా అని రైల్వేలు ఎంత అధ్వాన్నంగా తయారయ్యాయో తెలుస్తుంది.

రైలుపెట్టెలు సాధారణంగా మురికిగా ఉంటాయి. ప్లాటుఫారాలుకూడా మురికిగా ఉండేట్లు శ్రద్ధ తీసుకుంటున్నారు.

ఇదివరకటిలాగా శుభ్రతను ఎందుకు పాటించటం లేదని ఒకసారి ఒక స్టేషనుమాస్టరును అడిగితే అతడిలా చెప్పాడు: "పాకీ పనివాళ్లని ఏమన్నా అంటే చాలు, రైల్వే మంత్రికి సరాసరి అర్జీ రాసేస్తారు. ఆయన పనివాళ్ళ మీద ఈగల్ని కూడా వాలనివ్వద్దని హుకుం జారీచేస్తారు.

రైల్వే వారోత్సవాల సందర్భములో కాన్పూర్ స్టేషనంతా శోభాయమానముగా విద్యుద్దీపాలతో అలంకరించ బడింది. కాని విశ్రాంతిగదులనిండా చెత్తాచెదారం అలాగే వుంది. పాపం రైల్వే మంత్రి మాత్రం యేం చేస్తారు. ఒకసారి ఆయన ఇంటికి వెళ్ళి చూస్తే. ఆయన ఇంటికీ, రైల్వే స్టేషన్లకీ అట్టే తేడా లేదని తెలుస్తుంది.

1959 లో రైల్వేలలో జరిగిన చిన్న చిన్న దొంగతనాలను గూర్చి (ఫిటింగులు మాత్రమే) మంత్రిగారు లోక్‌సభలో ఈ క్రింది వివరాలు తెలియజేశారు:

ఉత్తర రైల్వేలో 1,12,054 రూ. విలువగల సామగ్రి దొంగిలింపబడింది. మధ్యరైల్వేలో రూ. 4 66 528; పశ్చిమ రైల్వేలో రూ.96,414; తూర్పురైల్వేలో రూ. 5.68 828 దక్షిణ రైల్వేలో 4,01,779 రూ; ఆగ్నేయ రైల్వేలో రూ. 2,83,750; ఈశాన్యరైల్వేలో రూ. 7 424; ఉత్తరసరిహద్దు రైల్వేలో రూ. 10,810; విలువైన సామగ్రి దొంగిలింపబడింది.

తూర్పు రైల్వే దొంగతనాల విషయంలో ముందంజవేసింది. మధ్య, దక్షిణ రైల్వేలు తూర్పు రైల్వేను అందుకోవాలని పోటాపోటీలు పడుతున్నాయి



ఫిబ్రవరి 29 వ తేదీన తమ జన్మదినం కానుకగా కొత్తపన్నులు, లోటుబడ్జెటు సమర్పించిన ఆర్థికమంత్రి

ఒక వస్తువుమీద ఎక్సైజుపన్ను అధికం చేసినప్పుడు — కనీసం అంత మేరకూ దిగుమతి సుంకం అధికం చేయటం ఆచారం. ఎక్సైజు పన్నులలో చేసిన మార్పులను అనుసరించి మద్యపానీయాలమీద దిగుమతి పన్నులలో మార్పులను కూడా ప్రస్తుత బడ్జెట్ లో ఏర్పాటు చేశారు. ఇదే మాదిరి ఆచారం ఇప్పుడు బడ్జెట్‌లోని రెండు భాగాల్లోకీ విస్తరించింది. ఆదాయం ఎక్కువ చేయటం కోసం రైల్వేబడ్జెట్‌లో రైల్వేరవాణా రేట్లను అధికం చేశారు. దీనివలన రైల్వేలో రవాణా కావలసిన సరుకు కొంత రోడ్డు రవాణాకు మళ్ళి ఉండేది. కాని శ్రీ మురార్జీదేశాయి వ్యాపార వాహనాలమీద, శుద్ధి చేసిన డీసెల్ నూనెమీద అంతమేరకు పన్ను విధించారు. అంటే రోడ్డు రవాణా కూడా రైల్వేరవాణా అంత కాకపోయినా దాదాపు అంత ప్రియమూ అవుతుందన్నమాట.

క్రొత్త బడ్జెట్ పరోక్షపు పన్నుల మూట. దేశంలో వస్తువుల ధరలను పెంచటం వల్ల దేశంలో వాటి వాడకం తగ్గించటానికి చేసిన పని కావచ్చు. ఇది. వీటి వల్ల రాబడి ఎక్కువ కావచ్చు. కాని ఎగుమతులు ఎక్కువవుతాయా అని సందేహం.

ఎగుమతులను ప్రోత్సహించాలనే నినాదం మాటున ఒక నగ్నసత్యం అచ్ఛాదితమై పోతోంది. భారతదేశం ఒక పెద్ద విక్రయశాల. అమ్మకందారుకు బ్రహ్మాండమైన మార్కెట్ మనది. మన ఉత్పత్తిదారులు కాలు కదల్చకుండా గుమ్మం దగ్గర సరుకులు పెట్టుకుని అమ్మితే అమ్ముడుపోతాయి. ఇక అతగాడు ఎగుమతి చేసే బాధను, బాధ్యతను నెత్తిమీద ఎందుకు వేసుకుంటాడు? అయితే జరిగేదేమిటంటే—ఎగుమతులను ప్రోత్సహించే మిషమీద—వందలాది వ్యక్తులు చీటికీ మాటికీ విదేశాలకు వెళ్ళి విదేశీ ద్రవ్యం తగలేసి రావటం.

ఏవేవో ప్రతినిధివర్గాలు ప్రపంచయాత్రలు చేస్తూ ఉంటాయి. వాణిజ్యశాఖ డిప్యూటీమంత్రి తూర్పు యూరప్‌లో తిరిగివచ్చారు. క్రితంఏడు యూరప్‌లో ఎగుమతుల ప్రోత్సాహ కార్యక్రమం క్రింద మహిళా సభ్యులతోసహా ఒక ప్రతినిధివర్గం ఊరేగటం నేను చూశాను.

భారతదేశం బోలెడు డబ్బు ఖర్చుపెట్టి విదేశాల్లో వాణిజ్య సలహాదార్లను నియమించి ఉంచింది. భారతీయ వస్తువులను ప్రదర్శించటానికి ప్రదర్శన మందిరాలను ఏర్పాటుచేసింది. పారిశ్రామిక ప్రదర్శనలలో పాల్గొంటూ ఉంటుంది. వివిధ పరిశ్రమలకు ఎగుమతులను ప్రోత్సహించే సదుపాయాలు చేసిపెట్టింది. వీటన్నిటి ఫలితంగా

 

# న్యూఢిల్లీ లేఖ



1959 నవంబరు వరకూ ఎగుమతులు పెరగ లేదు సరికదా తగ్గిపోయాయి. శ్రీ మొరార్జీ దేశాయి పరోక్షపు పన్నులను ఎక్కువగా ఇంజనీరింగ్ వస్తువులమీద విధించారు. ధరలు పెరిగితే వాడకం తగ్గిపోవచ్చు నిజమే. వాడకం తగ్గించటానికే పన్నులు కొత్తవి వేసినట్లయితే అనుకున్నది అనుకున్నట్లే జరగవచ్చు. కాని వీటివల్ల అనుకున్నంత ఆదాయమూ వస్తుందా అని మరో సందేహం.

కొందరు అమెరికన్ పారిశ్రామికులు భారతీయపద్ధతిలో బట్టలు ఉత్పత్తిచేస

ఇద్దరు మహా చెవిటివాళ్ళు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. రైలు ఒక చిన్న స్టేషను వద్ద ఆగింది.

మొ: ఈ స్టేషన్ పేరేమిటండీ?

రెం: ఇవాళ శుక్రవారం.

మొ: ఓహో! అయితే నేను ఇక్కడే దిగాలి.

మారుతి.

"మేడ్ ఇన్ ఇండియా" అని అమ్మకంమీద రగడ రేగింది.

1957లో శాన్ ఫ్రాన్సిస్కోలో భారతీయసమానాలో స్లిప్పర్లు, ఇత్తడి సామాను, మద్రాసు శిల్కు — జపానులో తయారైనవి అమ్ముతుండగా నేనుచూశాను. ఈవిషయం అప్పటి రాయబారి శ్రీ జి.ఎల్. మెహతా, అప్పటివాణిజ్యమంత్రి శ్రీ టి.టి. కృష్ణమాచారి దృష్టికి తెచ్చాను.

కుటీరపరిశ్రమల వస్తువుల ఎగుమతిని ప్రోత్సహించే వంకతో ప్రతి ఏడూ కొందరు సీతాకోక చిలుకలవంటి స్త్రీలు విదేశాలు వెడుతూవుంటారు. మరి పై చెప్పిన దొంగ వస్తువులను వారు చూశారా? చూసి ఏంచేశారు?

* * *

కీ॥ శే॥ మౌలానా ఆజాద్ వల్ల వృద్ధిలోకి వచ్చిన ధర్మమా అని, ఆయన స్మారక చిహ్నాలు బాగానే వెలుస్తున్నాయి. ఆయన గోరీచుట్టూ తోటకాక, ఇప్పుడు ఒక రోడ్డు, ఒక వైద్యకళాశాల ఆయనపేర వెలిశాయి. సెంట్రల్ హాల్ లో ఆయన తైలవర్ణచిత్రం ఒకటి వెలిసింది. బ్రిటన్‌లో "రీత్ లెక్చర్లు" మాదిరిగా ఇక్కడ ఆజాద్ లెక్చర్లు ప్రారంభమయ్యాయి. అసలాయనకు సజీవ స్మారకచిహ్నం శ్రీ హుమయూన్ కబీర్. శ్రీ కబీర్‌ను తయారుచేసింది ఆజాద్. ఇప్పుడాయన గురువుగారికి ప్రజలడబ్బుతో స్మారక చిహ్నాలు నిర్మిస్తున్నారు.

పోల్చకూడదు కాని — సర్దార్ పటేల్ కంటె మౌలానా ఆజాద్ ఎలా గొప్పవాడు? సర్దార్ పటేల్ స్మారకచిహ్నం గూర్చి ప్రశ్నిస్తే ఈ కబీర మహాశయులే — ఆ స్కీమునుగూర్చి దర్యాప్తు జరిగిందని మాత్రం వెల్లడించారు. ఆజాద్ పేరమీద వైద్యకళాశాల కట్టటానికైతే డబ్బు ఉంటుంది గాని, సర్దార్ పటేల్ చిహ్నానికి మాత్రం డబ్బు లభించదు. ఇప్పటి మతాతీత ప్రభుత్వం సర్దార్ జీని నిర్లక్ష్యం చేస్తే చేయవచ్చు. మౌలానా ఆజాద్ స్వీయ చరిత్రలో సర్దారును గూర్చి ఏవేవో మాటలు విసిరితే విసరవచ్చు. కాని నిష్పాక్షికులైన ముందుతరం చరిత్రకారులు మరొకరకం కథ వ్రాస్తారు. జర్మనీకి బిస్మార్కు లాంటివాడు ఈ దేశానికి సర్దార్ పటేల్. ఈ దేశ చరిత్రపై ఆయన వేసిన ముద్రకు ఏ స్మారక చిహ్నమూ అక్కరలేదు. ఆయన చేసినపనే ఆయన స్మారకచిహ్నం.



ఎస్. సుబ్బలక్ష్మి

## పెళ్ళి

జానకి పెళ్ళి అనుకోకుండా జరిగింది. తనతో తిరిగి వున్న స్నేహితుల్లా తన పెళ్ళి సంఘటన కళ్ళఎదుట చూస్తున్నట్లు వూహించుకుని తనలో తనే నవ్వుకుంది జానకి.

తను ఓసారి బంధువుల యింట్లో పెళ్ళికి తల్లితో వెళ్ళటం జరిగింది. అక్కడికి వాళ్ళ దూరపు బంధువు ఒకామె వచ్చింది. ఆవిడ తనని చేరతియ్యటం చిన్నతనం మూలాన్ని ఆవిడచుట్టూ తిరుగుతూ ఆవిడకి చిన్న చిన్న పనులు చేసి పెడుతూ ఆవిడని తను వదలకుండా తనని ఆవిడ వదలకుండా ఆ నాలుగురోజులూ కులాసాగా గడిచిపోయాయి తనూ, తల్లి తిరిగి వచ్చేశారు

తరవాత రెండు ఏళ్ళు గడిచాయి. అది వేసంకాలం అవటంచేత అంతా పందిట్లో పడుకున్నారు. తనూ పందిట్లో పడుకు చేది కాని, తనముందం అక్కయ్య అత్తగారి ఆక్రమించుకుంది. తనని తమ్ముడుగారి దగ్గర పడుకో మంది అమ్మ. నేను పడుకోను, అక్కడే పడుకోమని పట్టుపట్టింది తను. అమ్మ వీపు మీద వక్కటి అంటించింది. దానితో పెంకితనం ఎగిరిపోయి, బామ్మదగ్గర అరుగుమీద కింద పడుకుంది. అమ్మడూ కిందపడుకున్నావు ఏమిట" అంటూ తన కొంగుకి కొక్కు పుచ్చుకులాగి పడుకోపెట్టుకుంది. ఆమె పక్క, పరుపూ అక్కల్లెను సరికదా దిండు కూడా పెట్టుకోదు. తన కొంగు పరుచుకు చెయ్యి తలకింద పెట్టుకు పడుకుంటుంది. సరిగా అది కూడా తనకిచ్చి కిందపడుకుంది బామ్మ.

'పెళ్ళీడు పిల్లకదా దాన్ని ఎందుకట్టా విడిపిస్తారు. పెళ్ళి అవుతే వాళ్ళు వుంచుతారా, అది వుంటుందా – మీ అమ్మకి మరీ వచ్చింది' అంటూ తన వీపు నిముగుతూ పడుకుంది బామ్మ.

ఇంకా చీకటివుండగానే, పిన్ని వచ్చి అమ్మడూ లే అని మెల్లిగా లేపింది. పిన్నికి తోడుకావాలంటే తనను తీసుకువెళ్ళటం అలవాటు. అందుకేమో అనుకుని లేచి కూర్చుంది తను. 'తొందరగా మొహం కడుక్కో జడవేస్తా'నంది పిన్ని.

తను మళ్ళా పడుకోబోయింది. "లే తొందరగా కానీ, మళ్ళీ వర్జం వస్తుందిట" అంది. తనకేమీ అర్థంకాలేదు. పిన్ని తనకి మునాబు చేసింది. గజ్జలపట్టెడ తీసి పెట్టింది. అక్కయ్యకి అత్తగారు పెట్టిన చంద్రహారం కూడా వేశారు. వాళ్ళఅత్తగారి పెనకొత్తలే వచ్చి, 'పెళ్ళివారు వచ్చారన్న సంబడంలో అది కొస్తా ఎక్కడేనా పూరేగింపు జాగర్త' అంది వెటకారంగా.

'వాళ్ళు' చూసుకోవటం, లాంఛనాలు దగ్గరా మాట్లాడటం నాలుగురోజుల వ్యవధిలో ముహూర్తం పెట్టడం పెళ్ళి చాలా వైభవంగా జరిగించాలని నలుగురూ అనుకోవటం

అంతా చిత్రంగా జరిగిపోయింది. అన్నీ ఎల్లా వున్నా జానక్కి తగినట్టే రామచంద్రమూర్తిరావటం వింతగా లేదూ?' అని అత్తయ్యలు వేళాకోళం చేశారు.

ఊరేగింపు అవుతోంటే 'కాఫీ కావాలా' అని అతను, తనను అడగటం, ఆమాట కొస్తా వదిన అందరిదగ్గరికీ మోయ్యటం అంతా తనను ఏడిపించటం వదిన, అక్క, తనతో మాటానిద్దరికి రావటం, మళ్ళీ అతను తన స్నేహితుల్ని తీసుకువచ్చి తనను చూపించటం, స్నేహితుడు వక కర్పూరంగొమ్మ అతని చేతికిచ్చి తనకివ్వమనటం, ఇచ్చేటప్పుడు తను యిద్దర్నీ ఫొటో తియ్యటం, తనకంటే పెద్దవాళ్ళయినా, మరదులు తనతో కబుర్లు చెపుతూ మాట్లాడటం ఎంతో బాగున్నాయి ఆనాడు రోజులూ. తరవాత ఇంటికి వచ్చే దాకా తనూ అక్కా వదినా చుట్టాలు అంతా ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళారు.

ఈఏడాదిలో అత్తగారు మూటి రెండు సార్లు తనను తీసుకువెళ్ళినా, అమ్మ వాళ్ళా వెంటనే రెండురోజుల్లో తీసుకురావటం జరిగింది

ఇంతలో అక్కకి కొడుకు పుట్టాడు. వాడి బారసాలకి వచ్చి, అత్తగారూ మామగారూ వాళ్ళతో పాటు తనను తీసుకువెళ్ళారు. ఈ సారి వాళ్ళతో వెళ్ళటం కొంచెము భయం వేసింది. పిన్ని, బామ్మ, అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. బాబాయి వాళ్ళని రోడ్డు తీసుకువెళ్ళ తీసుకుంటూ బండిదాకా సాగనంపాడు తనక్కూడా ఏంగుకోవడుపొచ్చి వెక్కివెక్కి ఏడ్చేసింది. బాబాయి తనకు ధైర్యం చెప్పి 'మీ అత్తగారు అందరిలాంటిది కాదు చాలామంచిది. మళ్ళీ ఓ వారంలో నాన్నగార్ని పంపుతాను. లేకపోతే నేనైనా వస్తాను నువ్వు బెంగ పెట్టుకోవద్దు మీ అత్తారింట్లో ఎవరు ఏమన్నా నువ్వు ఎదురు చెప్పకూడదు సుమా" అని చెప్పి, జేబులోంచి కొంతడబ్బు తీసియిచ్చి 'దగ్గర పెట్టుకో. ఏదయినా కావాలంటే మీ అత్తగారికిచ్చి కొని పెట్టమను" అని చెప్పాడు.

'అక్కగారూ! మా అమ్మాయి ఆ పొరపాటు ఏమన్నా వున్నా కడుపులో పెట్టుకోవాలి దానికి చిన్నతనం" అని చెప్పి మమ్మల్ని సాగనంపాడు మా బండి కదలబోయేదాకా చూసి కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

* * *

## కాపురం

ఈసారి జానక్కి అత్తవారిల్లు చాలా కొత్తగా తోచింది. అత్తగారు ఎంత దనుపుగా వున్నా ఆవిడకి ఏమిచేస్తే కోపం వస్తుందో అని భయపడుతూ మసులుకోవటం మొదలెట్టింది.

మరుదులతో మాట్లాడేందుకు కూడా భయంవేది. జానకివచ్చి అప్పుడే యిరవై రోజులయింది. మామగారికి వడ్డిస్తూ అత్తగారు, "రామానికి సెలవలు యిచ్చి యిన్నాళ్ళయినా యింకా రాలేదేమిటండీ తొందరగా రమ్మని రాయండి యివాళ" అంది. అంతలో తలుపువెనక నిల్చున్న జానకిని చూసి, "పిల్లా నీ మొగుడిని గురించి ఏమి చెప్పుకుంటున్నామో అని వింటున్నావా ఏమిటి" అని నవ్వుతూ, "మీ మరుదుల్ని పిల్చుకురా. మీకు కూడా పెడితే నాపని తెములుతుంది" అన్నారు. జానక్కి ఎందుకో గుండెలు కొట్టుకున్నాయి. తను నిజంగా వాళ్ళ మాటలు వినేందుకే నిల్చుంది అనుకుంటారేమోనని భయపడింది. ఇంకెప్పుడూ అల్లా చెయ్యకూడదు అనుకుంది.

ఇంకోవారం గడిచింది. రామం, ఇంకో యిద్దరు స్నేహితులతో కూడా ఆ రోజు వచ్చాడు. అతని పేరు రామచంద్రమూర్తి అయినా అంతా రామం అనే పిలుస్తారు. స్కూల్లో కాలేజీలో అటెండెన్సు వేసే టప్పుడూ, పెళ్ళిలో అమ్మాయి చేత అమ్మమ్మ చెప్పించినప్పుడూ తప్ప అతన్ని పూర్తిపేరెట్టి పిల్చిన పాపాన పోలేదు ఎవ్వరూను.

జానకిని అత్తగారు పిల్చి కాఫీ పట్టుకెళ్ళి యిచ్చిరా వాళ్ళకి అన్నారు. పట్టుకెళ్లేందుకు సిగ్గుపడి కదలకుండా నిల్చుంది.

"అంత సిగ్గయితే ఎల్లాగే పిల్లా. పోనీ మురళీని పిలు. యిస్తాడు" ఇంతలో రామం అక్కడికి రావటం, "చూడరా మీ ఆవిడ కుర్రపిల్లలా మారాం చేస్తోంది. కాఫీతీసుకెళ్ళమంటే" అని అత్తగారనటం, అతను తనకేసి తేరిపార చూడవయ్యటం — తనకెందుకో గుండె గబగబ కొట్టుకుని ఒళ్ళు దడచ్చిపోయినట్టయింది. పక్కింటి లక్ష్మి, 'చూడుపిన్నీ! అన్నయ్యని చూడగానే వదిన మొహం కందగడ్డలా ఎల్లా ఎర్రపడిందో" అంది.

"నువ్వు ఎప్పుడు వచ్చావే. నీ పెళ్ళి అవుతే నీమొహమూ ఎఱ్ఱ పడుతుందిలే."

"పో పిన్ని మీ మాటలు, అమ్మ, మీగ ట్టాడి యిచ్చిరమ్మంటే వచ్చా."

"ఆ కొస్తా యివ్వకపోతే ఏమి? నీ అమ్మనంతా పోజం, ఆ గిన్నె అక్కడపెట్టి ఆ కాఫీలు పట్టుకెళ్ళి వాళ్ళకి ఇచ్చిరా. పో" అని పురమాయించారు అత్తగారు.

రామం స్నేహితులు కులాసాగా వారం గడిపి వెళ్ళిపోయారు. జానక్కి అత్తగారు పువ్వులజడ వెయ్యటం సాయంత్రము తెల్లచీర కట్టుకోమనటం నిత్యకృత్యాల్లో ఒకటిగా అయింది.

ఆ రోజు అన్నీ సవరించి మామగారికి మంచినీళ్ళు పెట్టి అత్తగారికి పక్కవేసి వెళ్ళేసరికి చాలా పొద్దుపోయింది. ఆయన ఇంకా చదువుకుంటూనే వున్నారు తనను చూడట్టు. జానకి అలాగే నిల్చుంది చాలాసేపు. జాలేసిందో ఏమో అటుచూసి, "ఆ జడ వేసుకోవద్దంటే వినవా నువ్వు" అని కొంచెము కోపంగా అడిగారు "మీ అమ్మ వేశారు' అని చెబుదామనుకున్నా, ఎవరో కంఠం నొక్కినట్టు మాటరాలా పైకి. 'నేను తెచ్చిన సిల్కుచీర కట్టుకుని, ఆ జడ విప్పి వదులుగా అల్లుకురా" అని జానకికేసి చూడకుండానే ఆజ్ఞ జేశాడతను.

జడ అయితే వేసుకోవచ్చు. చీర తెచ్చుకోవటం ఎల్లాగ? తనపెట్టె అత్తగారి మంచము క్రింద వుందాయె. ఆవిడ ఏమంటారో. ఆవిడకి మెలుకువ వస్తే ఏమి చెప్పటం? కట్టుకోకపోతే ఈయన ఏమంటారో ఎటూ పాలుపోక గోళ్ళు గిల్లుకుంటూ నిల్చుంది జానకి. చూసిన వాళ్ళంతా తన జడని మెచ్చుకుంటారే, ఈయనేమిటి ఈ జడ బాగా లేదంటారు. పోనీ విప్పి అల్లుకుందామని ముందుకు తీసుకుంది జడ. ఆ పువ్వుల్ని చూస్తే విప్ప బుద్ధిపుట్టలా. చివరికి ఎల్లాగో విప్పి జడల్లుకుంది. తరవాత. కొంచము దగ్గరికివెళ్ళి ధైర్యము తెచ్చుకుని, "నా పెట్టె మీ అమ్మగారి మంచము క్రింద వుంది. ఆవిడ లేస్తారేమో" అని వణుకుతూ వున్న కంఠముతో అంది.

"పూ" అని విసుగ్గా పుస్తకం బల్లపై!

#  కాపురం... 

దిసరివెళ్ళి పడుకున్నారాయన. పుస్తకంతీసి పక్కన పెట్టింది. దానికింద ఉన్న ఫోటో తీసి చూసింది. జానకికి కర్పూరపుబొమ్మ యిచ్చిన అతను యింకో అతనువెనుక నిల్చున్నారు; ముందు ఈయనా పక్కగా ఒక అమ్మాయి కూర్చున్నారు. ఆ ఫోటో చూస్తే తనకి సిగ్గేసింది. పరాయి వాళ్ళపక్కన అల్లాకూర్చోవచ్చా? ఆ అమ్మాయి అంటే యిష్టమేమో. అందుకే తనని చిన్నచూపు చూస్తున్నట్లున్నారు. ఈ ఆలోచనరాగానే ఒళ్ళంతా జెఱ్ఱులు పాకినట్టయింది.

జానకి మొహం చూసి గ్రహించారేమో తనని వెక్కిరించినట్లు నవ్వుతూ, "అమ్మాయిని చూడు ఎంత అందంగా అలంకరించుకుందో" అన్నారు.

జానక్కి ఒళ్ళు మండింది. ఆపిల్లవి చిన్న చిన్న కళ్ళు. ఆ పిలకజడ ముందుకి వేసుకుంది. అలా వుంటేనే అందముగా వుంటారు కాబోలు. తనని ఎందుకు చేసుకున్నట్లు? జడ అయితే జుట్టు వూడితే చిన్నదవుతుంది, కాని కళ్ళు ఎలా చిన్నవవుతాయి. జానక్కి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కనపడకుండా గోడ వేపు తిరిగి నిల్చుంది.

"పెద్దజడవుండటం ఒకందుకు వుపయోగం" అంటూ చేతికి చుట్టుకు ముడుచుకు లాగారు. తను కిందపడబోవటం, పడకుండా ఆపటం పకాలున నవ్వడం...

జానకి లేచేసరికి చాలా ప్రొద్దెక్కింది. రామంకేసి చూసి సిగ్గుపడింది. తరవాతేవన్నట్లు చూసి రామం ధైర్యం చెబుతున్నట్టు నవ్వాడు. పిల్లిలావెళ్ళి మొహం కడుక్కుని స్నానముచేసి, జడవిప్పి ముడిపెట్టుకు. అత్తగారు ఏమంటుందో అని జడుస్తూ వంట గదిలో అడుగుపెట్టింది. "పిల్లా, యిప్పుడా లేవటం? ఆ కాఫీలు యిచ్చివచ్చి యీ కూర తరుగు" అంది అత్తగారు తనవేపు చూడకుండానే.

"పిన్నీ అమ్మ కొందను పువ్వులు తెమ్మంది పూజకి. రామం అన్నయ్య కోయ్యొద్దు అంటున్నాడు చూడు...పిన్నీ పిన్నీ వదిన్ని చూశావా సినిమా యాక్టరులా ముడి వేసుకుంది" అంటూ పక్కింటివారమ్మాయి లక్ష్మి తిప్పుకుంటూ చెప్పుకుపోతోంది.

"మీ వదిన సినిమా యాక్టరు, నువ్వు నాటకం యాక్టరు వీను, పదేనా. వెళ్ళి ఆ నందివర్ధనం మందారపూలూ కోసి నాకు కొంచెం యిక్కడ పెట్టి నువ్వు తీసుకువెళ్ళు. మీ అమ్మ కనిపెట్టుకుంటుంది" అన్నారు అత్తగారు.

* * *

ఆ వేసంగిగడిచింది. మరుదులు వేరేవూళ్ళు చదువులకి వెళ్లారు. రామం ప్యాసయ్యాడు. ఆ వూళ్లో ఆ ఏడే పెట్టిన కాలేజీలో తండ్రి బలవంతంవల్ల వుద్యోగానికి చేరాడు.

రామం కాలేజీనుంచి రాగానే తండ్రికి సహాయంగా పొలాలదగ్గర కెళ్లి పనులు చూడటం జానకి అత్తగారికి ఇంటిపనుల్లో చేదోడుగా వుండటం-ఒడుదుడుకులు లేకుండా మూడేళ్లు గడిచిపోయాయి.

## తోడికోడలు

పెద్ద మరదికి పెళ్ళిసంబంధం వచ్చింది. అత్తగారు మామగారు వెళ్ళి చూసివచ్చారు. మామగారికి నచ్చలేదు. చదువున్న పిల్ల మన మాట ఏమి వింటుంది. నాకు నచ్చలేదన్నారు. 'పెళ్ళికొడుకు' వచ్చాక అత్తగారు మళ్లీ అతనితో అమ్మాయిని చూడటానికి వెళ్లారు. అతనికి పిల్ల నచ్చింది. అత్తగారికి కష్టం వచ్చింది. "పెద్దకోడల్ని అందం చూసీ, వాళ్ళమర్యాద చూసి చేసుకున్నాం. ఈసారి పిల్ల చదువూ, వాళ్లడబ్బూ చూసి చేసుకుంటున్నాము, అని అడగకపోయినా అందరికీ గర్వంగా చెప్పేవారు.

మామగారికి ఎక్కువ ఇష్టంలేకపోయినా నప్పుకోక తప్పలేదు. పెళ్ళి ఏదో అయిందనిపించారు. పెళ్లిలో పిల్లవేపువారు అత్తగార్ని తప్ప మిగిలిన వాళ్లని సరిగ్గా చూడలేదు ఎవరి నటుక్కవాళ్లు ఎక్కడో ఒకచోట భోంచేసి ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోయారు. మిగిలిన వాళ్లలో కోడలు జానకి, చెల్లెలు శేషు వున్నారు. వీళ్ళకి ప్రత్యేకం నేయించినటు ముతక చీరలు తెప్పించి పెట్టారు. కోడలు మాట్లాడకపోయినా శేషు గుసగుసలాడింది.

మళ్ళీ పిల్లతో వచ్చినవాళ్లకి మాత్రం అత్తగారు, ఎక్కడ లోపం వస్తుందో అని అతిమర్యాదగా చూసి వాళ్లకి ఖరీదయిన బట్టలు తెప్పించిపెట్టి పంపారు. పెద్దమరిది మురళీకివున్న కొద్దిశెలవలూ అత్తారింట్లో గడిపి అక్కడనించి వెళ్ళేటట్టు ఏర్పాటు చేసి తీసుకెళ్లారు.

మురళీ వేసంగి శెలవలకివస్తూ, అత్తవారి వూరువెళ్లి, భార్యని తీసుకువచ్చాడు. అత్తగారు, 'చిన్నకోడలికి ఏమికావాలో చూడు కొత్త దానికి' అని పెద్దకోడలికి పురమాయించింది.

ఆ సాయంకాలం పక్కయింట్లోవాళ్లు, దొడ్లో కాపురమున్న అమ్మమ్మగారు వచ్చారు. 'వదినా చిన్నకోడలు వచ్చిందటగా ఏది' అని ఒకరూ, 'ఏమమ్మా నీకోడలు సారె ఏమి తెచ్చుకుంది? చూడు చూపిస్తే చూసి సంతోషిస్తాముగా' అని ఒకరూ అత్తగార్ని అడగటం మొదలుపెట్టారు. 'జానకీ సుశీలని ఇలా పిలూ, అమ్మమ్మగారు చూస్తారుట" అన్నారు అత్తగారు.

జానకి వెళ్ళింది పిలుద్దామని. గది తలుపులు వేసివున్నాయి. పిలవటమా వద్దా అని సందేహముతోనే నెమ్మదిగా తలుపుతట్టింది. సుశీల తలుపు తెరవటమే ఆలస్యముగా తెరచింది. ఏమి కావాలన్నట్టు కోపంగా చూసింది. అత్తగారు పిలుస్తున్నారు అని చెప్పి జానకి వెళ్ళిపోయింది.

సుశీ కొంతసేపు తరవాత, "ఎందుకుపిలిచారు?" అంటూ వచ్చింది. అమ్మమ్మగారు "చిన్న కోడలా, నువ్వు తెచ్చినవి చూపిస్తే, చూసి వెడదామని యింతసేపు కూర్చున్నామే" అన్నారు.

"ఏమండోయి మీరు నాకు ఏవిధంగా చుట్టాలో తెలీదు కాని, నన్ను మీరు పేరు పెట్టి పిలిస్తే బాగుంటుంది. దయచేసి 'ఏమే' అని 'కోడలా' అని మాత్రము పిలవద్దు. మాకు అల్లాంటి అలవాట్లు లేవు" అన్నది

అమ్మమ్మగారు కొంచెం, చిన్నబుచ్చుకున్న మొహముతో "సరేలే అమ్మా. ఇంక ఎప్పుడూ అలాపిలవను పెద్దదాన్ని, తెలీక అన్నదానికి ఏమి అనుకోక" అన్నారు.

"అమ్మలూ బెట్టుసరి అయిందే" అని జానకిని చూసి అనేసారు - అక్కడనించి వెళ్ళాలి అనే వుద్దేశ్యంతో. జానకి లోపలికి వెళ్లబో





తోంటే 'వద్దే అమ్మా నే వెళతాను' అని అత్తగారికి చెప్పి అమ్మమ్మగారు వెళ్లిపోయారు.

సుశీల, అత్తగారి కేసి చూసి 'ఎందుకు పిల్చారుట. తొందరగా చెప్పండి, ఆయన సినిమాకి వెడదాము అంటున్నారు. ఇందాకా కాఫీ ఏమి బాగాలేదుట. కొంచెం స్ట్రాంగు గా కలిపి పంపమంటున్నారు" అంటూ జానకి వేపు చూసింది. జానకి అత్తగారి కేసి చూసింది.

"ఇవ్వాళ్ళ నించి బాగున్న కాఫీ నువ్వు రాగానే బాగాలేదు. ఏమో అయినా వాడికి ఎల్లావుంటే బాగుంటుందో నీకు తెలుస్తుంది. నువ్వే కలిపి పట్టుకెళ్లు. ఆ చేత్తో నాక్కూడా కొంచెము యిస్తే రుచిచూస్తా." అంది అత్తగారు.

సుశీల, అత్తగారు తనని చులకనగా మాట్లాడించినట్టుందో ఏమో, మొహం కంద గడ్డలా ఎర్రగా చేసుకుని, కళ్ళు చిట్లిస్తూ, మూతివిరిచి పెట్టి వొక్క విసురున తిరిగి వెళ్ళిపోయింది.

వచ్చినవాళ్లు ఏమి అనుకోకుండా, "కొంత అణుకువగా మాట్లాడ్డము తెలీక – అంతేకాని, పిల్ల మంచిదే" అని అత్తగారు సర్ది చెప్పారు.

"మా జానకి మాత్రము తక్కువదా! అత్తగారికి మామగారికి కలిపిపోసినటు వాళ్లకి ఇష్టం తగుతారా? పాడి కొంచెము ఎక్కువవేసి కలిపి పంపు" అని జానక్కి నవ్వుతూనే సన్నగా చివాట్లు పెట్టి పంపారు.

వచ్చినవాళ్లు వెళ్లాక, "మీగు పట్టుకెళ్ళి యివ్వండి" అని కాఫీ కలిపి, గిన్నె తెచ్చి అత్తగారి దగ్గర పెట్టింది జానకి.

"ఇదీ నాకే పెట్టావూ" అంటూ చేతులు నే కానించి, లేచి, గిన్నె పుచ్చుకుని, వెళ్లారావిడ.

## అత్తగారు

ఎంతసేపటికీ అత్తగారు రాలేదు. చీకటి పడుతోంది. జానకి మరికొట్టుకు వంట ప్రయత్నంలో పడింది. కంది పచ్చడి రుబ్బడానికి రోటి దగ్గరకి వెళ్ళింది. అత్తగారు గట్టిగా మాట్లాడుతున్నారు. అంతకంటె గట్టిగా తోటికోడలు కంఠం వినిపిస్తోంది. రోటిదగ్గర పని పూర్తిచేసుకుని లోపలకి వెళ్ళింది. మామగారు 'వంటయిందా'? అంటూ వచ్చారు "నువ్వే చేస్తున్నావేవమ్మా? మీ అత్తగారు ఎక్కడికి వెళ్ళింది?" అన్నారు.

"ఎక్కడికి వెళతాను యెట్లోకి. చిన్న కోడలు సవాలు చేస్తోంటే విని ఆనందిస్తున్నా. తెల్లవారి వచ్చిందో లేదో జీవితమంతా నాతో ఎల్లా గడపటమా అని బెంగ పడిందిట. అనగింతలో అరభాగం కాలేదు యింకా. వాళ్ళు యింట్లో వంటవాళ్ళతో వసుంగా పోలుస్తోంది నన్ను."

మామగారు నవ్వుతూ, "అందులో తప్పేమి వుందే! నువ్వు వంటదానివి, నేను పై పనులు చేసేవాడిని. సరేనా. అప్పుడే అయిందనుకో. మనవలు పుట్టనీ వాళ్ళ చేత ఏమి అనిపిస్తానో చిందువుగాని!"

"చాల్లెండి మీ వేళాకోళం." మీరు అనిపించనక్కర్లేదు, వాళ్ళే అంటారు. మీ మనసు తీర్చేందుకు మనవలు అక్కర్లేదు. కోడళ్ళే తీరుస్తారు ... ఏవేఁ జానకీ, ఆ పచ్చడి ఎందుకే చేశావు? వాళ్లు తింటారా ఏమన్నానా? ఆ అరటికాయలు యిలా పడెయ్యి తరుగుతా. ఏమి చెయ్యాలో అడిగితే నీ సొమ్మేంపోయింది?—అంటూ విసుక్కోవటం మొదలు పెట్టారు అత్తగారు.

భోజనాలకి కూర్చున్నారు. సుశీల వచ్చి మురళీ పక్కన విస్తట్లో కూర్చుంది. ఆ పక్కన అత్తగారికికూడా వడ్డించిందికాని 'నాకిల్లా పెట్టవే' అంటూ తలుపుకి జార్లపడి గుమ్మందగ్గర కూర్చున్నారావిడ. అంతా భోజనాలు చేస్తున్నారు. "పచ్చడి చాలా బాగుంది. కొంచెం తీసుకురా, అమ్మా జానకీ," అంటూ అత్తగారికేసి చూశారు మామగారు.

"ఎందుకు బాగుండదూ, గిన్నెడు నెయ్యి పోసి వుంటుంది పోపులో. ఇంక వేరే వేసుకో అక్కర్లా అన్నంలో. మీరు బ్రతుకు తెరువు తెలిసిన మనుషులు. నాకు అల్లా మొహమ్మెచ్చు మాటలు చాతకావు" అన్నారు అత్తగారు.

"పచ్చడి ఎల్లా వుందంటే, పంచాంగం చదువుతావేమిటి? నువ్వెప్పుడైనా యిల్లా చేశావా చెబుదూ" అంటూ వేళాకోళం చెయ్యటం మొదలు పెట్టారు మామగారు

"చేతో వాతో చేశాను ఎల్లాగో గడిచిపోయింది కాలం. కోడళ్ళువచ్చారు. నాకూ సుఖపడాలని వుంది. రేపు చిన్నకోడలి చేత చేయిస్తా; ఆవిడ వంటకూడా రుచిచూడాలని వుంది" అంటూ సుశీలకేసి వారగా చూశారు అత్తగారు.

"అంత సాహసం చెయ్యక, ఎప్పుడేనా జెరంవస్తే జావ బాగా కాస్తుంది. ఏది మొదలు పెట్టినా చివరకి జావగా ముగించగలశక్తి ఒక్క సుశీలకే వుందనుకో," అని నవ్వుతూ మురళి సుశీల వేపు చూశాడు అత్తగారు గట్టిగా నవ్వుతూ "నువ్వు డాక్టరుగా వచ్చే సరి- ఒక్కరికి మందుతో అవసరం లేకండా అందరి రోగాలూ జావతో కుదురుస్తుందంటూ..."

"ఏవమ్మోవు జానకీ, ఆ పెరుగంతా మీ ఆయనకీ మామగారికీ వడ్డించావా ఏమిటి?, అందరికీ చూసి వడ్డించుకోవాలి. కాని ముందువాళ్లకి దిమ్మరిస్తే, వెనక వాళ్ల పని ఏవి కాను? అంటూ కోపంగా చూశారు.

"ఇవాళ విష్ణుగా భోంచేశా ననుకుంటే నీకళ్లుపడ్డాయి. అయినట్టే నాపని. జానకి అప్పుడే పెరుగంతా మీ అత్తగారికి పోసి ఉమ్మా లేకపోతే నాకు జీర్ణంకాదు యినాళ్ళే–" అంటూ మామగారు హేళన చేశారు.

"నాకు వంట రాకపోవచ్చుకాని వడ్డన యింతకంటే బాగానే చేస్తాను. గంటనించి చెయ్యి ఎండిపోతోంది" అంటూ విసుక్కోవటం మొదలుపెట్టింది సుశీల. పెరుగుగిన్నె అత్తగారి దగ్గర పెట్టబోయింది పొరపాటున జానకి. వడ్డన ఆలస్యము అయిందన్న కోపంతో కంచము లో నీళ్ళుపోసి లేచిపోయింది సుశీల. అత్తగారు జానకిని గట్టిగానే చివాట్లు పెట్టారు.

జానక్కి ఆ పూట భోజనం చెయ్య బుద్ధి పుట్టలా. అక్కడి పని పూర్తిచేసుకు జానకి తనగదిలోకి వెళ్ళింది. పెరట్లో తల్లీ పెద్ద కొడుకూ కొంచెము గట్టిగా మాట్లాడుకుంటున్నారు మామగారు అత్తగార్ని కోప్పడుతున్నారు. 'పోనీ నీకిష్టం లేకపోతే వాళ్లకి వేరు పెట్టెయ్యి కొంతకాలం. నేను వద్దన్నానా?' అని తల్లితో అంటూన్న మాటలు జానక్కి ఎందుకో బాధగా తోచాయి. మళ్ళీ మామగారి కంఠము వినిపించింది "చిన్నకోడలిమీద కోపం జానకిమీద చూపిస్తే ఏం లాభం. అదీ చిన్నపిల్లే, పోనీ కొన్నాళ్ళు వంటకి ఆ రాజమ్మగార్ని పెట్టరాదూ, అంటున్నారు. "అవును పాపము

 **కాపురం...** 

యిన్నేళ్లనించీ ఈ జాలి ఏమయిందో. ఏను కలు చిప్పెయు కసేటట్టు చాకిరీచేశాను. నన్ను చూసి జాలిపడ్డవాళ్లు లేరు. మానాన్న యింతో అంతో యిచ్చిపోయాడు." అంటు న్నారు అత్తగారు. మామగారు మోస్వధోర ణిలో, "ఆ. మీ నాన్నయిచ్చింది ఆయన చేసిన అప్పులకడికి చాలదు. అవి తీర్చలేక చచ్చాను యిప్పటిదాకా."

"పోనీలెండి యిప్పుడు దెప్పటం ఏమి ప్రయోజనం. యిద్దరము పెద్దవాళ్లమయ్యాము. ఇంకో జన్మలోనయినా అనుకూలమైన భార్య కావాలని మొక్కుకోండి" అన్నారు అత్త గారు ఉక్రోషంగా.

"నేను నిన్ను చేసుకున్నానని ఎప్పుడూ బాధపడలేదు. అంచేత నీకేమయినా అటు వంటి బాధలుంటే ఆ మొక్కులు నువ్వే కానియ్యి."

"అబ్బ ఏమి టండీ ఆ మాటలు. మీకు వచ్చిందా ఆ నీ మాటలు ఎవరేనావింటే నిజమే అనుకుంటారు" అన్నారు అత్త గారు కంఠం మార్చి. తరవాత ఏమి అను కున్నారో, జానకికి నిద్రపట్టింది. జానకి మెలకువ వచ్చేసరికి రామం దగ్గరగా కూర్చొని ఎంతో ఆప్యాయంగా విప్పు నిమురుతూ ఎందుకు ఏడుస్తున్నావు కల వచ్చిందా ?" జానకికి, నిద్దట్లో ఏడవటం జ్ఞాపకము లేకపోయినా, అంటున్నాడు. భర్త ఆప్యా యంగా పరామర్శించేసరికి తల్లిని కౌగలిం చుకు ఏడ్చే పసిపిల్లలా అతనిదగ్గరగా జరిగి వెక్కి వెక్కి ఏడ్చింది. రోజులుగడుస్తున్నా జానకి ఇదివరకులా ఇంట్లో స్వతంత్రంగా తిరిగేందుకు భయపడుతోంది. అత్తగారు ఏమంటుందో, తోటికోడలికి ఎక్కడ కోపం వస్తుందో అని బెదురుగా తిరిగేది. ఈమారు, అత్తగారు నేరేపినంగా వుపొంచుకునిం చిన్నకోడల్ని చూసి పెద్దకోడలు నేర్చు కుంటోందని యింకా విసుక్కోవటము మొదలుపెట్టారు.

## అపనింద

ఆరోజు మధ్యాహ్నము రామం కాలేజి నించి తొందరగా యింటికివచ్చాడు. జానకి కాఫీ కలిపి తీసుకువెడుతోంది. మురళీ జామ చెట్టు కొమ్మపై కూర్చున్నాడు. రామం గదిలో కిటికీకి దగ్గరగా నిల్చొని మురళీతో మాట్లాడుతున్నాడు. "ముందు ఆ కాఫీ తాకిద్దూ నీకు పుణ్యమువుంటుంది" అని వంగి అందుకోబోయాడు మురళీ. ఆ సమయానికి సుశీల పెరట్లోకి వచ్చింది. ఎప్పటినించో అణిగివున్న అనుమానము విత్తితలంవేసి వుప్పెనలా పయికివచ్చింది, ముఖము కమిలి నట్టు అయింది, కంఠము బొంగురుపోయింది. "నన్ను ఎందుకు చేసుకున్నారు? మీకు యిష్టము వచ్చినవాళ్లతో సరసాలాడుతూ వుంటే వాలుగా. నాకు మొదటినించీ అనుమానం గానే వుంది. ఆనిసని చూస్తేచాలు మీకు ఎక్కడలేని ఆనందమూను. అంతమాత్రము గ్రహించలేను అనుకోకండి" అంటూ విచక్షణ లేకుండా నోటికివచ్చినట్లు మాట్లాడు తోంది. మురళి కోపంగా, 'తెలివికి సంతో షించాము కాని నోరుమూసుకుంటేమంచిది" అని సుశీలని కసిరాడు. దానితో సుశీల యింకా గట్టిగా 'సంతోషించేవాళ్లు ఎదురు గావుంటే నా తెలివి ఏమి కనపడుతుంది మీకు; చదువు సంధ్యా లేనివాళ్లకి యిల్లాంటి తెలివి ఎక్కువ అనుకుంటా" అంటూ, కసిగా జానకికేసి చూసింది. జానక్కి ప్రతిమాటా కాల్చి వాతలు పెట్టినట్టుగా వుంది. కాళ్లకింద మట్టి, లోపలికి దిగిపోతూ న్నట్టు, కళ్ళుతిరిగి క్రిందపడేటట్టు-ఎల్లాగో, అయిపోయింది. నోటికి తాళంపడి గుడ్లప్ప చెప్పి పెత్తిదానిలా చూస్తూ నిల్చుంది. అత్తగారు నిద్దట్లోంచి లేచి వూడినజుట్టు ముడివేసుకుంటూ కొంగు నేలమీద యీడ్చు కుంటూ 'మళ్లీ ఏమి కొంపమునిగింది' అంటూ వచ్చారు. సుశీల కళ్లల్లో నీళ్లు లేక పోయినా కంఠస్వరం; ఎకుపులతో, ఏడ్పు వట్టు వస్తోంది. 'మాడండి వీళ్ల సరసాలు. నేను చూశానని సామీప మండిపడు తున్నారు.' ఈ ధోరణిలో చెప్పుకు పోతోంది. అత్తగారు, జానకిని సూటిగా,

"రాను రాను మంచిబుద్ధులే వస్తున్నాయి. అయినా మురళీ నీకక్కడేమిపనిరా, మీ ఆవిడకి యిష్టం లేకపోతే మాట్లాడ్డం మానెయ్యరాదూ ? అయినా ఒకకోడలు వచ్చేసరికి యింకో ఆవిడని పుట్టింటికి పంపితే తప్ప యింట్లోవాళ్లం బతికేటట్టులేము," అంటూ జామిచెట్టుదగ్గరకి వచ్చారు.

ఎదురుగా కిటికీలో పెద్దకొడుకుని చూసి తెల్లపోయి. "నువ్వు యిక్కడ వుండేనా యీ రాద్ధాంతమూ" అన్నారు. మళ్లీ పెద్ద కొడుకు ఏమన్నా అనుకుంటాడనో ఏమోనని," అయినా కాకపోయినా సుశీలకి నోటికి ఏదివస్తే అది మాట్లాడ్డం అలవాటయింది. అపద్ధం ముప్పటగా పోతే, యిల్లాంటి మాటలా అం టం' అంటూ నేలమీద ములుపుసు కూర్చు న్నారు.

జానకి గదిలోకి వెళ్లిపోయింది. 'మీ రు వున్నారు కనక సరిపోయింది'- అంటూ వెక్కి వెక్కి ఏడ్వటం మొదలు పెట్టింది. 'నేను కొన్నాళ్లు మావూరు వెళ్లనా' అని ఏడుస్తూనే అడుగుతోంది. రామానికి ఎల్లా వోదార్చాలో తెలీలేదు. 'నేనంటేకదా నువ్వు బాధపడాలి. వాళ్లమాటలు లెక్క చెయ్యకు' అంటున్నాడు, అత్తగారు పెద్ద కేక పెట్టారు. "మురళీ మీ ఆవిడ పడి కొట్టుకుంటోందిరా, తొందరగా రా" అని, ఆకేకతో అంతా అక్కడికి పరుగెత్తారు. మురళీ రావటంచూసి, కాళ్లు చేతులూ గట్టి గా నేలమీద బాదుతూ తలఅటూ యిటూ కొట్టుకుంటూ దొర్లడము మొదలుపెటింది సుశీల. మొహంమీనీళ్లు చల్లగా కొంతసేపయినాక, సుశీల చేష్టలుమాని కుదురుగా పడుకున్నా బుసకొట్టేటట్టు గట్టిగా వూపిరి వదలటం మొదలు పెట్టింది. తరవాత నెమ్మదిగా లేవతీసి గదిలోకి తీసుకువెళ్లారు.

సుశీల లేచి యివతలికి రావటంలేదు. జానకి ఆపక్కకు వెళ్లటంలేదు. అంచేత గొడవలు లేకండా నాలుగురోజులు గడి చాయి. సుశీల లేచి తిరుగుతున్నా మురళీ మాత్రం గదివిడచి యివతలికి రావటంలేదు.

## శుభకార్యం

ఆరోజు మధ్యాహ్నం అత్తగారు నిద్ర పోతున్నారు. వెంకటేశంగారని ఆవూళ్లో పరపతివున్న పెద్దమనిషి ఎవరో వెంట పెట్టుకువచ్చారు. సాధారణంగా ఆయన ఎవరింటికీ వచ్చేమనిషి కాదు. ఏమయినా శుభకార్యాలప్పుడు తప్పరారు. రావటం చూసి తలుపుతీసింది జానకి. వెంకటేశం గారికి జానకి కన్నవారిఊళ్లో భూములు వుండటం మూలాన అక్కడికివచ్చినప్పుడు వాళ్ల యింట్లోనే దిగేవాడు. ఆ కారణంగా

(61 వ పేజి చూడండి)

# జూదంలో మీ తెలివితేటలు



సప్త వ్యసనాల్లో జూదం ఒకటని మన వాళ్ళు అంటే అన్నారుగాని, ఈ వ్యసనం లేనివాళ్ళెవరు? జూదం స్వయంగా ఆడినా ఆడకపోయినా, ఎవరైనా ఆడుతుంటే చూసి సంతోషించేవాళ్ళు, కనీసం ఆడాలనే సుప్తవ్యసనమైనా ఉన్నవాళ్ళు మనలో అనేకులు ఉంటారని మనస్తత్వవేత్తలు అంటారు. అయితే ప్రతివాళ్ళూ జూదంలోకి దిగితే లాభం గూబల్లోకి కొడుతుంది. ధర్మరాజు లాంటివాడు తను జూదానికి తగునా, తగనా అని ఆలోచించకుండా దిగి, మునిగిపోయాడు. మీకు జూదానికి కావలసిన 'మానసిక సరంజామా" అంతా ఉందా? మీరు జూదంలో చెయ్యిపెట్టిన ప్రతిసారి ఓడిపోవటం తప్పదా? ఒక మనస్తత్వవేత్త తయారుచేసిన ఈ ప్రశ్నలకు జవాబులు వేసుకుని, స్కోరుచూసుకుని, మీరు జూదానికి సమర్థులో కాదో తేల్చుకోండి.—



1. వ్యవధి లేకుండా తొందరగా ఏదైనా కష్టమైన నిర్ణయం చేయవలసివచ్చినప్పుడు మీరు. (అ) మీలోపల్నించి ఏదో గట్టిగా చెబుతున్నట్లు అనుమానం కలిగి ఆ ప్రకారం చేస్తారా? (ఆ) మీరు బాగా నమ్మిన మిత్రుడి సలహా ప్రకారం చేస్తారా? (ఇ) గబగబ ఆలోచనచేసి, లెక్కలువేసి చేసేస్తారా? (ఈ) బొమ్మా, బొరుసా అనుకుని నాణెం ఎగరేస్తారా?

2. పెనుభూతంలాంటి ఇబ్బందిలో ఇరుక్కున్నప్పుడు మీరు: (అ) మీ చేరువలో ఉన్న ఎవరినైనా సహాయం అడుగుతారా?

(ఆ) కొంచెం తాళి చూద్దాంలే అని నిర్ణయాన్ని వాయిదా వేస్తారా?

(ఇ) అప్పటికప్పుడు ఆ ఇబ్బందిని తొలగించుకునే ప్రయత్నం చేస్తారా?

(ఈ) దానంతట అదే సర్దుకుంటుందిలే అని ఊరుకుంటారా?

3. అనుభవం ఏమీ లేకుండా మీరు 'రూలెట్' ఆటకు హాజరవుతారనుకోండి. (అ) ఒక సంఖ్యమీద పందెం వేస్తారా? (ఆ) కొన్ని సంఖ్యలమీద ఆ పందాన్ని కాస్తారా? (ఇ) ఏ నిపుణుడో ఏర్పాటుచేసిన ఒక పద్ధతిప్రకారం ఆడతారా? (ఈ) ఊరికే పక్కన నుంచుని చూస్తారా?

4. మీరు పెళ్ళిచేసుకోదలచిన అమ్మాయికి, లేక, అబ్బాయికి అస్తమానం తాంబూలం నములటమో, సిగరెట్టు గొలుసుకట్టుగా ఊదెయ్యటమో, ముక్కుపొడుం పీల్చటమో ఏదో అలాంటి చెడు అలవాటు ఉందనుకోండి. మీరు (అ) పెళ్ళిచేసుకుని, ఆమెను లేక అతన్ని ఆ అలవాటు నుంచి తప్పిస్తారా? (ఆ) ఎదైతే అదైందిలే అని లక్ష్యపెట్టకుండా పెళ్ళి చేసుకుంటారా? (ఇ) ఆమె లేక అతడు అలవాటు మానుకుంటానని వాగ్దానం చేస్తేనే, పెళ్ళిచేసుకుంటారా? (ఈ) పెళ్ళినిర్ణయం నిరవధికంగా వాయిదా వేస్తారా?

5. ఎవరికీ తెలియకుండా మీలో మీరు రహస్యంగా (అ) మీకు కొన్ని అద్భుత, అమానుష, అలౌకిక శక్తులున్నాయని అనుమానపడుతుంటారా? (ఆ) అదృష్టం మిమ్మల్ని వరించి వెదుక్కుంటూ వస్తుందని అనుకుంటారా? (ఇ) నా అంత దురదృష్టవంతుడు లేడని అనుకుంటూ ఉంటారా? (ఈ) ప్రతిదీ ఆలోచించి, తూచి తూచి, సహేతుకంగా చేస్తానని అనుకుంటూ ఉంటారా? (ఉ) ఉండి ఉండి హఠాత్తుగా అద్భుతమైన అయిడియాలు (బ్రెయిన్ వేవ్స్) వస్తూ ఉంటాయని అనుకుంటారా?

6. రేస్‌కోర్సులో మీరు మెంబర్సుకు ప్రత్యేకంగా ఏర్పరిచిన జాగాలో ఉంటారనుకోండి. (అ) పందెం కట్టటానికి ముందు మీరు 'బుక్కీస్' ఉన్న స్థలంలో తచ్చాడుతూ ఉంటారా? (ఆ) ఏ యే గుర్రాలున్నాయో జాగ్రత్తగా కార్డు చూసి పరీక్షించి, టెయిటర్ ద్వారా పందెం కడతారా? (ఇ) ముందే పందెం కట్టి వినోదంగా గడిపేస్తారా? (ఈ) ఎక్కువ డబ్బు (లాంగ్ ఆడ్స్) వచ్చే గుర్రం అని ఎవరో సిఫార్సు చేస్తే పందెం కడతారా? (ఉ) అసలు పందెం కట్టకుండా వినోదం చూస్తారా?



7. చాలా ముఖ్యమైన వ్యవహారంమీద ఎక్కడికో వెళ్ళవలసో, ఎవరినో కలుసుకోవలసో వస్తే, మీ బట్టలమీద కాఫీ ఒలకటమో, కాకి రెట్ట వేయటమో జరుగుతుందనుకోండి. (అ) వెంటనే లాండ్రీకి పంపించి, టైముకు వస్తుందిలే అని ఆశిస్తూ ఉంటారా? (ఆ) మీరే ఏదో తంటాలుపడి ఉతకటమో, మీ భార్యకు అప్పగించి కాస్త బాగుచేసి పెట్టమని అడగటమో చేస్తారా? (ఇ) వెంటనే కొత్త బట్టలుకొంటారా? (ఈ) ఉన్నంతలో మంచిబట్టలుతీసి తొడుక్కుని వెడతారా? (ఉ) అసలు బయలుదేరకుండా వాయిదా వేస్తారా?

8. మీకు బాగా జబ్బుచేసినప్పుడు (అ) నిర్లక్ష్యంచేసి మీ పని మీరు చేసుకుపోతారా? (ఆ) అది నయంచేసుకునేందుకు ఒకవారం సెలవు పెడతారా? (ఇ) మంచి సమయానికే వచ్చిందని అని సంతోషించి ఒక రోజల్లా హాయిగా పడుకుంటారా? (ఈ) అది నయమయ్యేదాకా మంచంలోనే ఉంటారా?

9. మీరు నిరుత్సాహంగా, నీళ్ళు కారుతున్న ఉద్యోగంలో ఎరక్క చిక్కారనుకోండి. విదేశాలకు వెళ్ళే ఛాన్సు ఏదైనా వస్తే మీరు (అ) ఇంటి కప్పుదాకా ఎగిరి గంతేసి ఝామ్మని వెడిపోతారా? (ఆ) విదేశీ పర్యటన ఎలా ఉంటుందో తేల్చుకునేదాకా సెలవు పొడిగిస్తూ ఉండటానికి



అనుమతించవలసిందని మీ ఆఫీసును అడుగుతారా? (ఇ) వాళ్ళనీ వీళ్ళనీ వాకబుచేసి తేల్చుకునేదాకా ప్రయాణ నిర్ణయం వాయిదా వేస్తారా? (ఈ) అన్ని అనుపానులూ ఆలోచించుకునేందుకు ఒక నెలో, ఇంకా ఎక్కువో వాయిదా వేస్తారా?

10. (అ) మీ సమస్యల అమావాస్యని పోగొట్టే వెన్నెల డబ్బేనని, డబ్బు ఉంటే ఏ చీకూ చింతా లేకుండా ఉంటుందని మీ నమ్మకమా? (ఆ) పైకం సంపాదించటం మైకం కలిగించే ఎంతమంచి వ్యాపకం అని మీ నమ్మకమా? (ఇ) లోకంలోని చెడు అంతటికీ డబ్బే హేతువని మీరు నమ్ముతారా? (ఈ) డబ్బుంటే చాలా కొనవచ్చుగాని, అన్నీ కొనలేమని మీ విశ్వాసమా?

11. మీ భార్యకు లేక భర్తకు ఏదైనా ఖరీదైన బహుమతి కొనదలచినప్పుడు మీరు (అ) మళ్ళీ అమ్మినా అంటే నష్టం రాని వస్తువే కొంటారా? (ఆ) మీ సౌందర్యాభిరుచిని వెల్లడించే వస్తువు కొంటారా? (ఇ) ఒక్క రోజుకైనా ఆమెకు లేక ఆయనకు సంతోషం కలిగించే వస్తువే కొంటారా? (ఈ) అది మీకు నచ్చింది; లేక అది మీకు కొనాలనిపించింది. అంతే. కొనేస్తారా?

12. మీరు (అ) ఎక్కడికైనా ప్రయాణమవుతుంటే ఎవరైనా తుమ్మితే ఆగిపోతారా? (ఆ) తాయెత్తుల్లో నమ్మకముందా? (ఇ) ఫలానా ప్రమాదం జరుగుతుందని ముందే మీకు అనిపిస్తుందా? (ఈ) ముందు జరగబోయేవి కలల్లోకి వస్తాయా?

(ప్రతి ప్రశ్నలోను మీ సమాధానం గుర్తుపెట్టుకుని, 64 వ పేజీలో వ్యాఖ్య చూసుకోండి.)



వెలుగుతున్నంత సేపు తార, వెలుగు తగ్గగానే భ్రమిక. ఈమాట చలనచిత్ర రంగంలోని నటీనటులకు వర్తించినంత బాగా మరెవ్వరికీ వర్తించదు. కాని అప్పటికీ ఇప్పటికీ ఒకే తీరుగా ప్రకాశిస్తూ, యథాశక్తిగా వెలుగును వెలిగిస్తూ, ధ్రువతార అనిపించుకున్న నటుడు నాగయ్య.

జిల్లాబోర్డు గుమాస్తాగిరికీ, చలనచిత్ర తారాపథానికీ మంటికీ మింటికీ ఉన్నంత దూరం ఉంది. కాని అవిరళ సాధన, ఆత్మ విశ్వాసం, ప్రతిభ పాథేయాలుగా గైకొన్న నాగయ్యగారికి ఆ దూరం భారం కాలేదు. నాటకాలపిచ్చి చిన్ననాటినుంచే ఉంది. తండ్రి గాయకుడు. కుమారుడికి సహజంగానే సంగీతాసక్తి అలవడింది. ప్రముఖ విద్వాంసుల వద్ద సంగీతం అభ్యసించారు. పుట్టింది రేపల్లె అయినా, ఉద్యోగాన్వేషణలో చిత్తూరు చేరి, చిత్తూరు వి. నాగయ్యగా వెలుగులోకి వచ్చారు.

చిత్తూరు, రామవిలాస సభలో వేసిన నాటకాలు ఆయన కళాపిపాసను అధికం చేశాయే గాని తీర్చలేక పోయాయి. తెలుగులో కొత్తగా టాకీ చిత్రాలు వస్తున్న రోజులవి. నాటకరంగం నుంచి నటులు సరాసరి చలనచిత్ర రంగంలోకి బదిలీ అయి, సినిమాలు ఛాయానాటకాలుగా తయారవుతున్న రోజులు. ఆరోజుల్లో నాగయ్యగారు నాటకీయాభినయాన్ని నాటకరంగం మీదనే వదిలి, తెరముందునుంచి తెరమీదికి వచ్చారు. చక్కని గాత్రం, భారీ విగ్రహం, నిగ్రహం కల నటన, సహజ సంస్కారం, సమగ్రమైన దర్శకుల అండదండలు కలిసి, తొలి చిత్రంతోనే ఆయన తారాపథంలోను, ప్రజాహృదయరథంలోను స్థిరపడ్డారు.

తెలుగు సినిమా చరిత్రలో నాగయ్య ఒక శకం. రొమాంటిక్ హీరోనుంచి వృద్ధ పాత్రలదాకా, ప్రధాన అప్రధాన పాత్రలు అన్ని రకాలనీ ధరించారు. దాదాపు అన్నీ శాంత స్వభావం కల పాత్రలే. ఇప్పటికీ నాగయ్య పేరు చెప్పగానే జనానికి జ్ఞాపకం వచ్చేది పోతన, వేమన, త్యాగయ్య వంటి భక్తుల పాత్రలే. భక్తుడుగా నటించటంలో నాగయ్యకు సాటి నాగయ్యే అనిపించుకున్నారు.

ఈ శాంత స్వభావమే నాగయ్య వ్యక్తిగతజీవితంలోనూ కనబడుతుంది. చూడవచ్చినవారిని స్నేహితులుగా, చేరవచ్చినవారిని చుట్టాలుగా ఆదరించే ఆప్యాయత ఉంది. సహాయం కోరివచ్చిన వ్యక్తిని గాని, సంస్థను గాని లేదు పొమ్మని చెప్పలేని జాలిగుండె ఉంది. ఎవరు ఏ మంచిపని తలపెట్టినా దానికి చేయూతనిచ్చే ఔదార్యం ఉంది. నలుగురిచేత ఔననిపించుకోవాలన్న మంచితనం ఉంది. ఈనాడు తెలుగు, తమిళ చలనచిత్ర పరిశ్రమలో ఆయన పలుకుబడికి పునాదిరాళ్లు ఈ గుణాలే.

కొత్త వ్యక్తులు, కొత్త అభిరుచులు, కొత్త విలువలు వస్తూ, పాతవాటిలోని మంచి చెడూ కూడా కొట్టివేస్తున్న ఈరోజుల్లో, నాగయ్య లాంటి వారికి చోటు ఇరుకై పోగొట్టాకలగవచ్చుగాని, ఆశ్చర్యం కలగదు. కాని నేటికీ ఆయన తిరుగు తెరమీద కనబడుతున్నారంటే, ఆయా పాత్రలను ఆయనే నిర్వహించవలసిన అవసరం వ్యక్తమవుతున్నది. ★



## వేంకటేశ్వర మాహాత్మ్యం

(మొదటి బహుమతి రూ. 10)

ఒకరోజు మిత్రులమంతా సినిమాకు వెళ్లాలనుకున్నాం. కాని ఏ సినిమాకు వెళ్ళాలా అన్నదే సమస్య. కాని మా సత్యం ఇలాటి సమస్యలు ఇట్టే పరిష్కరిస్తాడు. లాటరీ వేద్దామన్నాడు, అంతా సరే సరే అన్నాం. వాడు కాగితం ముక్కలు చింపి ఒక్కొక్క కాగితంలో చాటుగా సినిమాల పేర్లు వ్రాసి చుట్టలు చుట్టేశాడు. మీలో ఎవరైనా ఒకరు ఒక చీటి తీస్తే ఏ సినిమా వస్తే దానికి వెళదామని అందరిని ఒప్పించి అన్నీ కలిపి క్రింద వేశాడు. నేనొక చీటీ తీశాను. అందులో 'వెంకటేశ్వర మాహాత్మ్యం' అని వ్రాసి ఉంది. సత్యం తప్ప అందరం ఆ సినిమా చూశాము కనుక మేమంగీకరించలేదు. వాడికి కళ్ళు మండిపోయి చర్రున లేచాడు. "అలా వీలులేదు. ముందు అంతా ఒప్పుకొని ఇప్పుడిలా చేయటం బాగాలేదు. ఈసారి మళ్ళీ చీటీలు కలుపుతాను. ఈ సారి ఏ సినిమా వస్తే దానికి వెళ్ళాలి. లేకుంటే..." అని ఒట్టు పెట్టి మళ్ళీ చీటీలు కలిపి వేశాడు. ఆశ్చర్యం. మళ్ళీ వెంకటేశ్వర మాహాత్మ్యం వచ్చింది. తప్పని సరిగా ఆ సినిమాకి వెళ్ళాం. లోపలికి వెళ్ళాక వాడు లాటరీ వేసిన చీటీ లన్నీ విప్పి చూపెట్టాడు. అన్నింటిలోను "వెంకటేశ్వర మాహాత్మ్యం" అని ఉంది. వెధవా ఏమిటరా ఈ పని అంటే "నా తప్పేముంది. అంతా 'వెంకటేశ్వర మాహాత్మ్యం'" అన్నాడు. అంత కోపంలోను మాకు నవ్వాగింది కాదు.

ఆర్. ఎల్. నరసింహా రాజు, కాకినాడ

* * *

## ఇదే ఆఖరుకార్డు

(రెండవ బహుమతి రూ 5)

నాకు ఒక తమ్ముడుండేవాడు. వాడు మా పినతల్లి కుమారుడు. వాళ్ల నాన్న వాళ్ళు మధ్యప్రదేశ్ లో ఉంటూ చదువుకు ఇక్కడ ఉంచారు.

వాళ్ల నాన్న (మా బాబాయి) ఒకసారి వచ్చి వెళ్లిపోతూ వీడికొక రూపాయిచ్చి "ఒరే! ఈ రూపాయి పెట్టి కార్డులు కొని, కనీసం వారానికొక ఉత్తరమైనా వ్రాయి" అని చెప్పారు.

వాళ్ళు అటు వెళ్ళగానే వీడు లెక్క ప్రకారం 20 కార్డులు కొన్నాడు. 19 వరకు బాగానే వ్రాసి 20 వ దానిపై ఇదే ఆఖరు ఉత్తరం అని వ్రాశాడు.

వాళ్ళు హడలిపోయి యీ వూరు వచ్చారు వీడికేం కొంప మునిగిందోనని. రాగానే వీడు స్వాగతం యిచ్చాడు. వాళ్ళు ఉత్తరం చూపి "ఎరా! యిదేమిటిరా యిట్లా రాశావు? మాకు మనసాగలేదుగదా" అన్నారు. అది చూచి వాడు నవ్వి 'ఇదా! మీరిచ్చిన రూపాయితో చివరి ఉత్తరం. అందుకని అట్లా రాశాను." అన్నాడు. మేమంతా అది విని పొట్ట చెక్కలయేలా నవ్వుకున్నాము.

రామం, గుంటూరు.

* * *

## వందేమాతరమ్

(రెండవ బహుమతి రూ. 5)

అవి సత్యాగ్రహం రోజులు. ప్రజలలో దేశభక్తి వెల్లివిరిసి, స్వాతంత్ర్య పోరాటం ఉధృతంగా సాగుతున్న రోజులవి. "వందేమాతరం" ఉద్యమము ముమ్మరంగా సాగుతోంది. 'వందేమాతరం' అంటే చాలు. తీసుకెళ్ళి జైళ్ళలో పడవేస్తున్నారు. దేశభక్తులు తండోపతండాలుగా జైళ్ళ పాలయ్యారు.

ఒకరోజు నేను కూరగాయల మార్కెట్టుకు వెళ్ళి నిమ్మకాయలు బేరం చేస్తున్నాను. నా ప్రక్కనే ఒక పంతులుగారు కూడా ఉన్నారు. ఆయన ఏం చేశాడంటే అటూ ఇటూ చూసి వందేమాతరం, వందేమాతరం అని గట్టిగా అరిచాడు. ఆయన ధైర్యానికి అక్కడున్న వాళ్ళమంతా ఆశ్చర్యపోయాం.

ఇంతలో ఆ అరుపు విని ఎక్కడనుంచో పోలీసువాడు వచ్చి పంతులుగారి పిలక గట్టిగా పట్టుకొన్నాడు ఆయన వెంటనే ఆ పోలీసువానితో 'నన్ను పట్టుకుంటావేమయ్యా నిమ్మకాయలు 'వందే' ఏమాత్రం? అని బేరం చేస్తుంటేను" అని బొంకేశాడు. వాడు కాబోలనుకొని తెల్లమొహం వేసుకుని వెళ్ళిపోయాడు. వాడు వెళ్ళిన తరువాత నాతో చెప్పాడు ఆ పంతులుగారు. తన కన్నాళ్ళనుంచో పబ్లిగ్గా 'వందేమాతరం' అనాలని ఉందని తన కోరిక ఇప్పటికి తీరిందనీను. ఆయన చమత్కృతికి అక్కడున్న వాళ్ళమంతా అభినందించాం.

ఎస్. టి. వి. కృష్ణావతారం,
హైదరాబాదు.

## మనవాడి మహత్యం

(రెండవ బహుమతి—రూ. 5.)

ఓ ఆదివారం సాయంత్రం 6 గంటల సమయంలో న్యూ తాజ్ మహల్ హోటల్ కు మేము ముగురం స్నేహితులం కాఫీ త్రాగడానికి వెళ్ళాం. 6 కాఫీలకు ఆర్డరిచ్చాం. 10 నిముషాలలో కాఫీ వొచ్చింది. సరే ఏవో ఆ విషయాలు, ఈ విషయాలు మాటాడుతూ కాఫీ త్రాగడం పూర్తి చేశాం. సెర్వర్ బిల్లు పట్టుకొచ్చాడు. ఆ రోజు నేను బిల్లు చెల్లిద్దామనుకొని తీసుకొన్నాను. ఓసారి చూశాను. కాని 15 అణాలకు బదులు 2-8-0 లకు బిల్లు రాసి ఉంది. మళ్ళీ ఓసారి జాగ్రత్తగా పరిశీలించబోయేసరికి నా ప్రక్కనే ఉన్న ఓ మిత్రుడు ఆ బిల్లును నా చేతులోనుండి లాక్కొని "నే చెల్లిస్తానివ్వండి" అన్నాడు. మా ఇతర మిత్రులు ఎవరి గొడవల్లో వాళ్లున్నారు. అందరం లేచి బయటకు పోతున్నాం. మావాడు గప్ చిప్ గా 2-8-0 బిల్లు చెల్లించేసి దక్కొచ్చాడు. సరే నాకు మాత్రం ఎందుకో అనుమాన మొచ్చింది. మావాణ్ణి అడిగాను. ఏమిట్రా సంగతి అని. మావాడు ఎవరికీ చెప్పొద్దని నాచేత ఒట్టేయించుకున్నాడు. సరేనన్నాను. కాస్త ప్రక్కకు తీసుకెళ్ళి కోటు జేబులోనుంచి రెండు స్టెన్ లెస్ స్టీల్ చెంచాలు నాకు చూపెట్టాడు నేను వెంటనే గ్రహించాను. ఆయనగారికి చిన్నతనంనుండి ఆ పాడు అలవాటున్నదని నాకేం తెలుసు.

ఇంతకీ అసలు జరిగిన సంగతే చెప్పడం మరిచాను. మావాడు కాఫీ త్రాగుతూ, త్రాగుతూ తన కప్పులోని చెమ్చాను మెల్లగా కోటు జేబులో వేసుకొన్నాట్ట. ప్రక్కన నేను చెమ్చా టేబుల్ పైనుంచి కాఫీ త్రాగుతూ మా ప్రక్కనే ఉన్న ఇద్దరు వాళ్ళ తరగతిలోని అమ్మాయి గురించి డెబ్బలాడుకుంటుంటే చెవి అటుంచి వింటూ ఉన్నాను. అప్పుడు ఆ చెమ్చా కూడా జేబులో దూర్చాడట. ఆ సమయంలో మేమున్న చోట ఇంకా ఇతరులెవ్వరూ లేరు. ఆ సందర్భంలో సప్లై సరిగా జరుగుతుందో లేదో అని చూడవచ్చిన హోటలు మేనేజరుగారు ఈ సంగతి చూచి వంటనే మా బిల్లుతో ఆ రెండు చెమ్చాల ఖరీదు 1-4-0, 6 కాఫీలకు 15 అణాలు కలిపి మొత్తం 2-8-0 అణాలకు బిల్లు రాయించాడట.

ప్రమోద్ అవధాని, హైదరాబాద్.

# హరివంశము

హరి శివశంకర్

## బృందావనవిహార పర్వం : ౫

బృందావనం ఇప్పుడు బృందారకలోక నందనం నందనంలా వుంది. ఘోషం స్వర్గంలాగా వుంది. గోపికలు శృంగారాలు చేస్తూ భాసిలుతున్నారు. గోపాలకులు ఉత్తుంగాంగాలతో ఎల్లెడల తిరుగుతున్నారు. గోబృందాలు బృందాలుకట్టి మాంగళ్యాకృతులై చెలంగుతున్నాయి. బలు సర్వసామగ్ర్యంగా ఒప్పుతున్నాయి. పల్లెసముజ్జ్వలోత్సాహముతో ఉప్పొంగుతున్నది. నానాటికి పొంగారుతోంది. రామకృష్ణులు క్షేమంకరులై ఎంతమాత్రం ఏమరకుండా ఎల్ల ప్రయోజనాలను నడుపుతున్నారు. శ్రీమంతులై ఏలులు చూపుతున్నారు.

ఇట్లా వుండగా ముందకు ఒక రోజున మధురకు పోతూ ఒక సార్థవాహం వచ్చింది. ఆ సార్థవాహం యవనదేశం నుండి పట్టుబట్ట అంబరాలతో, బహువిధ సామగ్రులతో. నానాదేశాలు సంచరిస్తూ మధురను కూడా చూచుకుందామని బయలుదేరి పోతున్నారు. రోహిణి ఆ వనుపలోని శ్రేష్ఠులను ఇంటికి పిలిపించి రామకృష్ణులకు పట్టుబట్టలు కొన్నది నగలు బేరంచేసింది. యశోద ప్రక్కన కూర్చుని అన్నదిగదా: "రోహిణి అమ్మగారూ! మా కృష్ణునికి ఆ పీతవర్ణం పట్టుబట్టలు కొనండి." రోహిణికి నవ్వువచ్చింది "ఓసీ! యశోద! నీవు కట్టిగోపకవే అనుకున్నాను. అంతకంటే ఎక్కువదానివని ఇప్పుడు తేలింది నీకు వర్ణసామరస్యం బాగా తెలుసునే."

యశోద: మీకు ఎప్పుడూ హాస్యమే రోహిణి అమ్మగారూ! మా వాడు కొంచెం ఎఱ్ఱగ బొఱ్ఱగా వుంటాడుగదా అని మావాడి నల్లనితనాన్ని చూసి నన్ను హాస్యంచేస్తున్నారు.

రోహిణి: అదికాదే! గోపిక! ఆ నల్లనివాడికి బంగారురంగు పట్టుబట్టలు బాగుంటాయని నీకు అర్థం అయినందుకు సంతోషిస్తున్నాను.

వారి సంభాషణలు వినగా యవనశ్రేష్ఠులకు నవ్వువచ్చింది. అక్కడ వారికి ఆ నల్లనివాడు ఎవరో కన్పించలేదు. వారు తమ యవనదేశాలలో ఒక నల్లనివానిని గూర్చి విని వున్నారు. ఇక్కడ కన్పిస్తున్న మనుష్యులలో దాదాపు చాలామంది తెలగానే వున్నారు. ఆ నల్లనివానిని గూర్చిన సంభాషణ మాకు అబ్బురంగా వుంది. యవనదేశంలో తాము వింటున్న నల్లనివానిని గురించిన కథలు కూడా అబ్బురంగానే వుంటున్నవి. ఆ నల్లనివానిని గూర్చి అనేకమైన కథలను వారు విని వచ్చారు. ఈ నల్లనివానిని గురించి కూడా అటువంటి కథలేమైనా వున్నాయా? రోహిణి వారి ముఖభావాలను కనిపెట్టి "అయ్యా! శ్రేష్ఠులు! మావాడు ఆకాశంలాగా నీలవర్ణుడు. యమునలాగా గంభీరుడు, బృందావనమంత అందగాడు. వానికి మంచి పట్టుబట్టలు ఇప్పద్దురు" అన్నది.

శ్రేష్ఠులు నానా వర్ణాల పట్టుబట్టలను చూపించారు రోహిణి ఒకరకం పట్టుబట్ట తీస్తే, యశోద మూతి విరుచుకుంటుంది. యశోద యింకోరకం పట్టుబట్ట చూపిస్తే, రోహిణి "నీకు బట్టల నాణ్యం తెలుసునటే" అంటుంది. ఎంతసేపటికి వారికి సామ్యం తెగడంలేదు. ఉండి ఉండి, యశోద, ఒక నీలవర్ణపు పట్టుబట్ట చూపించి



# ★ హరివంశము ★

"అమ్మా! రోహిణి తల్లీ! మన రాముడికి ఈ బట్టలు చాలా బాగుంటాయి" అన్నది.

రోహిణి "అట్లాగులే! పిచ్చికానా!" అన్నది.

ఇంతలో నందుడు వచ్చాడు. ఆయనతో రామకృష్ణులు వచ్చారు. వారితో ఆలమందలు వచ్చాయి. వాకిట్లో జరుగుతున్న బేరాలనుచూచి నందుడు పిల్లలను పశువులను దొడ్లో కట్టమని చెప్పి, తాను అక్కడికి వచ్చాడు. ఆ బేరాలు చూచి పకపకా నవ్వాడు. "ఒసే! యశోద! నీకు పాలసంగతి తెలుసు. పెరుగు సంగతి తెలుసు. వెన్న సంగతి తెలుసు. వస్త్రాల సంగతి ఏమి తెలుసునే! అమ్మగారిని హాణెం చేయనీయ్" అన్నాడు.

యశోద లేనికోపం తెచ్చుకొని "అంతా నన్నే ఇట్లా విలిపా చేస్తే, నేను ఏమవుతాను" అన్నది. మధురమర్యాదంగా నవ్వింది.

అంతలో కృష్ణుడు హఠాత్తుగా వచ్చి యశోద ఒడిలో చేరాడు.

"నిన్ను ఎవరు విలిపా చేస్తారే! ఈ నల్లని తండ్రి ఒడిలో వుండగాను, యశోద!" అన్నది రోహిణి.

శ్రోతలకు ఆ బాలుడు, ఆ నాగరిక స్త్రీ, ఆ జానపదురాలు-సర్వం ఆశ్చర్యంగా వుంది. ఆ బాలుణ్ణి చూడగా వారికి ముద్దయింది, ఆ కుబ్జవానికి పదియేండ్లకు మించి వుండవు. కాని పదహారేండ్ల వాని అంతటి దృఢంగా కన్పిస్తున్నాడు. శరీరంచూస్తే, కండలు తీరి వుంది. అట్లా అని కఠినంగా లేదు. బాహువులు అజానువులై వున్నాయి పద్మపత్రాలవంటి కన్నులు. మహాపురుషుని లక్షణాలన్నీ మూర్తికట్టినట్లు వుంది ఆ మూర్తి. ముఖం చూస్తే లేతగా వుంది. ఆ ముఖాన్ని చూస్తేనేగాని ఆ కుబ్జవాని వయస్సు ఇంత అనకు వెంగుకు లేదు.

శ్రోతలు ఆ కుబ్జవానిని ఆకేపనిగా చూస్తున్నారు. రోహిణికి మనస్సు కలుక్కుమంది. "తండ్రీ! రాముడు ఏమి చేస్తున్నాడు! నువ్వు గూడా వెళ్ళు. తోడుగా పశువులనుకట్టి మేత వేద్దువుగాని" అన్నది.

"అమ్మా! రోహిణీ అమ్మగారు! మీ ఊహ నాకు తెలిసింది. రాముణ్ణి గూడా తోడుకు వస్తాను చూస్తూ వుండండి" అంటూ కృష్ణుడు పరుగు పెట్టాడు.

రోహిణి బట్టలు బేరం చేసింది. కృష్ణుడికి పీతాంబరాలు కొన్నది. రాముడికి నీలాంబరాలు కొన్నది. యశోద ఆవిడవంక చూచి "నేను చెప్పినట్లే కొన్నారు చూచారా!" అన్నట్లు నవ్వింది. రోహిణిముఖం ప్రసన్నని నవ్వులతో ప్రసన్నమైంది.

"యశోదా! నీవు హాస్యం చేయడమేమిటి! బాగుండక పోవడమేమిటి? అది నీ పూర్వపుణ్యం. నీవు ఎంత పుణ్యాత్మవు కాకపోతే మా నల్లని తండ్రి నిన్ను తల్లినిగా చెల్లించుకుంటున్నాడు" అన్నది. ఆమాట అనగా ఆమెముఖం గంభీరమైంది. నందుని ముఖం ఆనంద విషాదాలు చేత గడరించింది. యశోదలో అమాయకత్వం తప్ప ఏమీ కన్పించలేదు.

శ్రోతలు చనుపకు వెళ్ళిపోయినారు. రామకృష్ణులు ఇంట్లోకి వచ్చారు. రోహిణి కొన్న బట్టలు చూచుకున్నారు. నగలు చూచుకున్నారు. వారి ఆనందానికి అంతులేదు. కృష్ణుడు పీతాంబరాలు తనవి అన్నాడు. "మిగిలినవి నీలాంబరాలేగా, అవి నావి" అన్నాడు బలరాముడు. "అట్లా అనే కొన్నాము తండ్రులు! యశోదకు అన్ని అందాలు తెలుసు" అన్నది రోహిణి. ఆ మాటలు అని అంతా నవ్వుకున్నారు.

రాత్రిఅయింది. చంద్రుడు ఉదయించాడు. వేసగి వెనుకపట్టి వర్షాకాలం ఇంకా ముంగుకురాని సంధికాలం అది, నల్లని చిలుప మేఘాలు ఆకాశమార్గంలో యౌవనగళపు హాయిల్లాగా మంథర వల్లవ సుందరంగా సంచారం చేస్తున్నాయి. యమునమీదనుండి చల్లని గాలులువచ్చి, ఘోషస్థానానికి ఆనంద సంధానకాలవుతున్నాయి. భోజనాలు ముగించుకొని గోపప్రజలు యమునఒడ్డుకు పోతున్నారు. యమునలో ఇసుక తిన్నెలు వెన్నెలబయలై, చిలుప మేఘాలు రాపిడికి చంద్రుడు పాడిరాలగా, యమునలో పడి దిమ్మలు కట్టినట్లు వున్నాయి. చనుప యమునఒడ్డున గడిసి వుంది. అందులో కొందరు విచిత్రమైన వాద్యాలను పట్టుకొని సంగీతం కొట్టిపోస్తున్నారు. శ్రోతలు వారిచుట్టూ చేరి ఆ సంగీతాలు వింటున్నారు. ఆ సంగీతం గూడా విచిత్రంగావుంది. రాగప్రస్తారంలో నేమి, లయవిషయంలో నేమి, తాళపద్ధతిలో నేమి, గోపకులు ఎప్పుడు విన్నదిగా లేదు. చనుపలో ఒక గాయకుడు వీణ వంటి ఒక వాద్యసాధనాన్ని మీటుతూ పాడుతున్నాడు.

యౌవన దేశముల అందం బోహో
వయసపర్వమే ఓహో!

# బహుమతి పొందిన కార్టూన్




"ఏయ్, సెర్వర్! ఎక్కడికి పోయావ్?"

చిత్రకారుడు: చెన్నగిరి రామారావు, సికింద్రాబాదు.

---

యౌవనకేళుల భాగ్యం తోనో
వయసువచ్చినమె జానో!

చుట్టూ వున్న యువకులలో కొందరు వికటకంఠంతో తిరిగి ఆ పంక్తులనే, ఓజస్సుతో పలుకుతున్నారు. యమునమీద ఆకాశంలో ఆ కంఠాలు ప్రతిధ్వనించాయి. యమున ప్రక్కని అడవులలో ఆ కంఠాలు మారుమ్రోగాయి:

చుట్టూ మూగిన గుట్టలలోపల
గుట్టగవున్నవి రాజ్యాలు
గుట్టగవున్న రాజ్యాల్లోపల
రట్టులు పెంచే కన్యకలు
హో!

రట్టులు పెంచే కన్యకలు.

అంతలో కొందరు యువన వనితలు వచ్చి, చప్పట్లు చరుస్తూ, అదో విధమైన నాట్యంచేస్తూ వుండగా, యువకులైన సార్థవాహులు—

చుట్టూవున్న గుట్టలలోపల
రట్టులు పెంచే కన్యకలు
హో!

రట్టులు పెంచేకన్యకలు

అంటూ బృందగానం చేశారు.

అప్పుడు ఆవనితలలో ఒక్కర్తుక అందుకొని—

రట్టులు పెంచేకన్యకలా!
హో ఒట్టు!
రట్టులు పెంచే కన్యకలా!
హో ఒట్టు! మీ
గుట్టు విప్పెడిట
బట్టబయలుగా
ఎట్టుల చెప్పెడిదానా! మీ
పట్టుపసలగా
పెట్టుబలంగడిదానా!

అంటూ ఆయువకులను మందలించింది. అంతలో ఒక్కక వనిత అంతా అందుకొని, యువకులను జంకెనచూపులతో బింకం చూపట్లు చేస్తూ, నాట్యంచేస్తూ,

ఎటుల తెలగద మోహహో! మీ
గుట్టుపెట్టులను
రట్టుల పెట్టినమోహహో

అంటూ బృందగానం చేశారు.

వాద్యకారుడైన తొలియువకుడు తిరిగి అందుకున్నాడు. వాద్యాన్ని మీటుతూ పాడుతున్నాడు:

ఉన్న దున్నది ఒక్క కన్యక
(ఉన్న నీ అందముల చానా
ఉన్న అందరి చానలలో
మిన్న అందరు చాలలో



# హరివంశం

మిన్న
అందపుచాలులో
దాన్ని చూస్తే చాలు లోకం
కన్నులట్లా అప్పగించి
ఎన్న రాని తమకమున కను
మిన్ను కౌనని దాయనో
కను
మిన్ను కౌనని దాయనో
దాని అందం చెప్పరానిది
దాని హొయలు పట్టరానిది

దాని మాటా విలువకట్టగ
రానిది పోయెన్—హా!
కానిదె పోయెన్.
ఒక్కరోజున దాన్ని మా స్త్రీని
ప్రక్కగా చేరితిని, ప్రేమం
బెక్కువగపడి "ఓసి! చుక్కా!
నిక్కవమె అంటిన్".
అప్పుడోహో దాని చూపులు
మెప్పు పొందిన మనసు తూపులు
అప్పుడది పోయినది హాసులు
కుప్పలై అందములరాసులు
అప్పుడది
పోయినది హాసులు
అందముల మోసుల్.
నేను అంటిని "ఓసి చుక్కా!
కానవే, దయకొంత నాపై
పూనవే
అనవే నీ అధరమిటు నే
పాన మొనరింతున్.
కలికిమిన్నా! కన్నులా! అది, కాదు
జిలిబిలిమీనములు; నీకను
చిలిపినవ్వుల పూలవనిలో
తళుకు చిమ్మెడి నే!
పలుకవేమే! నాదుగుండియ
కలగనీక; చెలగి తుమ్మెద
లోలనై కొను నీ జడలలోపల
పులకరింపున పూవునై"
కన్నె అన్నది. "పిల్లవాడా!
కన్నె దాన్నిర! చిన్న దాన్నిర!
వున్నె ముందును పారపోరా!
నన్ను కావుమురా!
వారు చూతురు వీరు చూతురు
తీరుగా నా పరువు తీతురు
పార నా మనమందు రేగిన
కోరికల రేడా!
ఓ!
కోరికల రేడా!
"ప్రేమ యుంటే చాలునే; భూ
రాము లింకా చాలునే;
ప్రేమలోపల ఒక్కటైతే
భామ! నాకూ చాలునే.
నాకు నీవై, నీకు నేనై
ఏకమైతే ప్రేమలోపల
నీకు యీ బ్రతుకంత వెన్నెల
లోక మయ్యెడినే!
వెన్నెల
లోక మయ్యెడినే!
వారలెవ్వరు! వీరలెవ్వరు!
కారుబారులు చేయకే!—
ఓ-రాణి నా హృదయభూమిని
నీ - రాజ్యమును నెలకొల్పవే.
ప్రాణనాయకి పట్టుపట్టితి
అనపెట్టితి, అన తిప్పితి
కానవే, ప్రేమంపుజాలిని
పూనవే
దివుడా ప్రేమికుని పై దయ
పూనవే - న
న్నేలవే.
పాదముల, ఇదె, ఓసి
పెదలికి పద్మములు
నే దరిసిపట్టితి
ఆదరించవె, నాదు ప్రేమను
కాదు కాదనకే!
హృదయము
లేదు లేదనకే!
వార లందువు, వీర లందువు
నేరమా ప్రేమించుకొనుటకు
ధీరవై నా పైన నీదయ
కోరి నిల్పగదే!
ప్రేమ యుంటే లోకమెందుకు
ప్రేమయుంటే నీతి యెందుకు
ప్రేమలో దైవమ్ము గలదే
భామ! ఇది వినవే!
రాము! వినుకవవే!"
పడతి అన్నది: "ప్రాణనాథ!
విడిచినీకై మదిని చేసితి
గుడిని కట్టితి గుండెలోపల
విడిదియు రా, నాపాలిదైవమ!
కడును ప్రేమముతో
ప్రేమతో పందిరిని వేసితి
ప్రేమతో కట్టితిని చాందిని
ప్రేమ తోరణజాలములలో
ఆ మదిని మేల్కొల్పితిన్
ప్రేమతో ముత్యాల ముగ్గులు
ప్రేమతో పెట్టితిని పెండ్లికి
ప్రేమతో వేశాను పీటలు
నా మనోవిభుడా!
రార! నాథా! రార! నాథా!
చేర ప్రేమపుకోటలోపల
తీరుగా మరి ఒక్కటౌదము
వేరు లెరుగకను - ఇక
వేరు లెరుగకను."
"ఓసి! ప్రాణము! ఓసి! అక్కా!
ఓసి! నా బ్రతుకైన వెలుగా!
చూసినావా దూరమున కై
లాసపర్వతమూ!
అక్కడను పున్నారు దంపతు
లాదిములు, ఆద్యంత రహితులు
చిక్కనీ ప్రేమమున మనలై
ఒక్కటయిపోయీ,
మనవలె
ఒక్కటయిపోయీ!
నీవు పార్వతి నేను శివుడను
ఇరువురము నిల్చితిమి ఇచ్చట
ఒక్కటై ప్రేమంపు పల్లకి
నెక్కి చొక్కుదము!
ప్రేమంపు జోలిక
లెక్కి ఊగుదమే!"
మనము దంపతుల

# ★ హరివంశం ★

మాది దైవతము
అటువలె నిత్య
ప్రణయములో పల
ఏకమైతిమిని;
ఒక్కటైతిమిని;
మనకిక జీవితమంతా వెన్నెల
కాంతి పోలికను సైపదిలే!
మనకిక జీవిత మంతా
బంగారు పంటపోలికను
ఒదుగుములే!
నాలో నీవై, నీలో నేనై
శ్రీ మెరుగను
ఉందములే!
కాలాన్ మనకిక సత్యప్రణయ జన
పదము లిక్కడనె దక్కెనులే.
సత్య ప్రణయ జన
పదము లిక్కడనె
దక్కెనులే

ఈ చివరి పదాన్ని ఆ గాయకుడు ఒకటి రెండుసార్లు ఉచ్చ స్వరంతో ఆలపించాడు. తక్కిన యాదవ యువకులు, యువతులు కూడా ఆ పదంలో చివరి పాదం అందుకొని బృందగానం చేశారు.

కాలాన్ మనకిక
సత్యప్రణయజన
పదము లిక్కడనె
దక్కెనులే!
దక్కెనులే!!

వాని ఉచ్చస్వరంతో ఆ పదాన్ని అనగా యమున తరంగాలు లేచి ఘనమైన ధ్వని చేస్తూ, పైకి ఎగురుతూ, క్రిందకు దిగుతూ, కింకిణీ ఝణఝణత్క్వణనం చేసినట్లు వుంది. వెయ్యి కోకిలలు ఒక్కసారి కంఠం విప్పినట్లు వుంది. మూగివున్న అందరి చెవులు గింగురుమన్నాయి. ఇదేమో విచిత్రంగా వున్నదని గోపకులంతా అనుకుంటూండగా, వాద్యహస్తుడైన యువకుడు తన చేతిలోని పాత్ర మీద విచిత్రమైన ధ్వనులను పుట్టించాడు. యుగ యుగాల సంతోషం, హఠాత్తుగా యుగయుగాల దుఃఖంగా మారిపోయినట్లువుంది ఆ మార్పు. స్వర్గానికిపోయేందుకు ఎన్నో పుణ్యకార్యాలు చేసి, తీరా అంతిమ సమయం వచ్చే సరికి. నరకలోకపు దూతలు ప్రత్యక్షమైతే, ఆ జీవి ఎట్లా దుఃఖిస్తాడో, ఎట్లా భయపడతాడో, ఎట్లా నిర్వేదం చెందుతాడో, అట్లా అతని చేతిలో ఆ వాద్య విశేషం దుఃఖించింది. భయపడింది. నిర్వేదాన్ని పొందింది. ఆ గాయకుడు మహాశిల్పి. అతడు వాద్యాన్ని మీటుతూ వుంటే, వింటూవున్న జనానికి తమగుండెల్లో, అతి ఆర్ద్రమైన, సకలలోక దుఃఖాన్ని, భయాన్ని. నిర్వేదాన్ని, గ్రహించగల శక్తి కలిగి, విలీనమైవుండే, ఎన్నోదశలను వచ్చి జాగరితం చేస్తే నగాని, నిద్రలేవని నాడులు ఎన్నో, ఇప్పుడు హఠాత్తుగా జాగరితమై, వాద్యగాని వాద్య విశేషం నుంచి వెలువడే ధ్వనులతో స్పందించి,

ప్రతిస్పందనంచేత, భయానికి భయాన్ని, దుఃఖానికి దుఃఖాన్ని, నిర్వేదానికి నిర్వేదాన్ని, పొందుతున్నాయి. ఆ యవన యువకుడు అట్లా కొంతసేపు తన విద్యను ప్రదర్శించాడు. కొంత సేపు ఏదో విచిత్రమైన రాగాలను ఆవాద్యంమీద పలికించాడు. దసుప శ్రేష్ఠులలో అగ్రశ్రేష్ఠికి ఆపాటను కొనసాగ నీయడమో, కొనసాగనియ్యక పోవడమో, తెలియలేదు కూర్చున్న జనంలో ఎవరికీ ఒళ్ళు తెలియదు. అంతా ఆ విచిత్ర సంగీతంలో లీనమైపోయి, చిత్రగతియూరులై, ఇతర ప్రపంచాన్నే ఎరుగరాని స్థితిలో పడిపోయినారు. అగ్రశ్రేష్ఠి పాటను చాలాసార్లు విన్నాడు. ఆయనకు ఆ యువకుని విద్య అలవాటై పోయింది. అతని శక్తి పరిచితమైపోయింది. ఆయన ఆయువకుణ్ణి సంబోధించి "నాయనా! ఇక చాలు" అన్నాడు. ఆ యువకునికి ఆమాట వినిపించలేదు. సంగీతం అనే మైకాన్ని తానే సృష్టించి, తానే క్రోలి, మత్తెక్కి చొక్కినట్లు, ఆ యువకునికి బాహిర ప్రపంచమే పట్టడంలేదు. ఇంతలో ఎక్కడి నుంచో మనోజ్ఞ శ్రోత్ర ధ్వని వినిపించింది. ముందు అది ఏదో ధ్వనిగా వుండి, పోను పోను వేణువాదంగా పరిణమించింది. ఆధ్వని అతివిచిత్రంగా వుంది. పరమ అద్భుతంగా వుంది. అది చెవులకు సోకగా, అంతా హఠాత్తుగా నిద్రమేల్కొన్నట్లు మేల్కొన్నారు. యవన గాయకుడు వాద్యం ఆపివేసి, ఆ నాదం వస్తున్న వైపుకు తిరిగి, చెవులు అప్పగించి, అమరులు అమృతాన్ని క్రోలినట్లు, ఆ చెవులతో ఆ నాదంనుంచి వెలువడుతున్న అమృతాన్ని ఆస్వాదిస్తున్నాడు. అందరిలోను ఆ వేణువాదం విచిత్రమైన అనుభూతిని జాగరితం చేసింది. ఎవరో ప్రియుడు తన ప్రేయసిని పిలుస్తున్నాడు. ఆ ప్రేయసి ఆ నాదాన్ని విని పరుగుపెట్టుకు వస్తున్నది. అక్కడ అందరికి ఆ నాదాన్ని వినగా అట్లా పరుగెట్టాలని అనిపించింది. అందరికి తాము స్త్రీలమా అనిపించింది. ఇంతలో ఆ నాదం ఆగిపోయింది. అందరు తిరిగి ప్రపంచంలో పడ్డారు. ఆ స్థితిలోకి వచ్చిన తరువాత శ్రేష్ఠికి మరల యవనగాయకుని సంగతి జ్ఞాపకం వచ్చింది. అప్పటికే అతను వాద్యాన్ని క్రిందపెట్టి, పరమనిర్వేదియై చూస్తూ కూర్చున్నాడు.

శ్రేష్ఠి—మంచిపని జరిగింది. మా గాయకుడు పాటే మరిచిపోయినాడు.

నందుడు—మరిచిపోవడం ఏమిటి? పాట బాగుంది. పాడమనండి.

శ్రేష్ఠి—అయ్యా! ఇప్పుడు విన్న వేణుగానం యెవరిదో, ఎక్కడిదో, అతిలోకంగా వుంది, ఆ తర్వాత ఇక ఏ గానము రుచించదు. ఆ గాయకుడెవరో?

సార్థవాహంలోని యవను లందరి మనస్సులలోనువున్న ప్రశ్న అదే.

నందుడు—గాయకుడు కాదండి. మా అబ్బాయి. వేణువు వూదుకుంటున్నట్లు వున్నాడు. ఎందుచేతనో మధ్యలో ఆపివేశాడు.

శ్రేష్ఠి—అట్లాగా! మీ అబ్బాయా! మేము చూచిన ఆ కల్లని తండ్రేనా!

సార్థవాహంలో అందరికీ ఆ కుజ్జవానిని గూర్చి ఔత్సుక్యం అధికమైంది. అందులో కొందరు అతనిని చూచారు. కొందరు చూడలేదు. నందునికి ఈ సంభాషణ ధోరణి నచ్చలేదు. ఆయన అన్నాడు: "శ్రేష్ఠి! మీ గాయకుణ్ణి కథ పూర్తిచేయమనండి."

శ్రేష్ఠి: ఇంకా పూర్తిచేసేందుకు ఏమి వుంది. ఆ ప్రియుడు, ఆ ప్రియురాలు కలుసుకున్నారు. అంతే.

నందుడు—కాదు కాదు. ఇంకా ఏదో వున్నటు వుంది. ఆ పాపం, మీ గాయకుడు ఆ కథను అందుకోనే లోగానే...

గాయకుడు—అమృతం వర్షించింది.

నందుడు—నీ పాట గూడా అమృతం లాగానే వుం- ఏదీ మిగిలిన పదం అందుకో నాయనా!

ఆగాయకుడు సిగ్గుపడ్డాడు, శ్రేష్ఠివంక చూచాడు. శ్రేష్ఠి వద్దన్నట్లు తలవూపాడు.

నందుడు—శ్రేష్ఠిగారూ! ఎందుకు ఆకుఱ్ఱవాణ్ణి పాడనీయరు.

శ్రేష్ఠి అయ్యా ఇక్కడ మీ దేశాలతీరువేరు మాదేశాల తీరువేరు. మీరు సర్వం సుఖాంతంగా ఆలోచిస్తారు. మా ఆలోచనలు దుఃఖాంతంగా సాగుతాయి. ఇప్పుడు ఈకథగూడా అంతే. ఆ యువతీ యువకులు ప్రేమించుకొని పెళ్ళిచేసుకుందా మనుకున్నారా? ఆఊళ్ళో గిట్టనివాళ్ళు, ఆపిల్లతండ్రికి ఆప్రేమికుణ్ణిగూర్చి నానాఅభాండాలుకల్పించిచెబుతారు. తనకుమార్తెశీలానికిఆయువకుడుకళంకాన్ని తెచ్చిపెట్టినాడని ఆ తండ్రి అనుకున్నాడు. ఊళ్ళో వాళ్ళతో కలిసి, ఆ కుఱ్ఱవాణ్ణి పట్టుకుని గ్రామాధికారి ముందు నిలబెట్టాడు. అతనికి ఉరిశిక్ష పడింది. ఆ ప్రేమమూర్తిని నిర్దాక్షిణ్యంగా వధించారు. ఆ ప్రేయసి, అదిచూచి, చూడలేక, ఒక కొండ ఎక్కి, అక్కడ నుండి క్రిందకు దూకి ప్రాణం తీసుకుంది. ఇక్కడ ఈ యమున, ఈ వెన్నెల, ఈ బృందావనం, ఆ వేణుగానం అన్నీ అతిలోక సుఖాతిశాయినులుగా వున్నాయి. ఇప్పుడు విషాదగాథను గానం చేయడం అపచారమే అవుతుంది.

యవను లంతా ఔనన్నట్లు తలలు వూచారు. ఆ శ్రేష్ఠిమాటలు వినగా నందునికి గోపాలి సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆమెను భర్తతో తాము యవన దేశాలకే పంపించటం జరిగింది. ఈ దసుప ఆదేశాలనుంచే వస్తున్నది. వారిసంగతి వీరికి ఏమైనా తెలుసునేమో అడుగుదామనుకున్నాడు నందుడు. అక్కడ ఎన్ని దేశాలున్నాయో ఈ ఇదరు ఎక్కడ వున్నట్లు? వీరికి వారి సంగతి ఎట్లా తెలుస్తుంది? అనుకున్నాడు అంతలో. నందునిక ఎటూ పాలుపోలేదు.

శ్రేష్ఠి—మీరు నన్ను ఏదో అడుగుదామని, ఎందుచేతనో, అడగలేకపోతున్నారు?

నందుడు – అసాధ్యులే నయ్యా!

శ్రేష్ఠి – కాకపోతే ఇన్నిదేశాలలో వర్తకం ఎట్లాచేసాము?

నందుడు – అయితే వినండి తొమ్మిది . దిసంవత్సరాల క్రిందటి సంగతి. మా మందలోనే గోపాలి అని గోపిక వుండేది. శైశిరాయణుడనే బ్రాహ్మణుడు ఒకరోజున, ఆ గోపికను, ఈ గాయకుని కథలోని నాయకుడు, నాయకిని ప్రేమించినట్లు ప్రేమించాడు. మేము వారిని మీయవనదేశాలకు పంపించాము. గోపాలి మాగ్రామం ఆడబడుచు. తల్లిదండ్రులు లేనిపిల్ల.

అంటూ వుండగా నందునికంఠం గద్గదమైంది. అతని కను కొలకులలో బాష్పాలు ఆ వెన్నెలలో తళతళలాడాయి. తక్కిన గోప ప్రవరులు గూడా ఉత్తరీయపు చెంగులతో కళ్ళొత్తుకుంటున్నారు. ఆదసుపలో వారికేది ఆశ్చర్యమైంది. వారిలో కొందరు శ్రేష్ఠులు ఒకశైశిరాయణుణ్ణి గూర్చి వినివున్నారు. గోపాలిని గురించిమాత్రము వినలేదు. ఇప్పుడు ఇక్కడ శైశిరాయణుని పేరు వినిపించగా వారు ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు.

శ్రేష్ఠి : అయ్యా! మీరుచెప్పే శైశిరాయణు లెవరోగాని, మా యవనదేశంలో ఒకశైశిరాయణులు వున్నారు. మహానుభావులు మా యవనేశ్వరులకు మంత్రులు. పురోహితులు.

నందుడు : అవును! శ్రేష్ఠి! అవును! ఆయన ఋషి. విధి వైపరీత్యంవల్ల అది అట్లా జరిగిపోయింది. మీకు ఆయనతో గోపాలి కన్పించలేదా?

నందుని కంఠంలో లోకంలోని ఆర్తం అంతా పుంజీభవించిపోయింది. శ్రేష్ఠికి నవ్వువచ్చింది.

శ్రేష్ఠి : అయ్యా! మా శైశిరాయణులు, మీశైశిరాయణుడు ఒక్కరని చెప్పడంఎట్లా? నామరూప్యతచేత మీరు భ్రమచెందుతున్నారు.

నందుడు : కాదుకాదు! శ్రేష్ఠి! ఆయన తప్పకుండా వంశైశిరాయణులే అయివుంటారు. ఆ శైశిరాయణులరూపం ఇటువంటేది.

# ★ హరివంశం ★

అని నందుడు శైశిరాయణుని రూపాన్ని వర్ణించిచెప్పాడు. గోపాలి రూపాన్ని వర్ణించిచెప్పాడు. శ్రోతలకు ఇప్పుడు అనుమానం తీరిపోయింది. ఆ శైశిరాయణులు, ఈ శైశిరాయణుడు ఒక్కరేనని తేలింది. అప్పుడు శ్రేష్ఠి అన్నాడు.

"అయ్యా! యవనేశ్వరులకు శైశిరాయణులవారు పరమ పూజ్యులు. అందువలన మాకు గూడాను. వారికి ఆ అనుబంధం ఎట్లా కుదిరిందో మాత్రం ఎవరికీ తెలియదు. కాని నిస్సంతులైన రాజుకు ఈయనవల్ల సంతానప్రాప్తి అయినదని ఒకకథవుంది. యవనేశ్వరునకు పిల్లలు లేరు. ఎంతకాలానికి పుట్టలేదు. అందుకు ఆయన బహుమంది పూజ్యులను సభార్యుడై ఆరాధించాడు. దైవతాలను మొక్కుకున్నాడు. ఒకరోజున పరమశివుడు యవనేశ్వరునికి కలలో కన్పించి—ఫలానా అడివిలో, ఫలానా శైశిరాయణుడు వున్నాడు అయనవల్ల నీకు సంతానం కల్గుతుంది—అని చెప్పినాడట. యవనేశ్వరుడు ఆ అడవికివెళ్ళి, శైశిరాయణులను రాజధానికి తోడితెచ్చి, సభార్యుడై ఆరాధించి, ఆయనవలన సంతానం బడసినట్లు చెప్పుకుంటారు.

ఇంకో శ్రేష్ఠి: అది ఒకకథ. దీన్నిగూర్చి ఇంకోకథ గూడా వుంది. అదేమంటే—యవనేశ్వరులకు సంతానం లేదు. ఆయన పరమ నిర్వేదంలో పడిపోయినాడు. మంత్రులు అదిచూచి ఒకరోజున ఆయనకు అది చెప్పి, ఇది చెప్పి, వేటకు తీసుకుపోయారు, రాజుకు మనస్సు వేటమీద లేదు. సంతానంమీద వున్నది. ఆ అడవిలో రాజుకు శైశిరాయణులు, పరమఋషులు కన్పించారు. రాజు ఆయన్ను అర్చించి, తన మనోవాంఛ చెప్పుకున్నాడు. శైశిరాయణులు కరుణించి—రాజా! నీకు సంతానప్రాప్తివుంది. కాని......

రాజు—కాని ఏమిటిస్వామి—అన్నాడు. శైశిరాయణులు ఇట్లా చెప్పారు: "రాజా! నీకు ఔరసమైన సంతానంలేదు. నీ అదృష్టంవుండి నీకు ఒక మంచిపుత్రుడు లభిస్తాడు. అతణ్ణి పెంచుకో."

రాజు—తప్పకుండా పెంచుకుంటా నన్నాడు.

అప్పుడు శైశిరాయణులు రాజుతో ఇల్లా అన్నారు: రాజా! ఇంకో ఆరు నెలలు పోయినతర్వాత మళ్ళీ ఈ అడవికి రా. అప్పుడు నీకు ఫలానావారు ప్రక్కన చెట్టుకు కట్టిన గుడ్డలో ఉయెలలో ఒక పిల్లవాడు కన్పిస్తాడు. అతణ్ణి నీవు పెంచుకో. మేము స్వయంగా శిక్షిస్తాము."

రాజు సంతోషించాడు. ఆరునెలలుగడిచినఅనంతరం రాజుకు ఆ అడవిలో శైశిరాయణులు చెప్పినట్లు పిల్లవాడు కన్పించాడు. ఆ కుఱ్ఱవాణ్ణి రాజు తెచ్చి పెంచుకున్నాడు.

ఇంకో శ్రేష్ఠి—ఇంకో కథగూడా వుంది: శైశిరాయణులు తపస్సు చేసుకుంటున్నారు. దేవతలకు భయమైంది. వారు ఒకఅప్సరసను పంపారు. అది వచ్చి ఆయన తపస్సును పాడుచేసింది. కాని వారి సంయోగంవల్ల ఒక కుమారుడు ఫలించాడు. తర్వాత శైశిరాయణులకు జ్ఞానోదయంఅయి ఆమెను పిల్లవానిని వదలిపెట్టి తపస్సులకు కదలిపోయినారు. ఆమె ఆ పిల్లవానిని అడవిలో వదలిపెట్టి దేవభూములకు కదలిపోయింది. ఆపిల్లవాడు యవనేశ్వరులకు దొరికాడు. ఆయన ఆ కుఱ్ఱవానిని పెంచుకున్నారు. తర్వాత ఎప్పుడో

(38-వ పేజి చూడండి)

# పుకారు చేసిన ఉపకారం

బి. కామేశ్వరీకృష్ణ

"రాత్రిళ్ళు యింటికి రావడమే మాని వేశావు! భోజనం ఎక్కడ చేస్తున్నావురా," అని అడిగింది తల్లి, రఘురాంకి మజ్జిగ పోస్తూ. విననట్లు. తనకు కానట్లు తప్పుకున్నాడు తప్పిదం చేసిన కొడుకు.

"నిన్నేరా! అమ్మ అడుగుతుంటే జవాబివ్వాలని తోచడంలేదూ!" అడ్డు ప్రశ్న వేశాడు గుమ్మంలో నిల్చుని వీళ్ళ మాటలు వింటున్న తండ్రి. భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కుని, నిలదీసి నిజం చెప్పించాలని పట్టుబట్టి. తను ఎదురుగా ప్రశ్నించలేక, భార్యతో పరోక్షంగా అడిగిస్తున్నాడు తండ్రి. వాళ్ళ మాటలకు నవ్వుకుని, రఘురాం భోజనం పూర్తి చేశాడు.

"నిన్నే స్నేహితుడొచ్చాడు. వాడికి కాలక్షేపం లేదని అక్కడే వున్నానమ్మా. నాలుగు రోజులు రాకపోతే అంత బెంగయితే ఎలాగు?" నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు రఘు. కొడుకు వైఖరి నచ్చలేదు తండ్రికి.

"చూశావా, సమాధానం! అడిగినదానికి ఎప్పుడయినా సరైన జవాబిచ్చాడా?" మండిపడుతూ భార్యను కొరకొర చూశాడు లక్ష్మీపతి. తను చేయగలిగింది మాత్రమేముంది? వయస్సు వచ్చిన కొడుకు, ఒకరి వద్దికలో లేనివాడు, తెగించి జవాబు లిస్తున్నాడు. చూస్తూ చూస్తూ కొడుకు పతనం ఎవరు సహిస్తారు? ఇవాళ ఏదో తేల్చుకోవాలి అనుకున్నాడు తండ్రి.

"ఎక్కడికిరా మళ్ళీ చలిలో బయలుదేరావు?" వంటింట్లోంచి తల్లి కేక పెట్టింది.

"ఇప్పుడే వస్తానమ్మా...యిక్కడికే" అంటూ సైకిలు వేసుకుని, చీకట్లో గాలిలో దూసుకుపోయాడు రఘురాం. చేసేదేమీ లేక వాలుకుర్చీలో కూలబడ్డాడు లక్ష్మీపతి.

"ఎక్కడికండీ వాడలా హడావుడిగా పరుగెత్తాడు?" లోపలనుండి మరచెంబు నీళ్ళతో వచ్చి కూర్చుంది తల్లి.

"నాతో చెప్పి వెళ్ళాడా?" కస్సుమన్నాడు లక్ష్మీపతి.

"కాదండీ...వారంరోజులనుండి వాడిదే వరస. ఈ రోజు మాత్రమెలాగో తిండికయినా వచ్చాడు. ఇంటిపట్టున అసలుండటం లేదు. ఆఫీసులో పని ఎక్కువగా వుంటున్నాదు. ఎవరో వచ్చారన్నాడు......నాకంతా అగమ్యగోచరంగా వుంది," అంది సాగదీసుకుంటూ.

"నామాత్రం...! ఏమైనా తోస్తుందనా! బయటకు వెడితే నలుగురూ వీడిని గురించి అడగడమే. రోజూ రాత్రిళ్లు "మా యింటి ప్రక్కకే వస్తున్నాడు మీవాడని," నిన్న ఆఫీసులో అడిగాడు గోపాలం. కాలిబదంకే వస్తుంటారా..." తలపంకించాడు లక్ష్మీపతి. మొదట్లో ఆశ్చర్యపోయినా, తమాయించుకుంది. ఆ రోజు ప్రక్కింటి వనజ అడిగితే, వాడుకాదని కసిరికొట్టింది తను. సినిమాకి ఎవరినో అమ్మాయిని వెంట పెట్టుకు వచ్చాడని చెప్పింది. నాకు నమ్మకం లేదని పొమ్మంది. ఈ రోజున ఆయన మాటలు ఆనాటి సంఘటన నిజమని నిరూపిస్తున్నాయి. పెళ్ళయి, కాపురం చేయవలసిన కొడుకు యిలా వ్యసనాల పాలవడం ఆమెకు కడుపులో కెలికినట్లయింది. తనకు నచ్చిన కోడలు, కొడుకు ఎన్నుకున్న అమ్మాయి, సంబంధం స్థిరపరచి వివాహం చేశారు. పెళ్ళిలో మాట పట్టింపువల్లనయితేనేమి కట్నకానుకల పేచీలలో, గిల్లికజ్జా పెట్టి తమని లాక్కొచ్చేశాడు లక్ష్మీపతి. నలుగురికి నీతులు చెప్పేవాడే కాని. తను చేసింది తప్పని గ్రహించుకోలేకపోతున్నారు. చేతులు కాలాక ఆకులతో పనేమిటి?

'దాన్నెవరినో వెంటబెట్టుకుని మొన్న సినిమా కెళ్ళాడుట వీడు. ప్రక్కింటి వనజ చెప్పింది. నేను నమ్మలేదు కాని అప్పటి నుండి అనుమానంగానే వుంది..." నెమ్మదిగా సణిగింది.

"ఇప్పుడేం చేద్దాం. చెయ్యిదాటిపోతే మరీ ప్రమాదం. మనకోసం ఆ అమ్మాయి జీవితాంతం దుఃఖపడాలి..." అంత నిండు మనిషి కరిగిపోయి, బేలయిపోయాడు లక్ష్మీపతి.

"మంచిరోజు చూసి, రెండు రోజులలో అమ్మాయిని పంపించెయ్యమని వియ్యంకుడిగారికి వుత్తరం వ్రాయండి. అర్జంటు వుత్తరం అందేలా రాయండి. మిగతా సంగతులు తరువాత చూసుకోవచ్చునని కూడా చెప్పండి." అంటూ కలం, కాగితం అందించి, ప్రక్క మీదకు వరిగింది. ఆ వుత్తరం వ్రాసి మడత పెట్టి, ఆఫీసు పనికోసం, ప్రక్కగదిలోకి దారితీశాడు లక్ష్మీపతి...

ఆ రోజు ఆదివారం. సెలవు దినమయినా కొడుకు యింటికి రాలేదు. భార్యాభర్త లిద్దరూ గుసగుసపోయారు. ఏం చెయ్యాలో? ఆఫీసులో చూద్దామంటే సెలవురోజు. ఎక్కడని వెతకడం; గోపాలం యింటికి వెడితే అసలు విషయం బయటికి వస్తుంది. అక్కడున్న దెవరో, వీడెందుకు వెడుతున్నాడో తెలుస్తుంది. ఆలోచిస్తూ బయటకు వస్తున్న లక్ష్మీపతికి దారిలో అడ్డయినాడు రఘురాం.

"ఎక్కడినుండిరా రావడం?" గద్దించాడు తండ్రి.

"అక్కడనుండే..."...కొడుకు సమా



గడచిన ఫిబ్రవరి 22వ తేదీన మద్రాసు. రసరంజని సభలో ప్రొ|| పి. సాంబమూర్తి అధ్యక్షతన భరతనాట్య ప్రదర్శన చేసిన కుమారి పద్మ, కుమారి రాణి. వీరిది శ్రీకాకుళం జిల్లా, నరసన్నపేట. నాట్యకళాకేసరి శ్రీ వడహూరు రామస్వామిపిళ్ళె శిష్యురాండ్రు.

# ★ పుకారు చేసిన ఉపకారం ★

ధానం.

"ఏమిటిరా రఘూ..." తల్లి సమాధాయించింది. మౌనం దాల్చాడు రఘు.

"నీ వరస నాకేం నచ్చలేదు. ఈ రెండు రోజూ యింటిపట్టున వుండు. ఆ అమ్మాయిని పంపించమని వుత్తరం వ్రాశాను. ఏ క్షణంలో వస్తారో..." తీవ్రంగా ఆజ్ఞాపించాడు లక్ష్మీపతి.

"నాతో చెప్పకుండా చేశారేం! ఆ అమ్మాయితో నాకేం పనిలేదు. మా సంబంధం ఆనాడే పోయింది," విసురుగా గదిలోకి వెళ్ళిపోయాడు రఘు. కళ్ళప్పగించిచూస్తూ వుండిపోయిందే గాని, నోటమాట పెగలలేదు తల్లికి. మొదలంటా కృంగిపోయాడు తండ్రి,

ఇంత తెగిస్తాడనుకోలేదు. అయినా వయస్సులో వున్న వారిని అదుపులో పెట్టడం తమదే తప్పు. రఘు యిక తన మాటవినని, బాధపడతాడనే ఆశ వారికేనాడో పోయింది. ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించి బావురుమంటోంది. బయట పోస్టుమాన్ కేక వినిపించి హాలులోకి వచ్చి కవరు తీసుకున్నాడు రఘురాం తండ్రి పేరనున్న, దానిని చూసి, లక్ష్మీపతి చేతిలో పెట్టాడు. ఆత్రుతగా విప్పి చదువుకుని ఆశ్చర్యంలో మాటరాక బిగుసుకుపోయాడు తండ్రి. తల్లికేం బోధలేదు. ఆయన చేతిలోంచి కాగితం లాక్కుంది.

"బావగారికి,

నమస్కారములు మీకోడలు మీయింటికి వచ్చి వారంరోజులయింది. అబ్బాయి వచ్చి పంపమన్నాడు. పెద్దల పట్టుదలకు చిన్నవాళ్ళ సరదాలు బలిచేయడం అన్యాయమని, మీతో ఆలోచించకుండా పంపినందుకు క్షంతవ్యులం. మీ సొమ్ము మీ యింటికే చేరింది. అక్కగారికి నమస్కారములు.

వెంకటేశ్వరరావు."

"ఒరే రఘు ఇంతకాలం నువ్వు కాపురం చేస్తున్నది కోడలుతోటేరా! మాటవరసకైనా అన్నావు కాదేంరా!" అంది సంతోషంతో తల్లి.

'అవునమ్మా నన్ను చెప్పనిస్తేగా. నువ్వు నాన్న ఏం మా ంలేదు. నా ఫ్రెండ్సు అందరూ రోజూ చేస్తున్నారు. విశాల భావాలు కలవాళ్ళం తి పురోగమనానికి మార్గదర్శకులం మనమే యిలా అయితే ఎలా అన్నారు. వాళ్ళ బలవంతం మీద ఆ అమ్మాయిని తీసుకువచ్చాను. కామారావింట్లోనే యిన్నాళ్ళు వుంటున్నాము" అని జరిగింది వివరించాడు రఘు.

"చేసింది చాలు కాని, వెంటనే ఆ అమ్మాయిని పిలుచుకునిరా. ఏం యిబ్బందిగా వుందో అక్కడ" అంటు మురిసిపోయాడు లక్ష్మీపతి.

'నాకు కొడుకువనిపించావురా. పుకారు పట్టినేరాలేదన్నమాట అవునులే నిప్పు లేందే పొగ మాత్రమెలా వస్తుంది.' గట్టిగా నవ్వాడు లక్ష్మీపతి.

'పుకారయితే నేం! ఉపకారమే జరిగిందిగా. ఇంత రభస జరక్కపోతే మన జీవితాలిలాగే వుండును. ఇప్పుడిక యిల్లు కళకళలాడుతుంది," అంటూ మురిసిపోయింది తల్లి.

పుకారులో షికారుచేసిన అమ్మాయిని పిలుచుకుని రావడానికి సైకిలెక్కి బయలుదేరాడు రఘురాం..... ★

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతసంచిక తరువాయి)

'బాబుగారు అదృశ్యమైపోయారు... డెర్బీ గుఱ్ఱప్పందాల్లో పాతికవేల రూపాయల...బహుమతివచ్చింది...మాయిం త్రం అందరికీ హోటల్లో టీపార్టీ అన్నాడు. నీకు కబురంపుతానని చెప్పాడు...అంతా ఆరుగంటలకు బాగా పొట్టలు ఖాళీచేసుకు వెళ్ళాం...రాజారావుమాత్రం రాలేదు... హోటలుయజమాని మమ్మల్ని చూచి విరగబడి నవ్వాడు...అప్పుడు అంతా చందాలు వేసు కని ఒక్కొక్కడు ఒక్రుక్కుడు కాఫీ త్రాగి తిరోగమించాం...రాజారావు ఆదినం ఇంటికే రాలేదుట...ఆఫీసులోనూ కనిపించ లేదు. తర్వాత...బొంబాయికి వెళ్ళే రైలు బండి ఎక్కుతూంటే ఎవరో చూశాడట... అతను అదృశ్యమై దాదాపు మూడు నెలలు గడిచిందికూడా...భార్యాబిడ్డల తోవ... అతని బావమరదివచ్చి వాళ్ళని తనింటికి తీసుకుపోయాడు...!' చక్రవర్తి కమండలం లోని నీళ్ళు చేతులోపోసుకుని త్రాగాడు.

వివిధవ్యక్తుల జీవితరీతులు విచిత్రమనిపిం చింది శివరాంకు. అదృశ్యమయ్యే వ్యక్తుల తీరని ఆశల్లా మసకచీకటిలో గన్నేరు పూవులు దూరాన తెల్లతెల్లగా అనుకు న్నాయి.

చక్రవర్తివద్ద సెలవుతీసుకు లేచాడు శివరాం. చక్రవర్తి తనసన్యాసస్వీకారానికి చెప్పినకారణం సమంజసంగా కనిపించ లేదు. బహుశా బ్రతుకును సుఖంగా మరొక మార్గంలో గడపాలని చక్రవర్తి సన్యాసిగా మారి ఉండవచ్చు అనుకున్నాడు శివరాం.

రాజారావు ఎక్కడికి వెళ్ళినట్టు...రిక్షా ఎక్కి స్టేషనుకుపోయి, రైలు ఎక్కి బొంబాయి వెళ్ళి—ఓడఎక్కి ఇంగ్లాండుచేరి...విమా నంమీద కాలిఫోర్నియాలో అడుగిడి ఉండవచ్చు.... అక్కడ విదిగా విలాసాలకొటపట్టయిన పారిస్ చేరి మత్తు పానీయాలతో మనోహారిణులతో విచ్చల విడిగా సంచరించి రూపాయిలు పైసల్లా ఖర్చు, బికారియైపోయి గృహోన్ముఖుడై తిరిగివచ్చి బొంబాయివచ్చే ఓడలో పనివాడుగా కుదిరి కోరికలుతీరి పూర్తిచిరాగ్గి కావచ్చు...రాజా రావుగారి సంకల్ప వికల్పాలు అమోఘమని పించింది శివరాంకు.

కాలు పరుగిడుతోంది. కాచిగూడ బస్సు స్టాండు వీధి మొగలో బట్టల దుకాణం లోంచి విద్యుద్దీపాల వెలుగులో అద్దం బీరువాల్లోంచి క్రొత్తరకం బుష్‌కోట్లు కని పించాయి. కొందామని కాలుకపి లోనికి నడిచాడు శివరాం.

గ కొణంలోని గుమాస్తా బుష్‌కోట్లు చూపిస్తున్నాడు. ఇద్దరు వ్యక్తులు లోనికి ప్రవేశించారు.

'మిస్టర్ శివరాం...నమస్తే!' నవ్వుతూ ఒక నవనాగరిక రమణి నమస్కరించింది శివరాంకు. ఆకారం మారి కొద్దిగా లావెక్కి, ఎదురు పాపిడిలో బర్మాకొప్పు ముడివేసుకుని, పొడుగాటి పులెన్‌కోటులో ఉన్న ఆమెను పోల్చుకోడానికే కష్టమ యింది శివరాంకు. 'ప్రమీల' అంటూ తన పేరు చెప్పుకుని ప్రస్తుతం పూనాలో ఉంటు న్నామంది. ఆమె 'బాగా మారిపోయారు!' అంది. శివరాం నవ్వేడు. ప్రక్కనేవున్న వ్యక్తిని తనభర్త అంటూ పరిచయంచేసింది. ప్రమీల.

ప్రమీల భర్త కేప్టన్ సురేష్. కాకీ పంట్లాం, కాకీ కోటులో యుద్ధరంగంలో పనిచేసే మనిషిలాగేవున్నాడు దుకాణంలో కూడా. భార్య పరిచయం చెయ్యగానే ఒక క్షణం పెదాలమీదికి తిమ్మిసాలు సాగేలా నవ్వి, పలకల ముఖం చిట్లించి, సైనికుడిలా ముఖంలో తీవ్రత ప్రదర్శించి శివరాం దగ్గర సెలవు తీసుకుంటున్నట్లు భార్యను దుకాణంలోంచి బయటికి నడిపించాడు కేప్టన్.

వారిద్దరూ దుకాణంలోకి ఎందుకు వచ్చారో శివరాంకు అర్థంకాలేదు. అయినా ప్రమీలకు వివాహమయినందుకు లీలగా నవ్వుకున్నాడు శివరాం.

శివరాం ఇంటికి వచ్చి విశ్రమించాడు. చదవడానికి పట్టుకెళ్లిన వార్తాపత్రిక వాపసు చేయడానికి లోనికి వచ్చాడు జనార్దనం.

'నిద్రపోతున్నారా?'

'లేదు కూర్చో...! ఏమిటి విశేషాలు!' ప్రక్కమీద ఒత్తిగిలి శివరాం ప్రశ్నించాడు.

'ఏమున్నాయి – వార్తాపత్రిక నిండా వార్తలే...శాంతి, శాంతి నినాదాలు... ఆటంబాంబుల ప్రయోగాలు...మంత్రుల ఉపన్యాసాలు ... ఒకరోజు గడిచిన వార్తా పత్రిక మరొకరోజు చదవక్కర్లేదనిపిస్తుంది మానవనైజం మారితే కాని మానవవార్తలు కూడా మారేలాలేవు!'

జనార్దనం మాటల్లో సత్యం ఉందను కున్నాడు శివరాం. వార్తాపత్రిక చూశాడు. వివిధపార్టీలు తాము ప్రజలకు చెయ్యబోయే ప్రణాళికలు ప్రచురించారు. ఎన్నికలప్రచా రం నాందిరూపంలో పడింది. బహుశా తానుకూడా విజయం పొందడానికి కృషి చేసే సమయం దగ్గరకువచ్చిందనుకున్నాడు.

ఎన్నికల సంరంభం గురించి జనార్దనానికి చెప్పాడు తన ప్రచారానికి ప్రతిపాదికగా.

'మీరెందుకు ఎన్నికల్లో నిలబడరాదండీ మనప్రాంతంనుంచి!' అన్నాడు జనార్దనం.

'మీరంతా సాయంచేస్తారా?' అడిగాడు శివరాం లౌక్యంగా.

'సాయంచేయడమేమిటి...జీవితాలుధార పోస్తాం!' నవ్వాడు జనార్దనం.

'అయితే...నిలుచున్నా...మన ప్రాంతంనుంచి స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేస్తున్నా!' శివరాం విషయం విపులీకరించాడు, జనార్దనంమీద విశ్వాసంతో.

మర్నాడు జనార్దనం మేడక్రింద పేటలో ఎరుకున్న స్నేహితులతో శివరాంకు ఓటు వెయ్యాలంటూ ప్రచారం మొదలు పెట్టాడు. అంకయ్య, లక్ష్మన్న, పులిగాడు, మేడ క్రిందిపేటలోని యితర సన్నిహితులు, ఎరు గన్న లాయరు మిత్రులు శివరాం ఎన్నికల ప్రచారానికి సన్నాహాలు చేశారు. శివరాం ఓటర్ల జాబితా తీసుకుని, స్నేహితులతో ఇంటింటికి వెళ్ళి ఓటివ్వమని వినయంగా అడిగాడు. ప్రసిద్ధికెక్కిన వకీలు తమ యింటికి వచ్చాడనే సంతోషంతో లౌక్యులు, పెండ్లికొడుకువంటి శివరాంపై ఆశలున్న కన్యల తండ్రులు, ప్రఖ్యాతచిత్రకారుడని కళలో యిష్టమున్న విద్యావంతులు, తమ కష్టాలు బాపిన నాయకుడని కొందరు, శివ రాంకు ఓటువేయడానికి తీర్మానించు కున్నారు. తనకు శిష్యుడి వంటి కుర్రాడిని పైకి తీసుకురావటం తన బాధ్యత అంటూ సరోజినీశాస్త్రి చుట్టుప్రక్కల ప్రతీయింటికీ వెళ్ళి శివరాం గురించి ప్రచారంచేశారు.ఓటు యిమ్మని. భావిలో తమకు సహాయకుడు

కాగలననే ఆశతో తృణబాన లెక్క చేయకుండా నారాయణ, మునపటిస్నేహం పురస్కరించుకుని, రెండో పెళ్ళిద్వారా పెరుగుతున్న తన కుటుంబానికి, వ్యాపారానికి ఎప్పుడైనా అవసరపడగలడని కోమటి యజమాని, క్రొత్తగా మరొక నాటకసంస్థ స్థాపించి పెద్దల సహకారం కోరుతున్న ప్రభాకరం, తమంతటతామే ముందుకు వచ్చారు. ఎన్నికల ప్రచారంలో సాయం చేస్తామంటూ. ముంగితనంతో, లౌక్యంగా అందరి సహాయాన్నీ స్వీకరించాడు శివరాం.

ఊరేగింపులు, హరికథలు, బుర్రకథలు ప్రతివీధిలోనూ గింగురుమంటున్నాయి. పెద్ద పెద్ద అరణ్యాలలో చెట్లు లారీలమీద కట్టిన పెద్ద గుడిసెలు, నాగలితో ఉన్న జంట ఎద్దులబొమ్మలు, రబ్బరుతో చేసిన పెద్ద చేతులు, వాటికి సంబంధించిన పోటీదార్ల జై జై నినాదాలతో ఊరేగించారు. వ్యక్తులను గురించి అల్లిన గేయాలు పాడారు. బాజాలు బాదారు. ధనిక పోటీదారులు మభ్యపెడుతూ ఓట్లను కొనడానికి ప్రయత్నించారు.

ఎన్నికలు పూర్తయ్యాయి. శివరాం నెగ్గాడు. ఎన్నికల ప్రచారంచేసిన అప్తులంతా శివరాంను కారులో ఎక్కించి ఊరేగించారు. జై జై ధ్వానాలతో పూలవంకలతో, వ్యక్తిగత విలువలమీద, ఆధారపడి ఎన్నికలలో పోటీ చేసిన శివరాం ఎక్కువ ధనం వెచ్చించవలసిన అవసరం లేకపోయింది. సాధించిన శాసన సభ్యత్వంద్వారా ప్రజలకు మునుపటికన్న ఎక్కువగా సేవచేయాలనుకున్నాడు శివరాం.

కాలక్రమంలో పదవులు, సంపత్తి, ధనం విఖ్యాతి హెచ్చవుతున్నా, శివరాంకు జీవితంలో ఏదో పెద్దలోపముందని అవ్యక్తంగా బాధపడుతూనే వున్నాడు. ఎటువంటి ఔన్నత్యం లభించినా ఆత్మీయత ప్రదర్శిస్తూ అనురాగం చూపే స్త్రీ లేనంతవరకూ, తన బ్రతుకు ఎడారిలాంటిదే అనుకున్నాడు శివరాం.

ఒక రోజు ప్రొద్దున్నే కాఫీ అందిస్తూ 'ఈ వేళ హోలీపండుగసార్ !' అన్నాడు గోపీ.

కాలంలోని పండుగలే పట్టించుకోని శివరాం ఉలిక్కిపడ్డాడు బహుశా శెలవు కావాలని గోపీ అభిప్రాయమని అర్థం చేసుకున్నాడు శివరాం. వెళ్ళమన్నాడు గోపీని.

ఎన్నికల సంరంభంలో తిరిగి హూనం చేసుకున్న శరీరానికి శివరాం విశ్రాంతి ఇస్తున్నాడు. మధ్యాహ్నం భోంచేసి పడుకున్నాడు. తలుపు చప్పుడయింది. తీశాడు శివరాం.

టాంగా సీనయ్య ఒంటినిండా రంగులు చల్లుకుని క్రొపు ముఖంమీదకు ఎగరగా, జీవం ఆకారంలో ప్రత్యక్షమయ్యాడు.

'నా లక్ష్మి చచ్చిపోయింది...పోయింది ...యీ రంగులన్నీ వాళ్ళు పోసేరు...పెన వలు...మీకు చెప్పకోవాలనివచ్చా...దణ్ణం దొరా ఏమనుకోకండి!' అంటూ వెళ్ళిపోయాడు సీనయ్య.

టాంగా సీనయ్యకు భార్య పోయాక మతి భ్రమించింది. టాంగా పెద్దకుర్రాడు నడుపుతున్నాడు స్వతంత్రించి. విచిత్ర ఉద్రేకాల్లో ఉత్తమమయిన ఇల్లాలిని ఉరికంబం ఎక్కించుకుని జీవితమే నాశనం చేసుకున్న సీనయ్యను చూసి జాలిపడ్డాడు శివరాం.

హోలీ పండుగ మంటలు శివరాం గుండెల్లో అగ్నిజ్వాలలు రగిల్చాయి. కారవ్, రాణి రంగులు పూసుకుని కళ్ళముందు కదిలారు. కలల్లోని బొమ్మలుగా ఉన్న వాళ్ళను పూర్తిగా మర్చిపోవాలనుకున్నాడు. భగ్న ప్రేమకు తిలోదకాలొసగి, బ్రతుకు బరువు తగ్గించుకుని. భౌతిక ప్రపంచంలో సామాన్యుడుగా మసలడం కూడా మానవుడు పరిపూర్ణత్వంపొందడానికి ముఖ్యమనిపించింది. అందం, విద్య, గుణం కలిగిన స్త్రీ నెవరినైనా స్వీకరించి, కుటుంబం పెంచుకుని వచ్చే హోలీ పండుగనాడు సంతృప్తిగా ఆనందించగలిగినప్పుడే అర్జించుకున్న ఔన్నత్యం విలువలు సార్థకం కాగలవనుకున్నాడు శివరాం.

## 19

మధ్యాహ్నం రెండు గంటలు. నృత్యం చేస్తూ వేదికమీద గిర్రున తిరిగే ఆడదానిలా, సుడిగాలి రివ్వున వీచింది. ఆడదాన్ని చుట్టుకున్న కోకలా ధూళి తరంగం పైకిలేచింది.

నాయుడుగారి కూతురు సొగసుగా ముస్తాబై పిల్లను దాసి ఎత్తుకొని వెంట నడవగా, భర్తతో ఏదో మాట్లాడుతూ, నగరంలోని బంధువుల యింటికి బయలుదేరింది. ప్రక్కయిళ్ళ గృహిణులకు పోటీగా తన యింట్లో ఒక అప్సరను దిగుమతి చెయ్యాలనుకున్నాడు శివరాం.

టెలిఫోన్ మ్రోగింది.

గోపీ పిలిచేడు.

వరండా విడిచి టెలిఫోన్ అందుకున్నాడు శివరాం. రేపు సాయంత్రం ఆరున్నర గంటలకు......ఒక జమీందారు గారింట్లో విందు......ఇంగ్లండు దేశంనుంచి వచ్చిన ప్రముఖ కార్మికనాయకుని గౌరవార్థం...ఒకే విశ్వవిద్యాలయంలో ఇంగ్లండులో యిద్దరూ కలిసి మునుపు చదువుకున్న పురాతన స్నేహం పురస్కరించుకుని జమీందారు విందు ఏర్పాటు చేశాడు కార్మిక



# అన్వేషణ



నాయకుడికి. శివరాం తన అంగీకారం తెలియజేశాడు.

ప్రక్కయింటివారి శీను అల్లరిగా ఈల వేసుకుంటూ తప్పటడుగులతో సగాగొత్తుకుని లోపలికి వచ్చాడు. ద్రాక్షపళ్ళ గుత్తి ఒకటి వాడిచేతిలో పెట్టి ఎత్తుకొని ముద్దాడి పంపించేశాడు శివరాం.

తన ఎరుకలో ఉన్న కన్యలందరూ శివరాం కళ్ళముందు తిరిగారు. ఉండ్రాజవరం వెళ్ళినపుడు దీక్షితులు యథాలాపంగా తన బంధువు సోమేశంగారి ఇంటికి శివరాంను తీసుకు వెళ్ళినపుడు, సోమేశ్వరంగారు తన పద్మిమిడీళ్ళ కూతురిని చూపించి పరిచయం చేసి వీణపాట పాడించాడు. మనస్సులో ఏదో ఉద్దేశం పెట్టుకుని నేరేడుపండు రంగులో నిగనిగలాడుతూ, లక్షణమైన ప్రశాంత వదనంలో ప్రత్యేక అందంతో అలరారుతూ వీణ తంత్రులు మోగించి శివరాం హృదయ తంత్రులు కదలించింది ఆ అమ్మాయి. పరిపూర్ణమైన గృహిణిలా కనిపించిన ఆమెను పరిణయమాడితే బాగుండునేమో అనుకున్నాడు శివరాం. దీక్షితులుకు ఉత్తరం వ్రాద్దామని కలం, కాగితం పట్టాడు. ఏదో ఆలోచన మెదిలి మళ్ళీ కలం, మేజా బల్ల మీద ఉంచేశాడు ఉదాసీనంగా.

నారాయణ మొట్టమొదట చూపించిన పెళ్ళికూతురు జ్ఞప్తికి వచ్చింది. తన్నే పెళ్ళి చేసుకుంటానంటోంది అంటూ ముసలి తండ్రి తన్ను వెన్నంటిన దృశ్యం కదిలింది...

ఆఫీసులో తనతో పనిచేసి ఆకర్షించిన పల్లటి అమ్మాయి, ఎన్నికల ప్రచారం సమయంలో కొద్దినిమిషాల పరిచయంతోనే మనస్సులో ప్రవేశించిన పోలింగ్ బూత్ లోని పంతులమ్మ, చిత్రలేఖనంలో తనకు వచ్చిన బహుమతులగురించి ముఖంలో స్త్రీ సహజ ఉద్రేకాలు అణుచుకుంటూ అభినందనలు అందిచ్చిన మెడికల్ విద్యార్థిని, బస్సులో మునుపు నిత్యముకనిపించి నమస్కరించి మాట్లాడే ధైర్యంలేక చిరునవ్వునవ్వే వంకీలజుట్టు పొట్టిఅమ్మాయి...లీలగా సిగరెట్టు పొగలరింగుల్లో ప్రతిబింబాలుగా కదిలారు...కులమత విభేదాలున్నా, గుణానికి ప్రాధాన్యతయిచ్చి వారిలో ఎవరినైనా వివాహం చేసుకుంటే...

వివాహాభిలాష కలిగితే ఎంత అభ్యుదయ దృక్పథమున్నా. చివరకు పురాతన సాంఘికాచారాలకు మర్యాదగా లొంగవలసిందే అనుకున్నాడు. పేరిశాస్త్రి ద్వారానే ఈ విషయం పరిష్కరించడం ఉత్తమమనుకున్నాడు, తనంతటతానే ఆయన్ను పిలిచేకంటే, తాత్కాలికంగా కనిపించినపుడు ప్రస్తావన తేవటం సమంజసంగా తోచింది శివరాంకు

ఎవరో ముగ్గురుపార్టీలవచ్చి తమవివాదాల పరిస్థితులు శివరాంతో చర్చించుకుని వెళ్లిపోయారు.

వీధిలో బాజాలు, సన్నాయిలు, బ్యాండు ధ్వనులు మారుమ్రోగాయి. శివరాం వీధి వరండాలోకి పోయినిలుచున్నాడు. పూలదండలకట్టిన పెళ్ళికారులో వివాహమయిన క్రొత్తదంపతులు ఊరేగుతున్నారు. బంధువులంతా ఆవివాహానికి సాక్షులుగా కారువెంట గుంపులుగా నడుస్తున్నారు. కత్తిసాము, కర్రసాము ప్రదర్శనలతో ఊరేగింపు కదిలిపోయింది.

పేరిశాస్త్రి మేడమెట్లు ఎక్కలోనికి వచ్చాడు "మాశావా శివరాం ఆ ఊరేగింపు!' పకపక సరదాగా నవ్వారు.

శివరాం ఆయన్ను ఆహ్వానించి మౌనంగా మందస్మితం చేశాడు.

'నీ పెళ్ళెప్పుడు ... మాకు ఎన్నాళైనా బూరెముక్క పెట్టేదవా?' పేరిశాస్త్రి తనసహజ లౌక్యధోరణిలో మనిషిని కష్టపెట్టకుండా విషయం కదిపాడు.

ఈ అవకాశం వదులుకోకూడదనుకున్నాడు శివరాం.

## సృష్టి వైచిత్ర్యం

పేషెంటు: ఏమండీ! డాక్టరుగారూ! ఈకుడికన్ను మంటగా ఉందని మందువేస్తుంటే - మంట తగ్గలేదు సరికదా యిప్పుడు మాపుకూడా తగ్గినట్లుందే!

డాక్టరు: అదే సృష్టివిచిత్రం! భగవంతుడు ఎందుకు మనకు రెండుకళ్లు యిచ్చాడు? ఒకటి పోయినా యింకోటి ఉంటుందనే దూరదృష్టితో. మరేం భయం లేదు. అవసరంఅయితే నాలుగు అయిదు రోజుల్లో దాని అంతు తేలుస్తాం. ఆపరేషన్ చేసైనా సరే!

నోరి శ్రీరామచంద్రమూర్తి

'ఆభారం నీకే వదిలేశాను:' అన్నాడు శివరాం కూడా లౌక్యంగా.

'ఆబాధ్యత నానెత్తిన వేసే...మర్నాడే వివాహం!' పిడికిలి బిగించి మేజాబల్లమీద కొట్టాడు శాస్త్రి

'అయితే కానిచ్చెయ్యండి!' మందస్మితం చేశాడు శివరాం. పేరిశాస్త్రి ఉబ్బితబ్బిబ్బైపోయాడు. ఉన్నత సాంఘికపరపతి గడించుకున్న శివరాంకు తాను సన్నిహితుడుగా మసలడమే తనకు గౌరవం అపాదించబడుతున్నప్పుడు, అతనికి ఆప్తుడుగా ఉండి వివాహం చేయిస్తే, తన స్వంత పలుకుబడి ద్విగుణీకృతమయి. జీవితంలో యితర స్వార్థప్రయోజనాల సాధనకు తోడ్పడుతుందని ఆశించాడు పేరిశాస్త్రి.

'జీవితంలో వ్యక్తి సంపాదించే ధనం, గౌరవం, కీర్తి ప్రతిష్ఠలు, అంతా కుటుంబం కోసమేనోయి...గృహంలో సతి, సంతానం ఉంటే జీవితానికి నిండు!' అన్నాడు నీతి బోధిస్తూ పేరిశాస్త్రి

'మనస్సు మారింది.. ప్రస్తుతం మీ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాను" అన్నాడు శివరాం,

'ఈవీధిచివర కొండమీద చిన్న స్థలం కొన్నాను.. స్నేహితుడొకడికి అది చూపిస్తూ......నిన్నుకూడా చూచిపోవాలని వచ్చాను...వచ్చినందుకు పూరికే పోవటం లేదు!' పేరిశాస్త్రి తన ఆగమన కారణం చెప్పేడు ప్రత్యేకం పెళ్లి గురించి అడగడానికి రాలేదని శివరాం తెలుసుకోవాలని.

గతించిన ఎన్నికల సంరంభంలోని గందరగోళాలు కాస్సేపు యిద్దరూ ప్రస్తావించుకున్నారు. పేరిశాస్త్రి సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

అలమరలోంచి తొంగిచూస్తున్న అర్థనగ్న అజంతా చిత్రాలు సాత్విక సౌందర్యంతో శివరాం హృదయాన్ని దూసుకుపోయాయి గోడమీది కేలండరులో గొల్లవాని మురళీధ్వనికి గొల్లభామ ఒకతే స్వప్నంలా మమతల ఉద్రేకాల్లో ఊగుతోంది.

మర్నాడు సాయంత్రం జమీందారుగారి మూడంతస్తుల పెద్దబంగళాముందు కారులో దిగాడు శివరాం. పెద్దకొండమీద నిర్మించిన ఆబంగళాముందు కారులు ఒకవారగా బార్లులో నిలుచున్నాయి. నగరం లోని ప్రముఖులు, కొందరు భార్యా సహితంగా లోనికి నడుస్తున్నారు. కరచాలనాలు పరస్పర నమస్కారాలు జనంకదలికల్లో ప్రస్ఫుట మౌతున్నాయి. జమీందారుగారు పాశ్చాత్యనాగరికత ప్రతిబింబిస్తున్న తన సతీమణితో వచ్చే అతిథులను మందస్మితాలతో వినయంగా ఆహ్వానిస్తున్నారు. బంగాళా వెనక ఫర్లాంగున్నరవ్యాసార్థంతో వృత్తాకారపు సుందర ఉద్యానవనంలో అందమైన మేజాబల్ల

చుట్టూ ప్రేక్షకుల కుర్చీలు అమర్చబడి ఉన్నాయి సెర్వర్లు ఫలహారాలతో ప్లేట్లు మేజాబల్లల మీద అమరుస్తున్నారు ఎరుకున్న వ్యక్తులు గుంపులుగా ఉద్యానవనంలో చేరి నగరరాజకీయాలు, ఉద్యోగాలలో మార్పులు, విదేశీ వార్తలు ప్రస్తావిస్తున్నారు తమ విజ్ఞానం ప్రకటిస్తూ. కళల నభిమానించే విద్యాధికులు, పరిచయమున్న కార్మిక నాయకులు శివరాంచుట్టూ మూగారు.

బంగారురంగు బట్టతలతో, ఎర్రని కందగడ్డ ముఖంతో. రాగిరంగు దాల్చిన చిన్న మీసంతో ఉద్వేగంగా ఆలోచిస్తున్న ఆంగ్ల కార్మిక నాయకుని వెంటబెట్టుకుని జమీందారుగారు, ఆయన సతీమణి ఉద్యానవనంలో ప్రవేశించారు. జమీందారుగారు కార్మిక నాయకుని అందరికీ పరిచయం చేశారు ప్రభుత్వోద్యోగులు, కార్మిక నాయకులు, కళారాధకులు, నవాబులు, జమీందారులు, మహిళా సంఘ కార్యకర్తలు, మంత్రులు విందుకు విచ్చేశారు.

ఆంగ్ల కార్మిక నాయకుడు తాను యీ దేశంలో చూచిన కార్మికుల జీవన పరిస్థితులకు తన దేశంలోని కార్మికుల స్థితిగతులకు ఉన్న వ్యత్యాసాలు విపులీకరించి, భావిలో ప్రపంచమంత కార్మికుడే ఏలగలడనే విశ్వాసం ప్రకటించాడు

శివరాం తా నెరిగిన వ్యక్తులతో హాస్యంగా సంభాషిస్తూ ఫలహారాలు చేస్తున్నాడు ప్రక్క మేజాబల్లమీద కూర్చున్న సురంగేశ్వరరావుగారు శివరాంవైపు తేరిపార చూశారు శివరాంను ఎరిగున్న ప్రభుత్వోద్యోగి ఒకడు తనతో ఫలహారం చేస్తున్న సురంగేశ్వరరావుగారిని అతనికి పరిచయం చేశాడు

'మిమ్మల్ని ఒకసారి కాలేజీ వార్షికోత్సవంలో చూశాను,' నవ్వాడు సురంగేశ్వరరావు.

'మీ పేరు ఎరుగుదును కాని.. పరిచయం లేదు!' అన్నాడు శివరాం మర్యాదనటిస్తూ

'మీ చిత్రాలు కొన్ని చూశాను.. నిపుణమైన కళ ఉంది వాటిలో!' సురంగేశ్వరరావుగారు పొగిడారు చిత్రకళలోని విచిత్రరీతులు ఆయనకు తెలియకపోయినా.

కృతజ్ఞతగా మందస్మితం చేశాడు శివరాం

విందు ముగిసింది.

ఆంగ్ల కార్మిక నాయకుని గౌరవార్థం తాను నాయకత్వం వహిస్తున్న కార్మిక సంఘాల ఆధ్వర్యంలో ఒక బహిరంగసభ జరిపి ఆయన కార్మిక సేవకు తన అభినందనలు తెలిపాడు శివరాం. ఆయన రాకవల్ల నగరంలో లేచిన హడావిడి తగ్గింది.

సురంగేశ్వరరావుగారిని వెంటబెట్టుకుని పేరిశాస్త్రి ఒకరోజు తిన్నగా శివరాం యింటికి వచ్చేశాడు సురంగేశ్వరరావుగారి ప్రక్కనే పేరిశాస్త్రి కనిపించడంతో ఆయన ఆగమన కారణం సులభంగా గ్రహించాడు శివరాం.

సురంగేశ్వరరావుగారు చనువుగా స్వపంగా వచ్చిన పని పూర్తిగా చెప్పేసి తన కూతురును ఒకసారి చూడమన్నారు. మధ్యవర్తిలా వచ్చిన పేరిశాస్త్రి సురంగేశ్వరరావుగారి కుటుంబ సంప్రదాయాలు, గౌరవం, కూతురు అందచందాలు, తెలివి, విద్య యథాశక్తి వర్ణించాడు శివరాం చంద్రప్రభను చూడడానికి అంగీకరించాడు

పేరిశాస్త్రిని వెంటబెట్టుకుని శివరాం సురంగేశ్వరరావుగారి యింటికి వెళ్ళాడు నిర్ణయించిన ఒక శుభదినంనాడు. కామేశ్వరమ్మ సురంగేశ్వరరావు సగౌరవంగా తమ సాంఘికహోదా అంతా వాతావరణంలో ప్రస్ఫుటం చేస్తూ శివరాంను ఆహ్వానించారు. సోఫాల్లో కూర్చున్నారంతా. సురంగేశ్వరరావుగారు ప్రసాదను పరిచయం చేశారు

'కాబోయే బావమరిది!' పేరిశాస్త్రి నవ్వాడు సరదాగా అలుసు అయినా కాబోయినా ప్రఖ్యాతచిత్రకారుణి ప్రత్యక్షంగా కలుసుకున్నందుకు సంతోషమంది కామేశ్వరమ్మ.

సురంగేశ్వరరావుగారు శివరాం వృత్తి వ్యాపకాల గురించి ప్రశ్నించారు

'కాబోయే భార్యను ప్రవేశపెట్టండీ!' కులాసాగా నవ్వుతూ తన సంభాషణ పరిహాసికతనలో తానే సంతృప్తి పడ్డాడు పేరిశాస్త్రి లోపలి నుంచి రాణి, చంద్రప్రభ కలసి వచ్చి సోఫాలో కూర్చున్నారు సురంగేశ్వరరావుగారు ఎంతో అంతర్గత భావంతో రాణిని పరిచయం చెయ్యలేదు.

శివరాం దృష్టి మొదట రాణిమీద పడింది చకితుడై ఒక నిముషం సంభ్రమంలో పడ్డాడు మధురవల్లికలు, హృదయంలోని ఉద్రేకాలు అణచుకుని చంద్రప్రభ వైపు చూశాడు గుండ్రని వదనంతో, లేతనును బుగ్గలతో సిందూర తిలకంలో తెల్లటి పిల్లకచీర జాకెట్టులో లాలిత్యం తొణికిసలాడిస్తూ వెన్నెల్లా అగుపించింది; ప్రశాంతంగా చూచి నవ్వింది, నమస్కరించింది ఆమె చంద్రప్రభ అందం రాణిమీద భగ్న ప్రేమ, హృదయంలో భావాల సంఘర్షణ రేప శివరాంకు వ్యథకలిగించాయి

పెళ్ళికొడుకులా సిగ్గుపడుతున్నట్లు, ముఖంమార్చి ముభావంగా మేజాబల్లమీద మేగజైనతీసి తెరచాడు శివరాం వనితారత్న స్వరూపం అందంగా రంగుల్లో అంగుళం ప్రచురింపబడింది 'బొమ్మలు చూడ్డమెందుకోయి. ఎదురుగా అందాలరాణి' నవి లేశాడు పేరిశాస్త్రి నవ్వుతూ.

శివరాం, చంద్రప్రభ పలకరించుకున్నారు కొంచెం సిగ్గుతో, నాగరికత నేర్పిన స్వేచ్ఛతో, చంద్రప్రభ శివరాం చిత్రకళను ప్రశంసించింది శివరాం తానెరిగిన ఆమె కాలేజీ విషయాలగురించి ముచ్చటించాడు రాణి వదనంలో తిలకం లేక, సాదాముతక తెల్లచీరకట్టుకుని విరాగంజరంగా వితంతువులా కనిపించింది శివరామ్‌కు. ఆమె ఆ యింట్లోకి ఎల్లా వచ్చిందో శివరామ్‌కు విచిత్రమే అనిపించింది ఆమెగురించి మరిచిపోయిన ఆ వేదన మళ్ళీ హృదయంలో ఉబికి రగిలింది. వివాహానికి స్థిర నిశ్చయం చేసుకుంటున్న స్థితిలో ఆమె పునర్దర్శనం తన మనోనిశ్చయాన్ని భంగం చేయగలదనే బలహీనతతో కుమిలాడు శివరాం

సురంగేశ్వరరావుగారు లేచి తమ క్రొత్త యింటినంతా చూపించారు. ఇల్లంతా నవనాగరిక రీతుల్లో శోభాయమానంగా వుంది

(45-వ పేజీ చూడండి)

## బాహ్య శత్రువులు

ఆమె: బుద్ధిలేదూ? నేను ఎక్కడికి వెడితే అక్కడే సిద్ధం

అతడు: ఏం చెయ్యను? మనసుతోపాటు తనువులు కూడా దగ్గరగా ఉంటాయని. బుద్ధికూడా సరిగ్గా పనిచెయ్యడం లేదు నిన్నిల్లా కొరకొరలాడుతూంటే.

ఆమె నోరుముయ్యి!

అతడు: నీదా? నాదా? ఈరోడ్డుమీద మన సంభాషణ ఎవరేనావింటేసిగ్గుపడతారేమో నని భయంగా ఉంది ఎందుకేనా మంచిది మనం ఉభయులమూ ఏకస్వరులమై-జాయింటుగా నోరుమూసుకుని ఆ చెట్టుక్రిందకు చేరడం.

ఆమె . సిగ్గూ బిడియం లేక పోతే సరి!

అతడు: ఆ రెండూ కార్యవాదికి బాహ్యశత్రువులు! మన లాటివాళ్లకు 'నభయం-నలజ్జ' అన్నారు పెద్దలు!



నెలక్రితమే వేసిన సన్నజాజి పందిరి క్రింద కుర్చీ వేసుకొని అప్పుడే వచ్చిన దినపత్రిక తీసుకొని, కుర్చీలో జారగిలబడుతూ, తనచీర నొకసారి చూచుకొని తనలో తనే మెల్లిగా నవ్వుకుంటోంది సుజాత. మూడు నెలలు వెనక్కు వెళ్లింది మనస్సు ఈ చీర నే కట్టుకుందారోజున కూడా.

తను మెట్రిక్ పాసయింది. నాన్న, అమ్మ యింక చదువు వద్దన్నారు. తనకు కాలేజీచదువు చదవాలని సరదా! అక్క తనతో ఒకసారి అంది, “నా దగ్గరుండి చదువుదువుగాని నాదగ్గర కొచ్చెయ్య'మని ఆమాటనే నాన్నతో తను అంది నాన్న కసురుకున్నారు. 'ఈడొచ్చిన పిల్లని, ఎంత అక్క అయినా పంపనన్నారు. తనుచేసేది లేక మూడురోజులు అన్నం తినకుండా కూర్చుంది. ఏ బుద్ధినున్నారో ఒక శుభ సమయాన అక్క దగ్గరకు విశాఖపట్నం తీసుకెళ్లారు.

రోజులు గంటల్లాగ, నెలలు రోజుల్లాగ, గడిచాయి సరదాగా. అక్కకు అపరాగా వుంటూ బాగానే వ్రాసింది పేపర్లు సెలవలకు తన వూరు వెళ్ళాలనుకుంది కాని, అక్క 'యిక్కడేవుండి చదవగ దూ! ఏముందక్కడ?' అంది. అందుకు తను “కాదక్క! అమ్మ, నాన్నలను చూసి రావాలనివుంది. వారంరోజులలో వచ్చేస్తా. వచ్చేసంవత్సరం చదువు ముందే చదువుతా సరేనా?” అంది, “సరే నీయిష్టం” అంది అక్క.

అక్కకి కుట్టుపని అంటే సరదా. తనకు తెల్లచీరలంటే ప్రాణం. తనకు ఒక చీరకు మంచిడిజైనుతో పువ్వులుకుట్టింది. ఆచీరనే తను బయలుదేరినప్పుడు కట్టుకుంది. గులాబీ రంగు జాకెట్ వేసుకొంది జాజిపువ్వులంటే తనకు అమితప్రేమ. అక్కకు తెలుసు పెద్ద దండగ్రుచ్చి తనతలలో తురిమింది “ఈ నొక్కుల జుట్టుకీ బారెడు జడకీ, వెయ్యి పువ్వులయితేనే గాని నీకు చాలవు,” చిరుకోపముతో నవ్వి పెట్టిందారోజు తలలో. “వెళ్ళొస్తానక్కా” అంది తను.

“జాగ్రత్త ఎప్పుడూ ఒంటరిగా వెళ్లలేదు. పైగా రాత్రిపూట! వెంటనే వుత్తరం వ్రాయి” స్టేషన్ కొచ్చి దిగబెట్టింది రైలుకదిలింది అందరిముఖాలూ చూసింది తను. ఎవరూ తనవైపే చూడటంలేదు. ప్రక్కనున్న ముసలమ్మని అడిగింది “ఎందాకా?” అని తను దిగే స్టేషన్ కి అవతలే, తెల్లవారితేనేగాని తనవూరు రాదు. హాయిగా నిద్రపోవచ్చు తనదగ్గర పోతాయి అనుకునే వస్తువులు ఏమీలేవు నిశ్చింతగా నిద్రించవచ్చు ఒక్క రెప్ప మూతపడలేదు. రైలు వేగంగా పరుగెత్తుతోంది నిప్పు రవ్వలు కిటికీగుండా దూసుకొచ్చి మరీ తన మీద దాడిచేస్తున్నాయి, ఈ చీరమీదపడితే?

అమ్మో! అక్క పడిన శ్రమఅంతా వృథా. గబగబ లేచింది. నిద్రమత్తు. అందులో రైలు కుదుపు. కిటికీలు మూయాలి నిలుచుని కిటికీ క్రిందికి దించబోయింది తూలిపడి చేతులతో సీటుని ఆనుకుంది మళ్లా ప్రయత్నించింది ఊహూ, సాధ్యం కావడంలేదు. వెనుకనుండి ఎవరో అంటున్నారు: “అలా కాదు సీటుమీద కూర్చుని, దాన్ని కొంచెం పైకెత్తి క్రిందికి దించండి,” అని. తానా ప్రయత్నం చేసింది. లాభం లేకపోయింది. ఇంతలో వెనుకనుండి రెండు చేతులు తన భుజములమీదుగా వచ్చి తన చేతుల దగ్గరే చేతులుంచి కిటికీని దింపేయి. తను వెనక్కి తిరిగింది. ఇంతలో అతను తన తలలోని జాజులదగ్గరతలఆనించి, “అబ్బ!” అన్నాడు. తను కొయ్యఐంది అతనికళ్ళు జ్యోతుల్లా మెరుస్తున్నాయ్ తనకు భయంవేసింది. గట్టిగా అరవబోయింది కాని అతను తన నోరుమూసి “అరవకు” అంటూ రెండు భుజాలతోనూ తన రెండుకళ్లూ తుడుచుకుంటూ వెళ్లి. తనసీటులో కూర్చున్నాడు. తనకంతా కలలాగ వుంది ఏమిటీ సాహసం. అందరూ నిద్రిస్తున్నారనా? ఎవరినయినా లేపితే? ఇటు చూడడేం? 'జాగ్రత్త' అన్నట్లు బెదిరించాలి. చూడడేం రౌడీ. చాలా గొప్పవాడిలాగ కూర్చున్నాడు మళ్లీ. దేవానంద్ పోలికలు కూడాను ఎందుకేడుస్తున్నాడో? ఇంతలో ఏదో స్టేషన్ లో రైలు ఆగింది ఆగకముందే గబగబ దిగి పరుగెత్తాడు పిరికివాడు! కాని ఎందుకో అతని దీనమయిన కళ్ళు, ఆ విచారవదనం చూస్తే తన మనస్సు ఏదోలాగ అయిపోయింది నిద్రపట్టలేదు మళ్ళా తనవూళ్లో దిగింది అమ్మ, నాన్న తనువచ్చినందుకు చాలా సంతోషించారు తను చిక్కి యిందట, తెల్లవార్లూ చదవడంమూలంగా! ఏమిటో వాళ్ళ ప్రేమలు.

తనువచ్చి నాలుగురోజులైంది కాని మనస్సంతా రైల్లోని సంఘటనమీదనే వుంది. ఏమిటో దిగులు తనకు ఎందుకో అర్థంకాదు. అతని ఏడుపుకి అర్థం ఏమిటి? ఇదే తనకు ఆలోచన

అమ్మ ఒకరోజు నాన్నతో అంటున్నది: “ఏమిటో! సుజాత వచ్చిందగ్గరనుండి అదోలా వుంటున్నది కారణం చెప్పదు. అయినా ఎందుకొచ్చిన కాలేజీ చదువులూ. త్వరగా ఒక మంచి సంబంధం చూడండి” అ అమ్మ పిచ్చిగాని, కాలేజీ ఏమిచేసిందనో!

నాన్న ఒకరోజు పిల్చారు “సుజా! చిన్న అల్లయ్య కూతురు పెండ్లట, వెళదాం వస్తావా” అని అడిగారు. నాన్న ప్లాను కనిపెట్టింది తను ఎవరో వరుణ్ణి చూడటానికి వుంటుంది అయినా భయం ఎందుకు తనకు? ఇష్టంలేని సంబంధం బల

వంశాన కట్టరుగదా! 'సరే వెళదాం నాన్నా!' పాపం నాన్నని ఆరోజు నిజంగానే అపార్థం చేసుకొంది...

తెల్లవారింది. రాత్రి పదిగంటలకు పెండ్లి ముహూర్తంతో ఇల్లంతా సందడిగా ఉంది తను అత్త కూతురు ఉమదగ్గర కూర్చొని చామంతిపూలు మాల కడుతున్నది. ఇంతలో సూట్ కేస్‌తో బండివాడు లోపలికొస్తూ 'అమ్మగారూ! క్రిష్ణబాబుగారొచ్చారమ్మా!' అన్నాడు. మా మేనత్త గబగబ వస్తున్నది తను అటు చూడకుండా తల వంచుకునే 'ఎవరే ఉమా!' అంది "మా పెద్దనాన్న కొడుకు అమెరికా వెళ్ళాడే, అతను" అంది తనకు కొంచెం గుర్తు. ఎప్పుడో చాల ఏళ్ళక్రితం చూసింది. ఒక సంగతిమటుకు తెలుసు. ఈ వూరులోనే ఒక అమ్మాయిని ప్రేమించి పెండ్లి చేసుకున్నాడట. ఆమె నాలుగోమాసం గర్భంతో ఉండగా అతను వెళ్ళనన్నా, అమెరికా వెళ్ళమని, వచ్చిన స్కాలర్‌షిప్ కాలదన్న వద్దనీ, బ్రతిమాలి పంపిందట. కాని అతను వెళ్ళిన ఆరుగు నెలలకే ఆమె ప్రసవించలేక చనిపోయిందట. అది విన్న అతను పిచ్చివాడిలాగ అక్కడనుండి వచ్చేసి, ఏ వుద్యోగం లేక తిరుగుతున్నాడని, యింట్లో ఉండడనీ విన్నది.

"నీకు చెల్లెలంటె ఎంతో ప్రేమ, ఎక్కడున్నా వస్తావనే అనుకుంటున్నానాయనా!" పిన్నమ్మ అంటున్నది తను తల ఎత్తి అటుచూసింది. "ఉమా! ఈయ.. నే. నా?" మాటలు పెగిలి రావటంలేదు కడుతున్న చామంతి పూలు జారిపోతున్నాయ్ తను ఎక్కడవుందో తెలియడంలేదు ఆరోజు రైలులో.. ఇతనే.. అతను తనని చూశాడు. వెంటనే కళ్ళు దించేసుకొని మొఖం ప్రక్కకి త్రిప్పుకొని "వస్తా వుంటు పిన్నీ!" అంటూ వెళిపోయాడు ఏమిటి యితని ప్రవర్తన?— పెండ్లయిన రెండు రోజులకు తనూ, నాన్న వచ్చేశారు. మళ్ళా అతను కనుపించనేలేదు. ఒకసారి కనుపిస్తే, అన్నీ అడిగేది తను. తనకి ధైర్యముందా, కలుగలేగాని. మళ్ళా చూసేభాగ్యం కలుగుతుందా? ఇదేమిటి. అతన్ని గురించి తనకింత వ్యధఎందుకు?

ఒకరోజు అమ్మ, నాన్న ఏదోవాదించుకుంటున్నారు ప్రక్కగది లోనుండి తను వింటున్నది అమ్మ 'గియ్' మంటున్నది "నా కూతుర్ని రెండవ పెండ్లివాడికివ్వను," అన్నది అమ్మ నాన్న అంటున్నారు "కాదు! చెల్లెమ్మని అడగమన్నాట. అదొచ్చి 'అన్నయ్యా! సుజాతని, వదిన్ని ఒప్పించు,' అంది అంతేగాని నేను యిస్తానని చెప్పలేదు అయినా నాకే యిష్టంలేదు" తను విన్నదా మాటలు అవును అతన్ని ఎవరు చేసుకుంటారూ! పైగా పినతల్లిద్వారా వర్తమానం అన్నమాట! ఏమిటో తనకా కళ్లు గుర్తొస్తున్నాయ్ ఏమిటి తను చేసుకోవాలని వుందా? వల్లో తెలియడంలేదు. తనకి చీకట్లు క్రమ్ముతున్నాయ్ కళ్లు.. "అమ్మా!" గట్టిగా అరచి పడిపోయింది పైగా కలవరించిందట తను. "అతన్నే చేసుకుంటానమ్మా నిజమేనమ్మా!" అని మరునాడు తల్లి నెమ్మదిగా కాఫీ అందిస్తూ, "సుజా! నీకిష్టమైతే మాకూ యిష్టమే! చెప్పు" అంది. తను ఏటూ చెప్పలేకపోతున్నది, తల్చుకుంటేనే ఏమిటో లాగ వుంది. "సరేనమ్మా!" అంది, ఎలాగో ఏదో ఒక నిర్ణయానికి వచ్చినట్లు.

పదిహేను రోజులలో ముహూర్తం వుందిట అక్క రావడం, ఎవరికీ అర్థంకాని యీ పెండ్లి అందర్నీ ఆశ్చర్యపరుస్తోంది. అయినా ఎవరూ ఏమీ అనలేకపోతున్నారు. అక్క అంది నెమ్మదిగా దగ్గర కూర్చొని, "నీకు పూర్తిగా యిష్టమేనా సుజా! నాతో చెప్పవూ" అని. తల వూపిందంతే తను —

పెండ్లయింది అత్తవారింటికి వెళుతోంది కారులో వెనకసీట్లో తనూ, అతనూ కూర్చొన్నారు తన తల నిమురుతూ "జాజులున్నాయా?" నవ్వుతూ అన్నారు. తనకు పట్టలేనంత కోపం వచ్చింది. "ఏం?" అంది

(64వ పేజీ చూడుడు)



# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది !



పిల్ ఫర్ - ప్రూఫ్ మూతతోను క్రొత్త ఎర్ర లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయబడు చున్నది.




వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్ లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవుసరమైన అదనపు శక్తిని చేకూర్చును

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.

ఇప్పుడు వాడుకలో లేని ఎర్రరాపర్

## ఆరోగ్యమునకు హితమైన

# వాటర్ బరీస్ కాంపౌండ్

వాడుడు

# రాశిఫలాలు

దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**16-3-1960 బుధవారం మొదలు**
**22-3-1960 మంగళవారం వరకు.**

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ గౌరవం, హోదా పెరగగల సమయం. ఆరంభించిన పనులు, నిరాటంకంగా సాగిపోతున్న సమయంలో కూడా మీమనస్సులో సందేహాలు మాత్రం వస్తుంటవి. చెప్పుకో తగిన ముఖ్యమైన మార్పులు రాతగిన సూచన లున్నవి. మానసికంగాను, శారీరకంగాను శ్రమమాత్రం కనుపిస్తుంటుంది. ప్రయాణాలు చేయవలసిన సూచనలు కనుపిస్తవి. కాని, కారణాంతరాలవల్ల నిలుపుకోవలసి వస్తుంది. పిల్లల ఆరోగ్యాన్ని గురించిన ఆందోళనవల్ల మీ నిత్యకృత్య కార్యకలాపాలు సక్రమంగా సాగకపోవచ్చు. ధనసంబంధమైన ఆందోళన క్రమక్రమంగా తొలగిపోతుంది. బంధుమిత్రులవల్ల ఖర్చులు పెరగగలవు. మిమ్మల్ని గురించి, మీ ఆప్తమిత్రులను గురించి రహస్యాలను చల్లగా బయటకు లాగటానికి ప్రయత్నించే పెద్దమనుష్యులను గురించి జాగ్రత్తగా ఉండండి. 18, 19 లలో కారణంలేని విచారం, పొరపాట్లు చేయుటం, అవకాశాన్ని వదులుకోవటం.

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా)

ప్రస్తుతం మీ అనుభవంవల్ల ఎవరికి ఎంత ఉపకారంచేసినా చివరకు నిష్ఠూరాలు మాత్రం తప్పవనే విషయం తెలుస్తుంది. మీరు సలక్షణంగా ఉంటే చూచి ఓర్వలేని పెద్ద మనుష్యులు పైకి మంచి సలహా చెప్పినట్లు నటిస్తూ సాహస కార్యాలకు దింపటానికి ప్రయత్నిస్తారు. సాధ్యమైనంతవరకు ఉద్రేకాన్ని అణగించుకుని ప్రవర్తించటం అవసరం. మీ వృత్తిలో ఉన్నతమైనమార్పు వచ్చే సూచనలున్నవి. ఆదాయం కూడా సంతృప్తికరంగా ఉంటుంది. ఇంతకుముందు మిమ్మల్ని విరోధభావంతో చూస్తున్న ఒకరిద్దరు మిత్రులు మీకు అన్ని విధాలా సహాయం చేస్తారు. కుటుంబంలోకూడా సుఖము, శాంతి లభిస్తవి. ముందుముందు జరుగతగు కార్యక్రమాలను గురించిన నిర్ణయాలు ఈ సమయంలో పూర్తి అవుతవి. వారాంతంలో మీ ఆరోగ్యం లోపించే అవకాశాలున్నవి. పుణ్యకార్యాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది. ఇంతకు ముందుకన్నా అన్ని విధాలా ప్రశాంతత లభించగల అవకాశాలున్నవి. 21, 22 తేదీలలో ఆందోళనకరమైన వార్తలు, దుబారా ఖర్చులు, అనారోగ్య సూచనలు.

**మిథునం:**

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం మీరు ఎంత జాగ్రత్తగాఉందామనుకున్నా పరిస్థితులు మిమ్మల్ని ప్రశాంతంగా ఉండనీయవు [illegible]పుగా కలహాలు రాగల సూచనలున్నవి. ధనసంబంధమైన లావాదేవీలు తగ్గించుకోవటం మంచిది. తిప్పట, శరీరశ్రమ వీటితో కూడిన కార్యక్రమాలు విశేషంగా ఉంటవి. మిమ్మల్ని గౌరవిస్తూ మీవల్ల పనులు సాధించుకునే మిత్రులు తటస్థపడతారు. వృత్తి వ్యాపారాలలో శ్రమమాత్రం ఉంటుంది.

> **గ్రహస్థితి**
>
> కన్యలో రాహువు; ధనుస్సులో గురు-శనులు; మకరంలో అంగారకుడు, కుంభంలో బుధ శుక్రుడు; మీనంలో సూర్య-కేతువులు; తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు

కాని అనుకున్న ప్రకారం సకాలంలో పనులు నెరవేరుతవి. ఫలితంకూడా బాగుంటుంది. కోర్టు కచేరీలలో అనుకూలత కలుగుతుంది. ఇంతకుముందు ఇతరులకు చెప్పిన మాటను కాపాడుకోవటానికి ఈసమయంలో శ్రమపడవలసి వస్తుంది. కుటుంబంలోని వారితో స్వల్ప విషయాలలో అభిప్రాయ భేదాలు రాగల సూచనలున్నవి. విలాస వినోదాలకై విశేషంగా ఖర్చులు, బంధుమిత్రుల ఇండ్లకు ప్రయాణం చేయవలసి రావచ్చు. విలువగల వస్తువులకు ఈ సమయాలలో మోసం జరుగకుండా చూచుకోండి. 16, 17 లలో శుభకార్య ప్రయత్నాలు, ధన లాభం, అధికారులవల్ల అనుకూలత.

**కర్కాటకం**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఒక సమయంలో ఉన్న అభిప్రాయం మరొక సమయంలో నిలవదు. ఆందోళన అధికం. ఎవరు మంచివారో ఎవరు చెడ్డవారో నిర్ణయించుకోలేకపోతారు. ఇతరుల వద్దనుంచి రావలసిన పైకం ఎప్పటికప్పుడు వచ్చేటట్లు తోస్తూ ఉంటుంది కాని కాలం మాత్రం గడిచిపోతుంది. ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవలసి వస్తుంది. అంగువల చిక్కులు ఉండవు కాని మీ స్వంతపనులకు ఆటంకం కలుగుతుంది. విలువగల వస్తువులు కొంటారు. కుటుంబంలో శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. క్రొత్త మార్గాలలో ధనాదాయం లభించగల అవకాశాలున్నవి. పుణ్యకథా కాలక్షేపాలు మొదలయినవాటియందు ఆసక్తి వుంటుంది కాని అవకాశం దొరకకపోవచ్చు. దూరమందున్న బంధుమిత్రులవద్దనుంచి వచ్చేవార్తలు తాత్కాలికంగా ఉత్సాహాన్ని కలిగించజాలవు. వారాంతంలో మీ ఆరోగ్యం లోపించగల అవకాశాలున్నవి. 16, 17 లలో వృత్తిలో అభివృద్ధి, వ్యవహార విజయం, సంఘంలో గౌరవం.

**సింహం**

(మఘ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

భగవంతుని దయవల్ల ఈ సమయంలో మీరు ప్రయత్నించిన ప్రతిపని సులభంగా నెరవేరుతుంది. మీరు చెప్పినమాటను పదిమంది విశ్వసించి [illegible]కుంటారు. ధన విషయంలో చిక్కులు తొలగిపోయి మీ కార్యక్రమాలకు ఒకమార్గం అనేది లభిస్తుంది. మీ స్వంతవృత్తికి సంబంధించిన పనులు ముందుగా నిర్ణయించుకున్న ప్రకారం సకాలంలో నెరవేర్చుకోగలుగుతారు. సంఘకార్యాలలో పాల్గొనవలసి వస్తుంది. మిమ్మల్ని ఇబ్బంది పెట్టటానికి ప్రయత్నించిన శత్రువులు అకస్మాత్తుగా తామే చిక్కులలో పడటం జరుగుతుంది. పుణ్యక్షేత్రాలు మొదలయినవి చూచిరాగల అవకాశాలు వున్నవి. విశేషధనం పెట్టుబడితో చేయతగు కార్యకలాపాలు అనుకూలంగా జరుగుతవి. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. ప్రయాణాలు చేయవలయునని అనుకుంటారు కాని ప్రస్తుతానికి నిలుపుకోవలసి వస్తుంది. అధికారులవల్ల జరుగవలసిన పనులు నిదానముగా అనుకూలిస్తవి. 20, 21 లలో సంతోషవార్తలు, సంతానంవల్ల సుఖము, శాంతి లభిస్తవి.

**కన్య.**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

మంచి చెప్పబోయినా నిష్ఠూరాలు ఎదురుగు రాగల సమయం, మీరు ఎవరిని నమ్మి ధైర్యంతో ఉంటారో వారే ఈసమయంలో మిమ్మల్ని ఎదిరించి చిక్కులలో [illegible]చటానికి ప్రయత్నిస్తారు. కుటుంబంలో ఖర్చులు విశేషం. క్రొత్త మనుష్యులతో పరిచయం లభిస్తుంది కాని చెప్పుకోతగినంతగా సహాయం లభిస్తుందని అనుకోవద్దు. ప్రస్తుతం మీరు ఏ పనిచేసినా సులభంగా జరుగుతుందనుకొని ప్రయత్నిస్తే మధ్యలో ఇబ్బంది పడవలసి వస్తుంది. ఏవో విబ్బరము

ప్రత్యేక **త్రిగుణ చర్యతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్ టూత్ పేస్టు**

1

చాలా బాగుగా
* శుభ్రపరచును!

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'లైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే—మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.

2

చాలా బాగుగా
* తెలుపుజేయును!

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును—అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.

మెక్లీన్స

3

*
బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంత మైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

MTV-48

నిదానము అవసరం. నీచులతో కలహాలు రాగల అవకాశాలున్నవి ధన సంబంధమైన ఇబ్బంది ఇంతకుముందు కన్నా క్రమంగా తగ్గే అవకాశాలున్నవి కుటుంబంలోని వారి ఆరోగ్యం, మీ ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కీర్తి ప్రతిష్ఠల నిమిత్తం కార్యభారం పైన పెట్టుకొన తగిన సమయం కాదు. వారాంతంలో లాభకరమైన వార్తలు తెలియగలవు, పుణ్యకార్యాలకై ఖర్చులు, మీకు ఇష్టంలేని పనులలో ప్రవేశించవలసిన అవసరం కలగవచ్చు 16, 17 లలో ధనలాభం వ్యవహార అనుకూలత కార్యసిద్ధి.

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

తలపెట్టిన పని జరుగదేమోననే సందేహానికి అవకాశం కనుపించదు. అయితే నెరవేరదు. ఆదాయం ఎంత వచ్చినా ఎప్పటికప్పుడు హరించుకునిపోతూ ఉంటుంది. శాస్త్రవిషయాలలో గౌరవము, పలుకుబడి పెరిగినట్లు కనుపించినా సమయంలో సహాయం చేయతగిన మిత్రులు ముఖం తప్పిస్తారు చిన్న చిన్న ప్రయాణాలు చేయవలసివస్తుంది. బంధుమిత్రులవల్ల నిష్ఠూరాలనూ, హేళనలనూ భరించుకోవలసిన సమయం. ప్రస్తుతం మీ ప్రయత్నాలు కార్యరూపం పొందటానికి కొంతకాలం పట్టవచ్చు మీవల్ల ఉపకారం పొంది మిమ్ములను గౌరవంగా చూచేవారే మిమ్ములను ఆదరించలేకపోతారు. పైపెచ్చు మీవద్దనుంచి సహాయం ఎగురు చూచే మనుష్యులుంటారు. ప్రతి చిన్న పని శ్రమతరంగా తోస్తుంది. మీరు ప్రశాంతంగా ఉందామని ఎంత ప్రయత్నించినా కలహాలకు దిగవలసివస్తుంది. మనస్సులో ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండటంవల్ల మీ ఆరోగ్యం చెడే అవకాశాలున్నవి ఇతరుల సలహాను నమ్మి ధనవ్యయంతో కూడిన పనులకు దిగవద్దు. వాహనాలు ఎక్కటం, యంత్రాలు ఉపయోగించటం మొదలయిన సందర్భాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం. 16, 17 లలో సన్మానం, వృత్తిలో అభివృద్ధి.

**వృశ్చికం:**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

గ్రహస్థితి అనుకూలంగా ఉన్న సమయం. వృత్తివ్యాపారాలలో మీ సమర్థతవల్ల విశేషమైన ఫలితాన్ని పొందగలుగుతారు. పోటీవారు ఎంత ప్రయత్నించినా సాధించలేక విరమించుకున్న పనులు మీరు సునాయాసంగా నెరవేర్చగలుగుతారు అధికారులవల్ల గౌరవము, ఆదరణ లభిస్తవి శుభవార్తలు, తెలుసవి, ఆదాయం మామూలుగా ఉంటుంది పిల్లల ఆరోగ్యంలో కొద్ది మార్పు వస్తుంది కాని వెంటనే స్వస్థతకలుగుతుంది. ఇతరుల ప్రసంగాలు మీ మనస్సుకు కొంత ఆందోళనను కలిగించే అవకాశాలున్నవి అంతమాత్రంచేత నిరుత్సాహ పడవద్దు సహాయం చేస్తామని చెప్పినవారు సమయంలో చేయలేకపోతారు మీ ముఖ్య కార్యకలాపాలలో పొరపాట్లు రాకుండా చూచుకోవటం అవసరం. కుటుంబంలో సుఖము శాంతి లభిస్తవి. 18, 19 లలో గొప్పవారితో పరిచయం, లోగడ చేసిన శ్రమకు ఫలితం లభిస్తుంది.

**ధనుస్సు :**

(మూల పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా. 1)

మీ యోచనాశక్తి అమోఘంగా పనిచేసే సమయం. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. అయితే తాత్కాలికంగా విశేషంగా ఫలితం కనుపించకపోవచ్చు. ఎంత కఠినమైన వ్యక్తులను కూడా మీరు సులభంగా మంచి మార్గానికి త్రిప్పగలుగుతారు. కోర్టుకచేరీలలో అనుకూలమైన సమయం. కుటుంబంలో ఇంతకు ముందు ఉన్నటువంటి మనస్పర్థలు క్రమక్రమంగా తగ్గిపోయి సుఖం లభిస్తుంది. ఈ సమయంలో మీరు ఖర్చుచేసే ప్రతి పైసా ముందు ముందు మీకు ఎంతో విశేషంగా ఉపయోగిస్తుంది. ఆడంబరం పెరుగుతుంది. వస్త్రాలు, ఆభరణాలు మొదలయిన విలువగల వస్తువులుకొనే అవకాశాలున్నవి పుణ్యకార్యాలు తలపెడితే ఆటంకాలు రాగల సూచనలున్నవి. ఉన్నతస్థితియందున్న స్నేహితుల సహాయం బాగా లభిస్తుంది. వారాంతంలో ముఖ్యమైన కాగితాలుగాని, వస్తువులుగాని దొంగతనంగాపోయే అవకాశాలున్నవి. నీచులతో కలహాలు వస్తవి. 18, 19 లలో వృథాశ్రమ. ఉత్తర దిక్కునుంచి శుభవార్తలు.

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీ మనస్సులోని కోరికలు చాలావరకు ఈ వారంలో నెరవేరగల అవకాశాలున్నవి బుద్ధిబలంతో అన్ని పనులు సాధించగలుగుతారు. మీకు వ్యతిరేకంగా పనిచేస్తున్నటువంటివారు ప్రస్తుతం మీ సహాయం కోరవలసిన అవసరం కలుగుతుంది. తలపెట్టిన ప్రయాణాలు నిరాటంకంగా సాగుతవి. స్వల్పవిషయాలలో ఆరంభమైన పట్టుదలలు క్రమక్రమంగా ముదిరే అవకాశాలున్నవి. అందువల్ల కష్టనష్టాలు ఏమీ ఉండకపోయినా మానసికంగా అశాంతి కలుగుతుంది కోర్టుకచేరీలలో విజయం లభిస్తుంది వృత్తివ్యాపారాలలో అభివృద్ధికరమైన కాలం పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి కొన్ని సందర్భాలలో ఫలితం ఎగురు చూడకుండా గౌరవం నిమిత్తం కార్యభారం పైన వేసుకోవలసిన అవసరం కలుగుతుంది. ధనం అప్పు ఈయటం పుచ్చుకోవటం వంటి పనులలో ముందు ముందు చిక్కులు రాకుండా జాగ్రత్తపడటం అవసరం 20, 21 లలో కుటుంబంలోని వారికి అనారోగ్యం. కష్టవార్తలు, విశేషశ్రమవల్ల కార్యసిద్ధి.

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా)

పైకి మిమ్ములను అందరూ స్తోత్రం చేస్తూ ఉంటారు మీకు ఉపకారం చేస్తున్నట్లు కూడా నటిస్తారు సమయంచూచి మీవల్ల తమ పని నెరవేర్చుకొనటానికి ప్రయత్నిస్తారు వృత్తివ్యాపారాలలో ఇతరులతో పోటీ, శ్రమ ఉంటవి. అయితే నష్టకష్టాలు ఉండవు. కాని మీరు అనుకున్నంత ప్రయోజనం మాత్రం పొందలేకపోతారు మొత్తం మీద ఈవారం కొంత శ్రమపడి ముందుకు పోగలుగుతారు మీకు మీ బంధువులకు మధ్య మనస్పర్థలు రాగలవు. ఈసమయంలో మీరు ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకుండా ఉండటం మంచిది. దూరప్రయాణాలు చేయవలసి వస్తుంది. అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. ఈ సమయంలో ఎంతధనం వచ్చినా ఖర్చులు విపరీతంగా పెరగటంవల్ల ఎప్పటికప్పుడు శ్రమగానే కనిపిస్తుంది కొత్తమార్గాలలో ధనాదాయం నిమిత్తం ప్రయత్నిస్తారు. కాని వెంటనే అనుకూలించే సూచనలులేవు. 16, 17 లలో కలహప్రసంగాలు, అకస్మాద్ధన లాభం, ధర్మకార్యాలు.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి)

స్నేహితుల ప్రోత్సాహం లభించేవరకు ఏ పనిలోను ప్రవేశించలేకపోతారు. శక్తిసామర్థ్యాలు, అవకాశాలు అన్నీ ఉండికూడా సందేహాలు మిమ్ములను వెనుకకు లాగుతూ ఉండటంవల్ల ప్రతిది అసాధ్యంగా తోస్తుంది కుటుంబంలో అనుకూలమైన సమయం. శుభ పుణ్యకార్యాలు జరుగుతవి. విలాసవస్తువులు కొంటారు. తలవని తలంపుగా బంధుమిత్రుల ఇండ్లకు ప్రయాణం చేయవలసివస్తుంది మీ ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండటం అవసరం సంతానం మూలంగా సుఖ సంతోషాలు లభిస్తవి. వారాంతంలో సాటివారితో కలహాలు రాగల అవకాశాలున్నవి. ఇతరుల వ్యవహారాలలో మధ్యవర్తిత్వం వహిస్తారు. మనస్సులో కారణంలేని విచారము, ఆందోళన ఆరంభం అవుతుంది విశేష ధనవ్యయంతో జరుగవలసినపనులు నెరవేరుతవి ఫలితం కూడా సంతృప్తికరంగా ఉంటుంది. 16, 17, లలో పిల్లలకు అనారోగ్యం, విశేష కార్యభారం. బంధువులవల్ల నిష్ఠూరాలు

★

# ★ హరివంశము ★

(24-వ పేజీ తరువాయి)

శైశిరాయణులు తిరిగివచ్చి, ఆ పిల్లవానిని శిక్షించడానికి పూనుకున్నారు

నందుడు: ఈ కథలన్నీ విచిత్రంగావున్నాయి కాని ఒక్కటి నిజం గోపాలి ఒక పిల్లవానిని ప్రసవించింది. ఆతర్వాత ఏమైంది? శైశిరాయణులు గోపాలిని వరించివుండగా, అది వారిని వదలివుండలేదు కనుక చనిపోయింది. శైశిరాయణులు ఆపిల్లవానిని యవనేశ్వరునకు ఇచ్చి, శిక్షిస్తున్నారా—అనుకున్నాడు. శ్రేష్ఠులతో "శ్రేష్ఠులు! ఆ కుఱ్ఱవాణ్ణి మీరు ఎప్పుడన్నా చూచారా?" అన్నాడు

శ్రేష్ఠి చూడలేదు కాని విన్నాము. ఆ పిల్లవాడు ఈ యవనేశ్వరులకు దొరికినప్పుడు కృష్ణపూర్వార్ధ కాయుడై వున్నాడట. తర్వాత శైశిరాయణులు తమ తపశ్శక్తిచేత ఆ అవరూపాన్ని పరిహరించి, నిండుమనిషిని చేసినారట. అంతేకాదు. ఆ కుఱ్ఱవాడు అగ్నిసన్నిభమయిన దేహవర్ణం కలవాడట. యవనులలో నల్లగా వుండే వారు ఎవ్వరూ లేరు ఈ కుఱ్ఱవాడు మాత్రం నల్లగా వున్నాడని చెప్పుకోగా విన్నాము. అమిత బలశాలి అని, అమిత తేజస్వి అని, అమిత ఉద్ధతుడని గూడా విన్నాము

నందుడు మీ మాటలు నిజమే కావచ్చు కాని మీ శైశిరాయణులు మేము అనుకున్న శైశిరాయణులు కాకపోవచ్చు మా గోపాలి అప్సరసవంటి పిల్ల. శైశిరాయణులు తెల్లని మనిషి. వారికి నల్లని నిగవు కల్గడమే వుండదు. గోపాలిని వలచి శైశిరాయణులు, శైశిరాయణుని వలచి గోపాలి వుండరు. మనుష్యులను పోలిన మనుష్యులు వుండవచ్చునని ఇందువలన తేలుతున్నది.

నందుడు పైకి ఈ మాటలు అన్నాడేగాని లోపల అతని మనస్సు దుఃఖంతో దహించుకుపోతున్నది గోపాలి ఇక లేదు అన్న యథార్థం ఆయన అంతఃకరణలో నిరూఢమైపోయింది. బరువు గుండెతో నందుడు శ్రేష్ఠులతో "మేము పోయివస్తాము" అని బయలుదేరాడు గోపకులు గూడా ఆయనతో పాటు లేచారు. ఎవ్వరూ మాట్లాడుకోలేదు అడవులమీద నుండి వస్తున్న గాలులు లేపిన చిరుతరంగాలతో మర్మర ధ్వనులు చేస్తూ, యమున తన మిత్రురాలి మరణవార్త విని దుఃఖిస్తున్నట్లు ప్రవహిస్తున్నది పిల్లకొమ్మల సందుగా, ఆకుల సందుగా, ఈలలు వేస్తూ దూసుకుపోతున్న గాలుల చప్పుడుగూడా, అప్పుడు సన్నగా, దుఃఖంగా యమున చక్క-ప్రకృతి గోపాలికోసం లో గొంతుకలో విలపిస్తున్నట్లు తలపింపచేస్తూ వుండంగా వినింది ఆకాశంమీద చంద్రుణ్ణి, ఒక నల్లని మబ్బు క్రమ్ముకొని, అంతవరకు శుచిగావున్న చంద్రుణ్ణి అశౌచంపాలు చేసింది

అప్పటికే చాలా ప్రొద్దుపోయింది ఇంటికి రాగా యశోద నిద్రపోలేదు. రోహిణి నిద్రపోలేదు పిల్లలు ఏవో అల్లరులు చేస్తున్నారు ఆ తల్లులు ఆనందిస్తున్నారు. "రోహిణీ అమ్మగారు! ఇంకా మేలుకొనే ఉన్నారా?" అన్నాడు నందుడు

రోహిణి—అవును నందయ్యా! పిల్లలమాటలు వింటూ కూర్చున్నాము.

నందుడు—ఏమి మాటలు?

రోహిణి—"నువ్వు చెప్పవే యశోదా!" అని ఫక్కున నవ్వింది

యశోద—మన కిష్టయ్య లేడూ-వాడు వేణువు ఊదేటప్పుడు ఈ వ్రేపల్లెలోని పశువులంతా వాడికోసం పరుగు పెట్టుకు వస్తాయట! వచ్చి "ఓ! కృష్ణా! నువ్వే మా నాథుడివి నువ్వే మా బంధువు నిన్ను వదలి మేము వుండలేము దాస్యము లిచ్చి మమ్మల్ని నువ్వు రక్షించక తప్పదు'—అంటాయట చూడండి! రోహిణి అమ్మగారు! మీరు వాణ్ణి రెచ్చగొడుతున్నారు లేకపోతే—ఛీ! ఏమి పిల్లవాడు! ఏమి మాటలు.

అని ఎరగబడి నవ్వింది కృష్ణుణ్ణి దగ్గరగా తీసుకొని, చుంచు ముట్టి, చుబుకం ఎత్తి, అతని ముఖంవంక చూచి, అక్కున చేర్చుకొని, శిరస్సును చుంబించింది నందుడు అర చిరునవ్వు నవ్వుతూ—"అట్లాగా! తండ్రీ!" అన్నాడు. ప్రక్కగా మంచంమీద కూర్చున్నాడు.

"రోహిణీ అమ్మగారు"

"నందా!"

"మన గోపాలి చనిపోయింది."

"ఎవరు చెప్పారు?"

"శ్రేష్ఠులవలన తెలుసుకున్నాను"

అంతా కొంతసేపు గోపాలిని గూర్చి చెప్పుకొని విచారించారు. ఇంతలో పిల్లలు నిద్రపోయారు.

"రోహిణి అమ్మగారు"

"ఏమి! గోపయ్యా!"

"గోపాలికి ఒక కొడుకు పుట్టినాడు"

"నల్లనివాడేనా?"

"ఆ! నల్లనివాడే, వాణ్ణి యవనేశ్వరుడు పెంచుకున్నాడు. వాడే ముందు యవనేశ్వరుడు

"అవును గోపాలికి కృష్ణునివంటి నల్లని వానిని పుత్రుణ్ణిగా పొందాలనే కోర్కె దానికి తెలియకుండానే, దానిలో పెరిగింది. దాని జన్మసార్థకమైంది"

"అవును! అమ్మగారు! అది కాలయవనుణ్ణి కన్నది"

అంతలో ఉత్తరపు దిక్కున ఒక కారుమేఘం మెరిసింది పెద్దగా ఉరిమింది ఒకటి రెండు చినుకుజల్లులు గూడా పడ్డాయి. "వర్షాకాలం వచ్చినట్లే! అమ్మగారు!" అన్నాడు నందుడు. ★

అక్బరుకు అత్యంత ప్రియమైన వారిలో ఆస్థాన విదూషకుడు వీరబలు డొకడు. అతను మహారాజును తన చిలిపిచేష్టలతో నవ్వించి ఆయన అభిమానం బాగా సంపాదించుకొన్నాడు. అందుకనే అంగరికన్నా వీరబలుడికి అక్బరుపాదుషా దగ్గర చనువు చాలా ఎక్కువ.

మహారాజులకు, పాదుషాలకు అనుగ్రహం వచ్చినా, ఆగ్రహం వచ్చినా తట్టుకొనడం కష్టం. కొన్ని సమయాలలో వీరబలుడి చిలిపితనం మితిమీరినప్పుడు అక్బరుకు వీరబలుడిమీద ఆగ్రహంవచ్చి ఏదో చిక్కులో పడవేసేవాడు. వీరబలుడు నేర్పుగా ఆ చిక్కునుండి తప్పించుకొనేవాడు.

ఒకనాడు అక్బరుపాదుషా వీరబలుడిమీద కోపంతో "అంధుడా" అని గర్జించాడు. పాదుషాకు కోపం వచ్చిందని గ్రహించి వీరబలుడు వెంటనే ఇట్లా అన్నాడు. "హుజూర్, నేను అంధుణ్ణని అన్నారుగదా. గ్రుడ్డివాళ్లు మూడు రకాలు. అందులో నేను ఏ రకం గ్రుడ్డివాణ్ణని అనుకుంటున్నారు" అని ప్రశ్నించాడు. పాదుషా కోపంనుండి ఆలోచనలోపడి, కొంత సేపటికి "ఆ మూడు రకాల గ్రుడ్డివాళ్లెవరో నాకు తెలియదు. వారిని రేపు నా సభలో ప్రవేశపెట్టు" అని ఆజ్ఞాపించాడు. 'చిత్తం' అని వీరబలుడు వెళ్ళిపోయాడు.

రాజాస్థానంనుండి వీరబలుడు సరాసరి ఒక ధనికుడి గృహానికి వెళ్లాడు. ఆ ధనికుడు పెద్ద వ్యాపారి. వీరబలుడు ఆయన దగ్గరకు వెళ్ళి, "ప్రస్తుతం నేను చాలా కష్టాలలో ఉన్నాను. నాకు కొంత ధన సహాయం చేయాలి" అని అడిగాడు.

భోగాది రామకృష్ణ

ఆ ధనికుడు పరమలోభి. వీరబలుడికి డబ్బుయిస్తే, వడ్డీయివ్వడు సరికదా అసలు డబ్బే యివ్వకుండా ఎగగొడతాడేమోనని భయపడి, "నాదగ్గర చిల్లిగవ్వ లేదు. అంతా వ్యాపారంలో ఉన్నది" అన్నాడు. వీరబలుడు యింకేమీ మాట్లాడకుండ వెళ్లిపోయాడు.

ధనికుడి యింటినుండి వీరబలుడు నాలుగురోడ్లు కలిసే ఒక కూడలి దగ్గరకు వెళ్ళి, నేలమీద ఒకచోట మట్టి అంతా చదునుచేసి, చూపుడువేలితో ఏవో గీతలు గీయసాగాడు.




ఆదోవన పోతున్న రాజభటుడు అది చూచి, "ఏమిటన్నగారూ, వ్రాస్తున్నారు" అని ప్రశ్నించాడు. వీరబలుడతను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా, అతని పేరూ, చిరునామా తెలిసికొని యింటికి వెళ్ళిపోయాడు.

మరునాడు రాజాజ్ఞ తీసుకొని, ధనికుడినీ, రాజభటుడిని, ఒక కళ్లు లేనివాడిని తీసుకొని రాజసభకు వెళ్లాడు. మహారాజు "ఆ మూడు రకాల గ్రుడ్డివాళ్లెక్కడ" అని అడిగాడు. వీరబలుడు ఈ ముగ్గురినీ చూపించాడు. "వీళ్లు గ్రుడ్డివాళ్లెట్లా అవుతారు?" అని పాదుషా అడిగాడు. వీరబలుడు ఇట్లా చెప్పాడు.

"హుజూర్, ఈ ధనికుడు డబ్బుమూలంగా గ్రుడ్డివాడు. ధనం యితన్ని గ్రుడ్డివాణ్ణే చేసింది. అందువలన నేను డబ్బు సహాయంచేయుమని కోరితే లేదన్నాడు. ఈ రాజభటుడు నేను బాటమీద వ్రాసేది చూడగలిగి కూడా అదేమిటని అడిగాడు. ఇతను కళ్లుండి గ్రుడ్డివాడుగా ప్రవర్తించాడు. ఈ మూడవ వ్యక్తి కళ్లు లేనందువలన గ్రుడ్డివాడు. ముగ్గురు మూడురకాలకు చెందిన గ్రుడ్డివాళ్లు" అన్నాడు.

మహారాజు దానితో చాలా ఆశ్చర్యపడి, వెంటనే తమ అనుగ్రహాన్ని డబ్బురూపంలో పంచిపెట్టాడు. వీరబలుడు ఆగ్రహానికి మహారాజు అనుగ్రహాన్ని అందుకుని వెళ్ళిపోయాడు. ★




(గతసంచిక తరువాయి)

**6**

రాత్రి గడచి పోయి మర్రోజు మొదలైంది. కాని రాబిన్ హుడ్ ఏదో బద్ధకంగా, నీరసంగా కనిపించాడు. పొద్దున్నే ఎండ వెచ్చగా చురుగ్గా ఉంది. మధ్యమధ్య చల్లగాలి వాగలు హాయిగా తాకిపోతున్నాయి మంచి ఉల్లాసంగావుంది. రాబిన్ జట్టు అందరికీ ఏదో సాహసంలో దిగాలని ఉంది. నిషేపరాయుళ్ళందరికీ మాంచి ఘనకార్యం ఏదైనా చేయాలని ఉంది. రాబిన్ మనస్సులో ఏముందో ఎవరికీ తెలియదు!

ఇహ యీ బద్ధకం భరించలేక పోయాడు లిటిల్ జాన్. ఫ్రయర్ టక్ చెవిలో ఏదో ఊదాడు. అతను పరాపరి రాబిన్ హుడ్ దగ్గరకు వెళ్ళి "మిత్రమా ఇటుచూడు' అన్నాడు. రాబిన్ నీరసంగా ఫ్రయర్ టక్ వైపు చూశాడు. "ఇంతకూ ఏమి టదోలా చాలా డీలాగా ఉన్నావ్-హుషార్ చెయ్యవ్-ఉషార్ మంటావ్ —ఏమిటి కథ?" అని అడిగాడు ఫ్రయర్.

రాబిన్ ఏమీ సమాధానం చెప్పలేదు. మళ్ళీ అందుకున్నాడు ఫ్రయర్ టక్. 'అలా ఉలక్కుండా పలక్కుండా ఉరకే బాగోదు. చూశాం. మేం అంతా ఇక్కడినిన్ను కనిపెట్టుకు కూచున్నదెందుకు? మాట మర్మం మన్లోమనం చెప్పకపోతే ఎలా? అలా చెప్పకపోతే మనిషికీ...మానుకీ తేడా లేదు మన మనుష్యాం." అని హితం చెప్పాడు ఫ్రయర్ టక్.

ఈ మాటలకు రాబిన్ అదోలా కొంచెం నవ్వాడు. "మరేం లేదులే ఫ్రయర్. ఏదో బద్ధకంగా బరువుగా ఉందంతే— ఈ మాత్రానికే చాలా



శ్రమపడ్డావు" అంటూ మెల్లిగా లేచి వెళ్ళబోయాడు. కాని ఫ్రయర్ టక్ అతన్ని ఆపి-ఏమిటి నీకున్న దిగులు? నిన్నటికి నిన్న పరగణా కంతటికీ బాణం పట్టడం, కొట్టడం నేర్చిన వీరుడివి, విజేతవి నీకేమిటీ దిగాలు" మళ్ళీ అడిగాడు ఫ్రయర్.

'పరగణా అంతా నీకు జోహార్ అంటోందినాయకా— మోసాన్ని మోసంతో జయించామని సంతోషించక సంబరం చేయక ఎందుకా బెట్టు? ఏమిటసలు గుట్టు?' లిటిల్ జాన్ కూడా ఓ మాట అనేశాడు.

ఈ గొడవలో వెనకాల నించి తొంగి చూస్తున్న ఓ నిషేపరాయుడు బుడబుడా ముందుకొచ్చి "అది కాదు...మర్మరే...నిన్న పరగణా బాణాలపోటీ కాడ ఓ అమ్మాయిని చూసిన కాణ్ణించీ దొర... దొర..." అంటూ టక్కు కుటక్కలికి నీళ్లు నమిలాడు.

'ఛీ...పో దున్నపోతా వెధవ కుంకా నువ్వూనూ— ఆ మొహం చూడు' అని గదమాయించాడు లిటిల్ జాన్ నిషేపరాయుణ్ణి!

వాడు పిట్టలా పారిపోయాడు. కాని వాడు చెప్పింది తప్పు కాదని, అలా చెప్పడం తప్పనీ లిటిల్ జాన్, ఫ్రయర్,—యిద్దరికీ తెలుసు

"నా విచారం ఒక్కటే జాన్- ఈ బంగారు బాణం గెల్చుకున్నామనే ఆనందం నాకు లేదు. అయినా ఎందుకు ఆనందపడాలి? గుండెబలం కండబలం ఉండికూడా దొంగ చాటుగా గెల్చుకున్నందుకు సిగ్గు పడాలి. రాత్రినించీ నాకు అదే చింత. దాంతో గెల్చుకున్న సంబరం కాస్తా చట్టుబండలైపోయింది-" అన్నాడు రాబిన్ హుడ్ బాధగా. అందుకు ఒకసారి నవ్వాడు లిటిల్ జాన్. అతను నవ్వినందుకు కోపంగా చూశాడు ఫ్రయర్ టక్.

"అయినా మనం ముందు అనుకున్నట్టుగా గుట్టుగా పనిసాధించాం. మోసానికి మోసం అంతే. అందుకు సిగ్గెందుకు" అన్నాడు ఫ్రయర్.

'చూడు-రాబిన్ పిరికిపంద అనీ, పోటీకి సూటిగా రాలేకపోయాడనీ షెరీఫ్ అనుకుంటే అంతకన్నా నామర్దా ఏమైనా ఉందా? ఇంత బతుకూ బతికి పిరికివనిపించుకో మంటావా ఫ్రయర్' చాలాబాధగానే రాబిన్‌హుడ్ మళ్ళీ అడిగాడు.

"అదా సంగతి. అయితే ఓపని చేద్దాం. మన షెరీఫ్‌భాయీకి ఓ ఉత్తరం రాద్దాం పట్టు. బాణం కొట్టింది మనమనీ, షెర్‌వుడ్ పులి పొంచే ఉన్నదనీ జాగ్రత్త అనీ రాద్దాం. దాంతో అబ్బాయిగారి గుండెల్లో అగ్గిపిడుగు పడుతుంది. వీరుడైతే ఎత్తుకు పైఎత్తు వేశారని సంతోషిస్తాడు- లేపోతే అందుకే హోర్మని ఏడుస్తాడు. పనైపోతుంది." సలహా చెప్పాడు లిటిల్ జాన్ హుషార్‌గా. ఈ సలహాతో నిజంగా హుషార్ పుట్టింది రాబిన్‌హుడ్‌కి!

'ఇదే మంచిమాట.' అన్నాడు రాబిన్. 'ఆపని చేస్తే సరి. అటు షెరీఫ్‌కి తెలుస్తుంది. ఇటు మనకీ తెలిసుంటుంది. మరయితే రాసిన ఉత్తరం షెరీఫ్‌కు చేరడం ఎలా? అతని చేతి కందినట్లు మనకు దాఖలా?' ఫ్రయర్ టక్ చటుక్కన తన సందేహం బయట పెట్టాడు.

రాబిన్, లిటిల్‌జాన్ యిద్దరూ క్షణం మాట్లాడలేదు.

కాస్సేపు ఆగి 'సరే ఆవిషయం నాకు వదిలెయ్యండి' అన్నాడు లిటిల్ జాన్.

"నాను దొరా-నేను నీపాటిగా సూటిగా కొట్టకపోయినా పట్టగలన్లే బాణం. మనం రాసిన ఉత్తరం అంబుకుచుట్టి తాడుతో కట్టి షెరీఫ్ భోజనాలగది కిటికీ కటకటాల్లోంచి ఫటాల్‌మని కొడతా... వేళచూసి,



ఆ సీట్ రిజర్వు అయింది.

చిత్రం: బి సంజీవరావు, హుజూరాబాద్.

షెరీఫ్ మస్తుగా తింటున్నప్పుడు గనక బాణం కొట్టానా దెబ్బకు అదిరిపడి జాబుచదివి జబ్బుపడతాడు పాపం. షెర్‌వుడ్ పులి అంటే పిల్లి కాదనీ, డొక్కలో బల్లెమనీ తెలుసుకుంటాడు" అన్నాడు లిటిల్‌జాన్.

'భలే జాన్! భలే—నీ మాటల్తో ప్రాణం లేచివచ్చినట్టుంది. అయితే ఇహనదే దారి' అన్నాడు రాబిన్.

మర్నాడు నాటింగ్‌హాం నడిబొడ్డుగా తెల్లగా ఉన్న షెరీఫ్ కోటలో పన్నెండు గంటలు కొట్టారు. మొగమెరలాంటి యెండ. అది షెరీఫ్ భోజనం వేళ. సలహాదార్లు సలహాలు, దార్లు చెబుతూ షెరీఫ్‌తో పాటు సాపాటుకు వచ్చే వేళ. ఇవాళ ఆవేళకే మన బాణం ఫశాల్‌మని దూసుకుపోయి ఫళీచ్‌మని చెక్కడాలానికి నాటుకు పోవాలనుకున్నాడు జాన్. ఇప్పుడతను సాధువువేషంలో వచ్చాడు. ఫ్రయర్‌టక్ దుస్తులు వేసుకున్నాడు. షెరీఫ్ కిటికీ దగ్గర తారట్లాడుతున్నాడు.

పన్నెండు గంటలు కొట్టిన పది నిమిషాలకల్లా పరిజనంతో భోజనం కోసం రానేవచ్చాడు షెరీఫ్. మండిపోతున్న ఆకలిలా బయట ఎండ. ఆ యెండలా లిటిల్‌జాన్ పగ. పట్టపగలు ఈ పగలు తెలుసుకోలేని షెరీఫ్ పగలబడి నవ్వుకుంటూ కులాసాగా కబుర్లు చెబుతున్నాడు. ఆ నవ్వులు లిటిల్ జాన్ వింటున్నాడు. అవి దెబ్బకు నొప్పులు కావాలను కుంటున్నాడు. అనుకున్న వెంటనే 'ఘాన్నంత పనీ చేశాడు. బాణం దూశాడు. వేశాడు. తిన్నగాపోయి తళాలుమనికొట్టుకుంది బాణం. తారుఫట్టింది అంతమందికీ షెరీఫ్‌కి నిలువునా పోయింది ప్రాణం. హుటాహుటిని భటుల్ని అటూ యిటూ పంపి వెతికించాడు!

## రాబిన్ హుడ్

'పిట్ట వాలినట్టు కూడా గుట్టు చిక్కలేదు దొరా' అన్నారు ఆ తగుదునమ్మాగాళ్ళు.

'తగినవాళ్ళు దొరికారా. పిట్టల్ని పట్టాల్సిందేనన్నానుల్లారా' అని నోరారా తిట్టి బాణం తెప్పించి తనిఖీ చేశాడు షెరీఫ్. దానికి చుట్టి వున్న చీటీ తీసి చదివాడు.

అందులో ఇలా ఉంది:

గౌరవనీయులూ, సాహసులూ, సహృదయులూ అయిన షెరీఫ్ కి:

మొన్నటి పరగణా బాణాల పోటీలో బంగారు బాణం గెల్చుకున్న

బిచ్చగాడూ, మోసం మోసంతోనే జయించాలని మోసం తీసిన వీరుడూ, మీబోటి ప్రజాకంటకులను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించడానికి అరణ్యవాసం చేస్తున్న పరగణా రైతుల గారాబుబిడ్డడు, న్యాయశాసనం పేరిట జరిగే అన్యాయపాలనకి లొంగని శూరుడూ, బందిపోటూ, హంతకుడూ, చోరుడూ అని పేరుపడ్డ అభాగ్యుడూ, మీ విరోధి విహారుడూ అయిన రాబిన్‌హుడ్

—ఈ బంగారు బాణం గెల్చుకుని పరగణా పేరు నిలబెట్టే అవకాశం కల్పించినందుకు మీకు దండాలు దండుతో సహా సమర్పిస్తున్నాడు. మంచికి మంచులా కరగి, చెడుకు పిడిరాయిలా ఎదురు తిరిగి, ఎప్పుడూ వెన్నంటి కన్నంచి కానలో కోనలో తమకోసం వేచి ఉండే వీరుడు —రాబిన్ హుడ్.

తన కాళ్ళకింద నేల కదిలిపోయినట్లయింది! ఫటాల్‌మని బాణం గుండెల్లో కొట్టుకున్నట్టనిపించింది! ఓ వెయ్యిమంది బందిపోట్లు పగలబడి నవ్వినట్లు గల్లంతైంది. సలహాదార్లు కావలాదార్లు దార్లుకొట్టే దొంగకి ఝడిసి బెడిసిపోయారు!

“హెంత మోసం!” అంటూ నిర్ఘాంతపడి చింతలో మునిగాడు షెరీఫ్—

దారితోచక, ఎటూ తేలక జారిపోయి జరుగుతున్నారు సలహాదార్లూ, కావలాదార్లూ. ఇహ తనదాగి తానే తేల్చుకోవాల్సి వచ్చింది షెరీఫ్‌కి! అంతకన్నా విచారం, దానికిమించి కోపం కూడా వచ్చింది. ఆ వచ్చిందేదో ఈసారి వచ్చినట్లు ఊర్కోలేదు. ఏమయినాసరే ఉరికంబం ఎక్కించాలని పట్టుదల పట్టాడు. కాని రాబిన్‌పిట్టపట్టు చిక్కడం లేదు. చిక్కుగా ఉంది. ‘సరే చూద్దాం’ అని ధీమాగా లేచాడు. లేడికి లేచిందే పయనమన్నట్టు అనుకోగానే అనేకఊహాలు పుట్టుకొచ్చినయ్ షెరీఫ్‌కి. పెద్దసైన్యంతో అడవిలోకి దండయాత్ర వెళ్ళి ఈ



# రాబిన్‌హుడ్

దొంగలముఠాను పట్టుకుంటే! అసలే దొంగలు-వెధవలు పట్టు చిక్కుతారా? చిక్కరు. ప్చ్-ప్చ్ ఇది లాభంలేదు. లాయకీకాదు. అయితే మరిఏమిటీగతి? దొంగను దొంగతనంతోనే పట్టాలి. దొంగచాటుగా వెళ్ళి చుట్టూ కమ్ముకొచ్చి కుక్కిన పేనల్లేపట్టి నల్లిన్నలిపినట్టు నలిపేస్తే...? వాడో జిత్తులమారిక్కా. వాడా అంత తేలిగ్గా చిక్కేది! మొన్నటి బాణాలపోటీలో మన కళ్ళలో పట్టపగలు ఖారంకొట్టి పారిపోయాడు. చిక్కాలిగాని డొక్క చించి డోలుకట్టి పరగణాఅంతా బజాయించవచ్చు. కానీ చిక్కడు. చిక్కపెడతాడు. చిక్కుగాఉంది. చికాగ్గాఉంది. ఛీ ఛీ" అని మండిపడి కోటలో కాళ్లుకాలిన పిల్లిలా తిరగడం మొదలెట్టాడు.

'ఓసారి వాణ్ణి యిక్కడికి భోజనానికి పిలుస్తే--ఎత్తుకు పైయెత్తు వేసి భడవాని హడల్‌గొట్టి పీడవదిలించుకుంటే సరి. అంత సుదినం ఎప్పుడు? అది రావాలి. కాదుకాదు రప్పించాలి. తెప్పించాలి. అందుకు బలం, బుద్ధిబలం గుప్పించాలి. ఇహ కార్యరంగంలోకి దూకాలి' అంటూ బారెడు మీసం మెలేసి యోచించాడు షెరీఫ్.

అట్టహాసం, హడావిడి తప్ప అసలు పస లేని షెరీఫ్ హంగామాతో వా ర్ల హడావిడి మరీ హెచ్చింది. షెర్‌వుడ్ చెట్లపై పిట్టయినా చెదిరిపోలేదు ఈ హడావిడికి!

చెప్పినదీ, చేపట్టినదీ జయం చేసుకువచ్చిన లిటిల్‌జాన్‌ని గట్టిగా కౌగలించుకున్నాడు రాబిన్‌హుడ్. అక్కడినించి నిక్షేపరాయుళ్ళు హాయిగా ఆడి పాడి జల్సా చేశారు.

"మనం మనం నేస్తాలం
తీయని చాదస్తాలం
రాబిన్ పులి వీరకథల
తో బిగిసిన దస్తాలం."

(ఇంకావుంది)

# అన్వేషణ

(31-వ పేజీ తరువాయి)

శివరాంకు. దొడ్లోని పూలతోట పొదలు, రాణి నివసిస్తున్న గదులు చూపించింది కామేశ్వరమ్మ.

ప్రసాద్ ఫలహారాల పంపకం బాధ్యత నిర్వహిస్తున్నాడు మౌనంగా తీరిగా. వేడి కాఫీ గొంతుకలో పోసుకున్నాడు శివరాం. ఇల్లంతా పరిశీలించి, తిరిగి సోఫాల్లోకి అందరూ వచ్చి కూర్చున్నప్పుడు రాణిమాత్రం తన గదిలోకి వెళ్ళిపోయింది. ఈ విషయం సోఫాలో తిరిగివచ్చి కూర్చునేదాకా గమనించని చంద్రప్రభ. తోడుగా తన తనయ లేదని కొంచెం చికాకుపడింది.

కాఫీ తాగారు అంతా.

తాంబూలాలు నమిలారు.

'వీలయితే మాయింటికి వస్తూండండి... సంబంధ బాంధవ్యాలు ఏమయినప్పటికీ...' అన్నారు పరంగేశ్వరరావుగారు లౌక్యంగా.

'అప్పుడప్పుడు వస్తూంటే... కుటుంబం మంచి స్వయంగానే పరిశీలించుకుని... నిర్ణయానికి రావచ్చు!' పెరిశాస్త్రి తన మనస్తత్త్వానికి బాహ్యంగా తక్కువ ప్రాముఖ్యత యివ్వదలిచాడు.

వారిమాటల్లోని అంతరార్థం గ్రహించుకున్నాడు శివరాం. మరో రెండు సార్లు పరంగేశ్వరరావుగారి యింటికి మర్యాదగా రావడం అన్ని విధాలా మంచిదనుకున్నాడు.

'వచ్చే ఆదివారం హైదరాబాద్‌లో నేను ఒక సమావేశానికి హాజరుకావాలి... అప్పుడు తప్పకుండా మీయింటికి మళ్లా వస్తా!'

పరంగేశ్వరరావుగారు శివరాం భావం అర్థంచేసుకున్నారు. అటువంటి కోరికకు తమకేమీ అభ్యంతరం లేదన్నట్లు సంతోషం తెలిపారు. అతను మళ్ళీ యింటికి వస్తాననడమే శుభసూచకమనుకున్నారు పరంగేశ్వరరావు దంపతులు.

కనిపించినా పలకరించని రాణికి అహంభావం, గర్వం మిక్కుటమనిపించింది శివరాంకు. పాఠశాల దినాలలోని తన జీవిత పరిస్థితికి ప్రస్తుత జీవిత హోదాకు ఉన్న వ్యత్యాసం విలువ గుర్తించుకున్న శివరాం, సామాన్య స్త్రీగా సంసారుల ఇళ్ళల్లో బ్రతుకుతున్న రాణితో తానే ముందు పలకరించవలసిన అగత్యం లేదనుకున్నాడు. ఇంటికి వచ్చిన తన్ను పొమ్మని అవమానపరచిన దృశ్యం జ్ఞప్తికి వచ్చింది. అయినా ఏమిటో రాణితో మాట్లాడే అవకాశం కలగలేదని శివరాం బాధపడ్డాడు.

పరంగేశ్వరరావుగారితో చెప్పినవిధంగా

# కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
## -అట్లు చేసినట్టిది దాని అధిక నురగ



నాయనమ్మ మెచ్చుకొంటున్నది: అనేక సంవత్సరాల అనుభవంగల నాయనమ్మ సన్‌లైట్ సబ్బుతో ఉతికిన బట్టలను చూచి చిరునవ్వుతో మెచ్చుకొంటున్నది. షర్టులు, దుప్పట్లు, తువ్వాళ్లు ఈ బట్టలన్నిటినీ తెల్లగాను కాంతిగాను, ఉతుకుటకు ఒక్కొక్కి కొద్ది సన్‌లైట్ చాలును. సన్‌లైట్ యొక్క సమృద్ధయిన నురగ చాలా బట్టలను చిరకుండానే ఎంతో బాగుగా ఉతుకును. మీ కుటుంబమందరి బట్టలను ఉతుకుటకు సన్‌లైట్ సబ్బును వాడండి.

SUNLIGHT SOAP

**సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును**

S 268-X52 TL.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారి

#  అన్వేషణ 

ఆదివారం శివరాం వారి యింటికి వెళ్ళాడు. కురంగేశ్వరరావుగారు తప్పనిసరిగా ఆఫీసు పనిమీద బయటికి పోయారు. చంద్రప్రభ కామేశ్వరమ్మ మాత్రమే శివరాంతో గడిపేరు. కాసేపు పేకాట ఆడారు. సినీమాల గురించి ప్రస్తావించారు. చిత్రకళను గురించి చర్చించారు. మహిళల పురోగమనం అగత్యం గురించి ఉద్ఘాటించింది కామేశ్వరమ్మ.

రాణి ఒకసారి అక్కడికివచ్చి శివరాం కనిపించగానే ముఖం చిట్లించుకుని ... వెనుతిరిగిపోయింది. కామేశ్వరమ్మ వచ్చి కూర్చోమని రాణిని పిలిచింది. కాని రాణి రాలేదు. ఇది గమనించి శివరాం లోలోపల బాధపడ్డాడు. ఆమె తననుంచి ఎందుకు దూరం అయిపోతోందో కారణం సులువుగా గ్రహించుకున్నా, కనీసం మర్యాదగా వచ్చి కలుపుగోలుగా క్రొత్త వ్యక్తిగానైనా ఎందుకు మాట్లాడకూడదనుకున్నాడు శివరాం. బహుశా తన రాక ఆమె జీవిత సుఖాలకేమైన అడ్డంకి కలిగిస్తోందేమోఅని కూడా శంకించాడు శివరాం.

'వచ్చే ఆదివారం... మేము పేడిచెర్లవైపున్న మా మామిడితోపులో పిక్‌నిక్ చేసుకుంటున్నాం... మీరుకూడా రావాలి!' కామేశ్వరమ్మ లేనిది సృష్టించి, శివరాంను తన కుటుంబంతో యింకా సన్నిహితంగా వచ్చేలా చెయ్యాలని ప్రతిపాదించింది.

శివరాం తప్పకుండా వస్తానన్నాడు.

రాణి ఈసారి తప్పకుండా పిక్‌నిక్‌కు రాగలదని ఆశించాడు శివరాం. వచ్చినప్పుడు ఏదో వీలుచేసుకుని ఒంటరిగా పలకరించవచ్చుననుకున్నాడు.

పై ఆదివారం పొద్దున తొమ్మిది గంటలకే కురంగేశ్వరరావుగారి యిల్లు చేరాడు శివరాం. కురంగేశ్వరరావుగారు పంచె లాల్చీ కట్టుకుని, వదులుగా హాయిగా కదులుతూ, కుటుంబ సహితంగా పిక్‌నిక్‌కు సన్నద్ధులైనారు. వంట సరంజామా, పళ్ళు కవ్వాళ్ళు, దుప్పట్లు అన్నీ వద్దివంటలక్క కారులో వెనకభాగంలో పెట్టింది. కామేశ్వరమ్మ, చంద్రప్రభ శివరాంకారులో ఎక్కారు. ఒక నౌకరుని డ్రైవరుని వెంటపెట్టుకుని కురంగేశ్వరరావుగారు ప్రసాద్‌తో తన కారులో కూర్చున్నారు.

శివరాం కారు నడిపిస్తున్నాడు స్వయంగా. కాని దృష్టిఅంతా రాణిచుట్టూ తిరుగుతోంది. ఆమెఎందుకు రావటంలేదని ఆలోచించాడు తీవ్రంగా సాహసంగా అడిగేశాడు. ఎలాగా బయలుదేరి పోతూండడం వల్ల తన ప్రశ్నకు అపార్థం కలగదనుకున్నాడు శివరాం.

'మీ స్నేహితురాలు రాలేదేం?'

'మా లతకు జ్వరమొచ్చిందండి!' చంద్రప్రభ నవ్వుతూ సమాధానమిచ్చింది.

ఆ పేరువిని శివరాం ఆశ్చర్యపోయాడు. నటకురాలైన రాణి తన జీవితంతోపాటు పేరుకూడా మార్చుకోవటంతో రాణి జీవితరీతులగురించి ఏవో అనుమానాలు కలిగాయి శివరాంకు.

జ్వరం వచ్చిందని రాణి సాకుచెప్పి ఉండవచ్చు అనుకున్నాడు శివరాం. అంత దూరమైపోవడానికి తాను ఆమె విషయంలో చేసిన అపరాధమేమో అతనికి అర్థం కాలేదు. ఇల్లు మారిపోయిన ఆమె ఎక్కడ వుందో తాను గుర్తించలేకపోయాడు కాని, తన ఇల్లు తెలిసిన రాణి ఎందుకు ఇంతకాలం రా కూడదనుకున్నాడు శివరాం. చిత్రకళలో తాను సాధించిన విజయాలకు ఎందరో ఎరగని వ్యక్తులుకూడా అభినందనలు పంపారే కాని, హృదయాన్ని చూరగొని, ఒకప్పుడు సన్నిహితురాలయిన వ్యక్తి తనకు ఒక్క ఉత్తరమైనా వ్రాయలేదని వ్యసనపడ్డాడు శివరాం.

కార్లు పేడిచెర్ల మామిడితోపు ఎదురుగా ఆగాయి. గుడిసెల్లో కాపలాకాస్తున్న పాలేర్లు యజమానినిచూసి ముందుగావచ్చి సవినయంగా నమస్కరించాడు. గడ్డిమోపు పరకల్లోదూరి పాలేరుభార్య మలయానిలంలో హాయిగా నిద్రిస్తోంది.

కురంగేశ్వరరావుగారు తెచ్చిన సామానులు పాలేరు నౌకరుమోసి, మామిడితోపులో మధ్యనుంచారు. చంద్రప్రభ దుప్పట్లు పరిచింది మట్టినేలమీద. కామేశ్వరమ్మ నౌకరునుపిలిచి కుంపట్లు అంటించమని, వంట ప్రయత్నంలో నిమగ్నురాలైంది. కురంగేశ్వరరావుగారు, కూతురు, శివరాంపరిచిన దుప్పటిమీద పేకాట మొదలెట్టారు. ప్రసాద్ జేబులోని ఈలతీసి గట్టిగా ఊదుతూ పాలేరు భార్యను లేపి పొలాల చుట్టూ తిరిగి, పిల్లకాల్వల్లోదిగి కాళ్ళు కడుక్కుని నీరాలమధ్య పిలుకుల్లా మెదలుతున్న చిన్నచేపలను పట్టుకోబోయి జారుతూంటే నవ్వుతూ అల్లరిచేస్తున్నాడు.

పాలేరు కుట్టిన బాదమాకుల్లో భోజనాలు చేశారంతా. తాంబూలాలుసేవించి బరువైన శరీరాలు ఒరిగిస్తూ మామిడితోపునీడల్లో ఒక చిన్నకునుకు తీశారు కామేశ్వరమ్మ కురంగేశ్వరరావు.

శివరాం చంద్రప్రభతో మామిడితోపు పర్యవేక్షణకు బయలుదేరాడు.

(ఇంకావుంది)






# కనుపాపల్లా సాకితే కలకల్లాడే పాపలు

"అంతా నీపిచ్చిగాని పిల్లల్ని పెంచటం ఓ పెద్ద బ్రహ్మవిద్యా!" అంటుంది మా అత్తయ్య. కాని నేను మాత్రం దానికి అంగీకరించటం లేదు. పిల్లల్ని పెంచటం బ్రహ్మవిద్య కాకపోవచ్చు. కాని మానవులు—అందులోనూ మహిళలు ముఖ్యంగా—అంటే మగవాళ్ళుకూడా నేర్చుకోవాలా అని అడగవచ్చును—వాళ్ళుకూడ— నేర్చుకోవలసిన విద్య అంటాను నేను. కొంత మంది ఆడవాళ్ళు పిల్లల్ని కనటం వరకే వాడ్యూటీ అన్నట్లుగ ఆతర్వాత వాళ్ళ గురించి యెక్కువగ అంత శ్రద్ధ తీసుకోరు. అంటే కేవలం పిల్లల్ని నిర్లక్ష్యంచేసి వదిలేస్తారని అనను...కాని వాళ్ళని తగిన రీతిని పెంచరు. 'మొక్కయి వంగనిది మ్రానై వంగుతుందా" అని చిన్నప్పుడే మనం పిల్లల్ని సరి అయిన పద్ధతుల్లో పెట్టి పోషించకపోతే పెద్దయ్యాక ఇక వాళ్ళు మన చెప్పుచేతల్లో అసలుండరు......చిన్నతనంలోనే పిల్లల్ని గురించి తగిన శ్రద్ధ తీసుకొన్న తల్లిదండ్రుల గురించి వారి చెప్పుచేతల్లో పెరిగి యీనాడు ప్రఖ్యాతివీరుల్లో ఒకరుగా పేరు సంపాదించిన అనేక మంది స్త్రీ పురుషులను ఉదాహరణగ మనం చెప్పుకోవచ్చును. ఛత్రపతి శివాజీ, మహాత్మాగాంధీ మొదలైన పెద్దల జీవిత చరిత్రలు చదివితే, తల్లిదండ్రులకు పిలల పెంపకం పై యెలాంటి గురుతర బాధ్యత ఉందో మనకు కొంచెం తెలియగలదు...అంటే అదంతా మాకు తెలుసునని మీ అభిప్రాయం అని మీరనుకోవచ్చును.. అయినా యిదంతా ఎందుకు చెప్తున్నానంటే మనబిడ్డలు మహాత్ములు కాకపోయినప్పటికి మన వంశానికి మచ్చతెచ్చే మానవులుగా మాత్రం తయారుకాకుండ మనం చూసుకోవాలి. పెద్దయ్యాక వాళ్ళు యేం చేయాలనుకుంటారో ఆ మనస్సు యొక్క బీజాలు చాయలు

శాంతిశ్రీ శ్రీమతి

చిన్నతనాల్లోనే వారిలో పొడచూపుతూంటాయి. మనం వాటిని జాగ్రత్తగ కనిపెట్టి వాటికి సరియైన దోహదమియ్యాలి.

## సరళ సలహా!

ఈ రోజుల్లో పెళ్ళయిన ఆడవాళ్ళు ఉద్యోగాలు చేయవచ్చా లేదా అనే ప్రశ్న దాదాపు తేలనేలేదు.

అందుకు సమాధానంకూడా అంతంత మాత్రంగానే ఉంది!

ఏమంటే మధ్యతరగతి కుటుంబాలు ఆర్థికంగాపడే ఇబ్బందిదృష్ట్యా ఈనాడు "ఉద్యోగం మనుజలక్షణం" అయింది. 'కేవలం పురుషలక్షణం' గనుంచి పురుషాంతరమైంది. ఆడదికూడా విలుచేసుకుని, ఇంటా బయటా పని చేయవలసిన రోజులు వచ్చాయి.

అందుకే వందరూపాయలు తెచ్చుకునే గుమాస్తా తను చేసుకోబోయేపిల్ల అందచందాలతో పాటు అర్హతకూడా చూసుకుంటున్నాడు. అర్హత అంటే తనకు వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా చేదోడు వాదోడుగా సంసారశకటం నడవడానికి సమఉజ్జీగా ఉండగలగడం.

మరి మధ్యతరగతి మాణిక్యం నిగుడు పెగ్గు అడ్డంగావుంది. దీనికి అర్థంలేదు. భర్తకు చేదోడువాదోడుగా ఉండే అర్హత విద్య ఎంతైనా సంపాదించుకోవాలి. అది నేటి సంస్కారం! సంఘ ధర్మం!

[అవి సక్రమమైనవైతే] లేకపోతే అవి తీరని కోరికల్లా వాళ్ళ మనసుల్లో ఉండిపోయి వాళ్ళను ప్రతినిత్యం వేధిస్తూ ఉంటాయి.

మన యిళ్ళల్లో ప్రతిచోట వింతే విషయమే యిది. చంటిపిల్లలు మారాము చేసి ఏడిపిస్తుంటే "అడిగో బూచాడు నిన్నెత్తుకొని పోవటానికి వస్తున్నాడు. కళ్లు మూసుకుపడుకో!" అంటూ వాడిని భయపెడ్తాము. ఆనాటినుంచే, అంత చిన్నవయస్సులోనే ఆలేత హృదయాల్లో పిరికితనాన్ని మనం నూరిపోస్తున్నామన్న మాట. ఈ సందర్భంలో మా పటాలింటిలో జరిగిన ఓ చిన్న సంఘటన చెప్పాలనుంటుంది. మా మట్టాలావిడ భర్త వెనకయుద్ధం జరిగే రోజుల్లో మిలటరీలోకి వెళ్ళిపోయాడు. ఆయన యుద్ధంలోకి వెళ్ళేసరికి వాళ్ళబ్బాయి ఏడాది పిల్లాడు. ఒకనాడు వాడు ఏడ్చి అల్లరిపెట్టుంటే ఆతల్లి గడ్డం బాగా పెరిగిన ఒకడ్ని చూపించి "అడిగో బూచాడు నిన్నెత్తుకుపోతాడు. పడుకో" అని భయపెట్టి పడుకోబెట్టింది. అయిదారేళ్ళ తర్వాత తండ్రి తిరిగి వచ్చేశాడు. ఆయన బాగా గడ్డం మీసం పెంచాడు. చాలకాలానికి యింటికి వచ్చానన్న ఆనందంతో బిడ్డను దగ్గరకు తీసికోబోతే ఆ ఆరేళ్ళ కుర్రాడు బావురుమని గోల్లుమన్నాడు. తల్లి యెంత చెప్పినా ఆ కుర్రాడికి ఆయన తండ్రి అని నమ్మకం కుదరలేదు బూచాడనే పిలువసాగాడు. ఇలా ఉంటాయి మన పెంపకాలు. ఇకపోతే పిల్లలకు రెండుమూడేళ్ళు వచ్చినప్పుడు మనం జాగ్రత్తగా వాళ్ళకి మంచి అలవాట్లు చేస్తే బాగుంటుంది. ఆ వయస్సులోనే మట్టిలో ఆడటం, అల్లరిపిల్లలతో ఆడటం బట్టలువిప్పి పారేయటం మొదలైనపనులు చేస్తూంటారు. మనం కనక కొంచెం ఓపి

పట్టి ప్రతినిత్యం వారిని కనిపెట్టి ఆపనుల నుంచి మాన్పిస్తూంటే వాళ్లు ఆవిషయాల్ని మర్చిపోతారు. లేకపోతే అదే అలవాటవుతుంది...ఇప్పటికీ మాచుట్టాలపిల్ల ఒకత్తె ఉన్నది... వయస్సు ఎనిమిదేళ్లు వచ్చినా గుడ్డలు సరిగా ఉంచుకోదు... అలాంటప్పుడే తల్లితండ్రులు శ్రద్ధ తీసికోవాలి. అలా గుడ్డమాపుకు తిరిగినప్పుడు ఒకసారి కేకలేసి బట్టలు కట్టిస్తే రెండోసారి అలా తిరగడానికి భయపడుతుంది...ఇక ఆపిల్లల శరీర శుభ్రత విషయంలో బాధ్యత అంతా మనదే! ప్రొద్దున్నే లేవగానే మొహాలు కడిగించి నీళ్లుపోసి, తల దువ్వుతూ ప్రతినిత్యం శుభ్రంచేయటం అలవాటుచేస్తే కొన్నాళ్లకి వాళ్లే మనల్ని పీక్కుతిని ఆ పనులు చేయించుకుంటారు... ఇక కొంతమంది చిన్నపిల్లలకు చిన్నప్పటినుంచీ అబద్ధాలు చెప్పటం, దొంగతనాలు చేయటం అలవాటవుతుంది. తెలిసివాళ్ళు ఆపనులు చేస్తారని చెప్పటం లేదు...తెలియక చేస్తారు.

అటువంటివాటిని మనం మొదట్లోనే ఖండించి పారెయ్యాలి!...ఈ విషయంలో మాత్రం మనం కొంచెం నిష్కర్షగానే ఉండాలి!...మా రెండోవాడివిషయంలో యిదే జరిగింది......వాళ్ళ నాన్నగార్కి పేకాట పిచ్చి...రాత్రి తెల్లవార్లూకూడా స్నేహితుల్ని పెట్టుకుని యింట్లో పేకాడుతారు. ఆ స్నేహితులు ఒక్కొక్కసారి అక్కడే పడుకుంటారుకూడాను...ఒకసారి అలా అంతా తెల్లవారుఝామున ఏ నాలుగింటికో పడుకున్నారు......తెల్లారింది... ఎవరూ లేవలేదు. నేను లేచి మామూలుగ యింట్లో పనులు చేసికొంటున్నాను...... ఇంతలో ఆయనగారు 'వెధవా!......ఎప్పుడన్నా చేస్తావా యిలాంటి పని...' అంటూ పదేళ్ల వెధవని ప్రొద్దున్నే చావగొడుతున్నారు. ఆయన కేకలు, దెబ్బలు చూస్తుంటే నాకు కళ్ళంబడి నీళ్ళువచ్చాయి. వాడు గిలగిలా కొట్టుకుంటున్నాడు...వెళ్లి అడ్డంబడి యివతలకు తీసికొద్దామనుకున్నాను. కాని ధైర్యం చాలలేదు...అయినా ఆయన తొందరపడి యెప్పుడూ కొట్టరు తగినంత కారణంలేందే అని సమాధానపరుచుకుని లోపలే మాతృప్రేమను అణచుకున్నాను—ఈ గందరగోళానికి అంతా లేచారు. "ఏమిటండీ! అలా కొట్టున్నారు?" అన్నాడు ఒకాయన.

"చూడండీ!... యిప్పటినుంచీ వెధవకు దొంగబుద్ధులు...సత్యన్నారాయణ జేబులోంచి రెండురూపాయల కాగితం తీస్తున్నాడు" అంటూ మావారు యింకో దెబ్బ వేసి "ఎప్పుడన్నా తీస్తావా?" అంటూ గర్జించారు..."యింకెప్పుడూ తియ్యను నాన్నా!—పక్కింటివాళ్ళబ్బాయి తియ్యమంటే తీశాను..." అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ ఇంట్లోకి వచ్చేశాడు...

'పోన్లెండి!...చిన్నతనం... తెలియదు" అంటూ అక్కడివాళ్ళు సమర్థించారు.

"చిన్నతనం కాబట్టే ఇప్పుడే సరిచేసికోవాలి!" అన్నారు మావారు...

—అంతే;...ఆనాటినుంచీ వాడు మళ్ళీ యెక్కడన్నా దొంగతనం కాని అబద్ధం కాని ఆడితే ఒట్టు...ఆనాడు తాత్కాలికంగా నేను కొంచెం బాధపడ్డా యీనాడు సంతోషిస్తున్నాను...యిలాటి విషయాల్లో తల్లితండ్రులు నిర్దాక్షిణ్యంగా ఉండాలని నా అభిప్రాయం.

ఇదే పరిస్థితుల్లో కొందరు కొందరు తల్లిదండ్రులు తమబిడ్డలను వెనకేసుకొచ్చి వారికి మద్దతు యిస్తారు. తమ బిడ్డలతప్పు సంగీకరించటం తమకు పరువు తక్కువగా భావిస్తారే కాని వారి భావిజీవితానికి అది దెబ్బ అని తలచరు.

అలాంటి వారిగతి "తోటకూర నాడైనా చెప్పవైతివి కదే తల్లీ" అంటూ తల్లి చెవి కొరికిన దొంగ కొడుకులా తయారవుతుంది.

ఇక పిల్లల చదువుసంధ్యలసంగతి చూద్దాం.

చిన్నతనంలోనే బడికి వెళ్ళాలనే ఆసక్తిని కనక మనం వాళ్లకి కలిగించలేకపోయామా యిక వాళ్ళకు చదువు అంటడం కష్టమే! దీనికితోడు ఎలిమెంటరీ పాఠశాలల్లోని ఉపాధ్యాయుల ప్రవర్తనమీద కూడా ఆధారపడి ఉంటుంది. ఆ పంతులుగారు ఒక్కసారి పిల్లాణ్ని వాడలకొట్టాడా యిక ధస్తే మన వాడు ఆ బళ్ళోకి వెళ్ళడు... యింటి దగ్గర ప్రత్యేకం ప్రయివేటు పెట్టించాలి...ప్రవేటంటే గుర్తొస్తోంది... కొంత కొంత మంది యిళ్ళల్లో చిన్నపిల్లల ప్రవేట్లు యెలా ఉంటాయో చూడండి!, ఆ పంతులుగారు వచ్చేసరికి ఆ ముద్దు బిడ్డడు యెదురుగ్గా సోఫాలో పడుకుని ఐస్‌క్రీం తింటూంటాడు. ఆయన గారి ఐస్‌క్రీం పూర్తయేలోగా ఈ పంతులు గారు చాప పరుచుకొని సిద్ధంగా కూర్చోవాలి...ఆ అపురూపపు బిడ్డడి తిండి పూర్తయాక యిష్టమైతే చాపమీద కూర్చుంటాడు లేకపోతే కడుపు నొప్పి అని అబద్ధమాడుతాడు. "మేష్టారూ! పోనీ రేపు చెప్పుదురుగాని పాఠం. ఇవాళికి వద్దులెండి!" ... అంటుంది ఆ తల్లి..."అలాగేనమ్మా!" అని

ఎప్పుడూ ఇంతే—24




# కనుపాపల్లా సాకితే కలకల్లాడే పాపలు

పెరిగాడు ఆపంతుం చేసేది లేక చిన్నతనం లోనే ఇలా గారాబం చేస్తే ఆ పిల్లవాడికి చదువేం అబ్బుతుంది. అలాగని పిల్లల్ని ప్రేమతో చూడకుండ కొట్టి చంపమని కాదు చెప్పేది. అటు భయమూ, ఇటు నయమూ రెండూ చూపెట్టే పిల్లాడు వినయ విధేయతలు, భక్తి శ్రద్ధలు అలవర్చుకుంటాడు. కొందరికి బాగా చదువు చెప్పించాలని, ఎక్కువ మార్కులు రావాలని యిక రాత్రింబగళ్ళు అదేపనిగ చదువు చెప్తారు...అలాంటి వాళ్ళకు చదువబ్బితే వస్తుందేమో కాని ఆరోగ్యం సరిగ్గా ఉండదు...మా పెద్దాడి పరిస్థితి సరిగ్గా యిలా అయింది... చిన్నప్పుడే వాళ్ళ తాతగారి దగ్గర వదిలేశాం చదువుకని...ఆయన వాడికి యిక పగలు రాత్రి అదే చదువు నూరిపోశాడు ... ఎస్. ఎస్. ఎల్. సి. దాక ఆయన పంచల్లో ఉండి చదివాడేమో అది ఫస్టున ప్యాసయినమాట వాస్తవమే! కాని దానితర్వాత కాలేజీ చదువులో అంతకంతకీ చురుకుతనం తగ్గించాడు. అందుకు కారణం తెలివితేటలు తక్కువయి కాదు ...పంజరంలో చిలుకలా బయటపడి తిరిగాడు ఆ చదువులో...... అంతే...

అందుకని మొత్తం మీద మొగపిల్లల చదువు విషయంలో మనం ముందే శ్రద్ధ పట్టడం మంచిది. 'ఆడపిల్లలకు చదువెందుకు" అని కొంతమంది మనల్ని వెనక్కిలాగిన మన పిల్లలకి మాత్రం వ్రాయడం చదవడం వచ్చే వరకన్నా చదివించి తీరాలని నా అభిప్రాయం. ఇలా వ్రాయాలంటే చాలా విషయాలున్నాయి. పిల్లల పెంపకంలో నాకు తోచిన యీ కొద్దిపాటి అభిప్రాయాలను మీ ముంగుంచుతున్నాను. వీటిపై మీ అభిప్రాయాలు తెలిపితే సంతోషిస్తాను ★

# వ్యాఖ్యలూ - విమర్శలూ

## మధ్యతరగతి మగువలు

సరదాలు, కోరికలు, ఆశలు ఆడవారికే పరిమితం కావు మగవారికీనీ. అయితే వచ్చే మాటల్లా ఆడదానికే వస్తుంది. కాకపోతే శ్రీ ప్రసాద్ గారు మానుగూవతి గారి వ్యాసాన్ని విమర్శించడంలోగల అంతర్యం ఏముంది?

ఇహపోతే వచ్చిందల్లా ఒక్కటే. 'ఆడపిల్ల పుట్టింట్లోను మెట్టినింటా కూడా పువ్వుల్లో పెరుగుతుంది' అని వ్రాస్తుంటారు మగవారు. అందుకని ఆమెకు యింకా సరదాలు, ఆశలు అనవసరమని విరితాత్పర్యమా?

నా వరకు నాకు ఆడది ఈనాడు కూడా వెనకపడే ఉందని అనుభవం! కాకపోతే వంటింట్లో ఉండేది నట్టింట్లోకి వచ్చిందేమో! అంతే. అంతకుమించి పురోగతీ మరోగతీ ఆడదానికి ఆనాడూ ఈనాడు కూడా లేదు!

—ఎమ్. ఉత్తర. కొల్లూరు,
(గుంటూరు జిల్లా).

* * *

## ఉమ్మడి కుటుంబాలు

ఉమ్మడి కుటుంబాలు పతనం కావడంతో ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమైంది. ఆ సంగతి రచయిత్రికి బాగా తెలుసునని 'ఉమ్మడి కుటుంబాలు' చదివితే అందరికీ తెలుస్తుంది.

ఉమ్మడి అనే మాటకు పరిమితి, తాత్పర్యం కూడా ఈనాడు మారిపోయాయి. తల్లి తండ్రులతో కొడుకూ కోడలూ కలిసి ఉన్నా, ఓ అన్నా తమ్ముడూ కలిసి ఉన్నా ఉమ్మడి కుటుంబం అయిపోతుంది నేడు! పెళ్ళైన కూతురు గానీ, కొడుకు గాని విడిపోకుండా ఉంటే ఉమ్మడి అనుకోవచ్చు యీ రోజుల్లో! ఏది ఏమైనా మొత్తానికి యింకా ఉమ్మడి కుటుంబాలేమిటి ఈ అతి నవ్యంలో!!

ఉమ్మడి అభిప్రాయం, కృషి అనేవి ఏనాటితో లోపించినాయో ఆనాటితో నే వాటిమీద ఆధారపడే ఉమ్మడి కుటుంబమూ అంతరించింది

మా వాళ్ళ కథ ఒకటి. పెద్దవాళ్ళు. పండితులు, అనవ్రాయులు జీవకారుణ్యం జీవితంగా బ్రతికినవాళ్ళు—అయితే వీటన్నిటితోపాటు ఉమ్మడి కుటుంబ వ్యవస్థను అంతమగించంకూడా పాడారు. ఎక్కడ 'మాకు' అయినా వెనకింటికి 'వంగతోట దగ్గర కొదవన్నాట' ఒక జగజెట్టి!

ఉమ్మడి కుటుంబం పాలిక్కి. ఉత్తి తాయిలం. ఆ సంగతి రచయిత్రికి బాగా తెలుసు లేకుంటే 'జ్ఞాతి శ్చైవన లేసకిం' అని వారు వాడే ఉండరు.

పి. సూర, కాంతం,
రాజోలు: (తూ. గో. జిల్లా).

* * *

## నేటి పెళ్ళి సమస్యలు

'నేటి పెళ్ళి సమస్యలు' అని ప్రత్యేకం కొన్ని లేవని నేననుకుంటాను పెళ్లి సమస్యలు ఎప్పుడూ ఒకటే. అయితే కాలానుసారంగా అవి మారవచ్చు అంటారు. కాలం మారినా సమస్యల మూలం మారలేదు. ఈనాడు 'వరకట్న నిషేధం' పెట్టారే అనుకోండి. దీనివల్ల 'కట్నం' సమస్య తొలగిందా? మా నాయనమ్మ పెళ్ళినాడున్న సమస్యలే నేడూ ఉన్నాయి. కాని ఏవో పద్ధతులూ అవి కొద్దిగా మారి ఉండవచ్చు. ఉదాహరణకు పూర్వం లేని రజస్వలానంతర వివాహాలు. 'కున్నా' గారు చక్కగా

శంకర్




పాకశాల:

# శనగపిండితో...

## పాటోలీకూర:

కావలసినవి. 1/4 వీ శనగపిండి, 1/8 వీ పచ్చిమిర్చి, 1/8 వీ నీరుల్లి, 1/16 వీ నూనె, కొంచెం పోపుసామాను, తగినంతవుప్పు, కర్వేపాకు, పచ్చిమిర్చి నిలువుగా నాలుగు ముక్కలు చేసుకోవాలి. వుల్లిపాయలు కూడా చిన్న ముక్కలుగా తరుక్కొని, శనగపిండి జల్లించుకోవాలి. కుంపటిమీద అడుగు మందంగావున్న గిన్నె కాలేసి 2 చెమ్చాలు నూనె వేసి ఒకమిరపకాయ, 1 స్పూను మినప్పప్పు, 1 చెమ్చా ఆవాలు వేసి చిటపట్లాడా- వుల్లి, పచ్చిమిర్చి ముక్కలు వేసి కర్వేపాకు వేసి ఒకసారి కలిపి మూత పెట్టాలి.

ఇవి అలగా నేచూస్తే పచ్చిమిర్చి, వేగి వుంటుంది. అప్పుడు శనగపిండి వేసి కలుపుతూ బాగాకలిశాక తగినంత వుప్పు వేసి. కొద్దిగా నీళ్ళుజల్లి మూత పెట్టాలి. కొంచెం సేపయాక వేళ్ళతో పట్టుకుచూస్తే పిండి వుడికిందో లేదో తెలుస్తుంది. అప్పుడు నూనె పోస్తూ కలిపి మరో రెండు నిమిషాలపాటు కుంపటిమీద వుంచి దింపాలి. ఇది అన్నంలోకి పాటోలీలాగా చాలా బాగుంటుంది.

## బొంబాయి చెట్నీ:

1 నిమ్మకాయ స్టీలుగిన్నెలోకి పిండుకుని 2 కప్పులు నీళ్ళుపోసి తగినంతవుప్పు, 1 స్పూను కారం వేసి 4 చెమ్చాలు శనగపిండి వేసి బాగా కలుపుకోవాలి. పొయ్యిమీద బాణలి పెట్టి కొద్దిగానూనె వేసి, చిన్న యింగువపలుకు, 1 చెమ్చా ఆవాలు, కర్వేపాకు వేసి వేగాక కలిపివుంచుకున్న పిండి పోస్తూ కలపాలి. గట్టిపడగానే వుడికిందో లేదో చూసుకుని, గిన్నెలోకి తీసి పెట్టుకోవాలి. ఇది పూరీల్లోకి, యిడ్లీకి బాగుంటుంది.

## కజ్జికాయలు:

కావలసినవి: 2 పావు శనగపిండి, 2 ఎండు కొబ్బరి-చిప్పలు, 1/4 వీ బెల్లం 1/2 తు ఏలకులు కొద్దిగా జీడిపప్పు గోధుమపిండి పొయ్యిమీద బాణలి పెటి 2 చెమ్చాల నెయ్యి వేసి శనగపిండి వేయించుకోవాలి. కొబ్బరి కోరుకుని, బెల్లం సన్నగా తరుక్కోవాలి. వెడల్పాటి పళ్ళెంలోకి శనగపిండి తీసుకుని, కొబ్బరికోరు, తరిగివుంచుకున్న బెల్లం, ఏలకపొడి, జీడిపప్పు వేసి బాగా కలుపుకోవాలి. గోధుమపిండి పూరీల్లా వత్తుకుని కజ్జికాయ పీటలో ఒకపూరి వేసి, 2 చెమ్చాలు ఈ పిండి వేసుకుని పీటనొక్కి తీస్తే కజ్జికాయ వస్తుంది. అన్నీ అలాచేసుకుని నూనెలో వేయించుకోవాలి. వారం రోజులవరకు, కరకరలాడుతూ చాలా బాగుంటాయి.

## గుల్లపకోడి

కావలసిన వస్తువులు: బియ్యం 1 పావు వెన్న 1 పెదనిమ్మకాయంత, పచ్చిమిర్చి 10 కాయలు, వుల్లిపాయలు 4 అల్లం-1 అంగుళం ముక్క తగినంతవుప్పు డాల్డా.

బియ్యం నానబోసి వాడేసి పిండికొట్టి జల్లించాలి. జల్లించిన పిండిగట్టిగా నొక్కి వుంచాలి. పచ్చిమిర్చి, వుల్లిపాయలు, అల్లం వుప్పు రోట్లో వేసి మెత్తగా దంచాలి. ముద్దగా అయింతర్వాత పిండిలో వేసి వెన్న కూడా వేసి పిసకాలి. అంతా బాగా కలిసింతర్వాత పొయ్యిమీద బాణలిపెట్టి డాల్డా వేసి కాగింతర్వాత ఈ పిండిని వేళ్ళమీదుగా పకోడీల్లా నూనిలో వెయ్యాలి. వేగాక తీసుకోవాలి. బాగా గుల్లగా వుంటాయని మరింత వెన్న వేస్తే నూనిలో వెయ్యగానే విచ్చిపోతాయి. పిండి కలపటానికి తడచాలకపోతే ఇంకో వుల్లిపాయ రెండు పచ్చిమిర్చి వేసి దంచి ఆతడితో పిండిముద్ద చేసుకోవాలి గాని నీళ్లు పొయ్యకూడదు.

త్వరగా మాడిపోతాయి కనక జాగ్రత్తగా చూడాలి. దోరగా వేగాక తీసి మూత పెటుకుంటే గుల్లగా కరకరలాడుతూ ఎంతో బాగుంటాయి.

తల్లాప్రగడ సీత,
మదనపల్లి. ★

---

నాగు వ్యాసం. పెళ్ళిళ్ళ సమస్యలు తగ్గాలనే ఉద్దేశం ఎందరికో వుంది. కాని ఒకటి తీరితే మరొకటి వచ్చి అసలు సమస్య అలాగే ఉంటున్నది. ఆరోజుల్లో వధూవరులకు తెలీని ఈరోజుల్లో కట్టినబంధాలే ఆనందంగా కొనసాగినాయని పెద్దవాళ్ళంటే మరి ఎందుకు మన వివాహాగరికం నిరుత్తర అవుతున్నటూ!

వేజెండ్ల కామాక్షి,
హైదరాబాద్. ★





 ## ఉత్తరాలు 

(2-వ పేజీ తరువాయి)

25 ప్రశ్నలలో నేను సమాధానాలు రాస్తే 15 రైట్లు వచ్చాయి. నన్ను ఎప్పుడూ అమ్మ, అక్కయ్యలు, అన్నయ్యలు చాలా అల్లరిపిల్లననీ, సరిగ్గా చదువుకోనని అంటూ వుంటారు. పత్రికలో ప్రశ్నలకు నా జవాబులు చూస్తే ఆ మాట నిజమేననిపిస్తుంది. ముఖ్యంగా నాకు సినిమా పిచ్చి ఎక్కువ. ఇకమీదనైనా అల్లరి మాని 6వ తరగతికి వచ్చేసరికైనా మంచి అమ్మాయి అనిపించుకోవాలని ఆశగా వుంది.

కె. శారద, మదనపల్లె.

ఇంతటి మంచి శీర్షికను పాఠకలోకానికి అందించిన మీకు ధన్యవాదాలు అర్పించ లేకుండా ఉండలేను.

సి. నరసింగరావు, చేబ్రోలు.

* * *

ప్రతివారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక కోసం చకోరపక్షిలాగ ఎదురు చూస్తూ వుంటాను. రాజధాని కబుర్లు, 'ఎప్పుడూ ఇంతే' చాలా బాగా వుంటున్నాయ్.

—సీతారామస్వామి, తాళ్ళపాలెం.

* * *

అవధాన పంచానన గడియారం శేష శాస్త్రిని గూర్చి వ్రాస్తూ "నివురుగప్పిన నిప్పులాంటి వారు" అని వ్రాయడం శోచనీయం!

ఎవరైతే "అలతిమాటల్లతో, కొలది తప్పనిఊహాలతో, అతి నేలమైన సంయమంతో చిక్కగా మిగడ తేలునట్లు పద్యం చెప్ప గలరో ఆయన్ని గూర్చి అనవలసిన మాటలేనా యిది?

చక్రవర్తి సంతానమ్.
తిరుచ్చిరాపలి

*అది గౌరవప్రదమైన జాతీయ ప్రయోగమే. సం॥

* * *

ది 24–2–60 పత్రికలోని గళ్ళనుడికట్టులో 28 వ గడికి ఆధారము "నారంగఫలములోని రంగు" అను దానికి సమాధానము "రంగము" అని వ్రాశారు. ఇది ఎట్లయినదో తెలియదు. పై ఆధారమును బట్టి ఆలోచించినచో అసలు రంగము అనుమాటకు అన్వయము కుదరదు. ఇదేవిధముగా ఒకసారి గళ్ళను కట్టులో "ఎద్దుకన్నులోంచి చూస్తారా?" అనే ఆధారమునకు సమాధానము "కిటికీ" అని వ్రాశారు. ఇది కూడ పైవిధముగ నే అర్థములేని సమాధానము. నేను కోను చున్నట్లుకాక ఈ రెండింటికి ఏదైనా అర్థ సమన్వయము కుదురునట్లైన దానిని పత్రికాముఖముగా తెలుపగోరుచున్నాను.

యద్దనపూడి సుబ్బారావు, విశాఖపట్టణం.

* "నారంగఫలము" అను మాటలో రం-గ-ము అను అక్షరాలు తీసుకుంటే రంగము అను సమాధానమువస్తుంది. రంగము అనగా రంగు అని యర్థము. ఎద్దుకన్ను అను మాటకు సంస్కృతము 'గవాక్షము'. గవాక్షము అంటే కిటికీ. కనుక అవిధంగా ఆ ఆధారం ఇవ్వబడింది. సం॥

## 'నిరాయుధీకరణము'

ప్రపంచశాంతి స్థాపనకై గట్టిప్రయత్నములు జరుగుతున్న ఈసమయములో మీరు ప్రచురించిన 'నిరాయుధీకరణము' వ్యాసము మాకు ప్రపంచశాంతికి ముఖ్యమైన యూరోప్ రాజకీయపరిస్థితిని చక్కగా తెలియ పర్చినది. ఐర్లెండును వార్సాసంధి రాజ్యంగా పటములో గుర్తించారు. ఇది సరియైనది కాదు.

రాజ్. ఏలూరు

పారబాటే – ఐర్లెండు తటస్థరాజ్యం. మరొక సవరణ. రెండవ పటంలో X గుర్తుపెట్టినప్రదేశాలుఅమెరికన్ అణ్వస్త్ర స్థావరాలుగా గుర్తించమనవి. సం॥

* * *

## వనితాలోకం

2–3–60 పత్రికలో వనితాలోకం శీర్షికలోనివ్యాసములు చాలాబాగున్నవి. చిత్రపు రాధగారి 'అతివలు-ఆక్షేపణలు' చాలా బాగున్నది. బి. ప్రేమలీలగారు వ్రాసిన 'లేనిపోని వదంతులు' చక్కగా ఉన్నది. ఈ వ్యాసమును చదివిన తరువాతనైనా అటువంటి అమ్మలక్కలు బుద్ధిగా ఉండగలరని ఆశిస్తున్నాను. ఇటువంటివ్యాసమును చక్కగా చిత్రీకరించిన ప్రేమలీల గారికి నా వందనములు"

—వై. సీతారామయ్య. కొవ్వూరు.

* * *

చిత్రపు రాధగారు వ్రాసిన "అతివలు-ఆక్షేపణలు" వ్యాసం చాలా బాగుంది. వారి వ్యాసం చదువుతుంటే యిలా ఆక్షేపించే వారు ఉన్నారా? లోకంలో అనిపించింది. ఆక్షేపించె వాళ్ళకు యీ వ్యాసం కనువిప్పు కలిస్తుందని ఆశిస్తున్నాను. వ్యాసం రాసిన రాధగారికి పత్రిక ద్వారా నాఅభినందనాలు అందచేస్తున్నాను.

మిస్. ముంతాజ్, అనంతపురము.

* * *

"లేనిపోని వదంతులు" వ్యాసం చాలా బాగుంది

కాలేజీల్లో అయితే యిటువంటి పూసార్ల సంగతి చెప్పనే అవసరము లేదు. కొద్దిగా ఏ అమ్మాయితోనో మాట్లాడేసరికి లేనిపోని సంబంధాలు అంటగట్టడమో, గోడలు నల్లగా చేయడమో జరుగుతుంది.

పోతే, గాలికబుర్లు ప్రచారం చేయడం అంతా ఆడవారికే యిద్దరం మాత్రం సబబు కాదు. మగవాళ్ళలో కూడా ఇటువంటి వాటి ఉన్నవారు లేకపోలేదు.

ఏది యేమైనప్పటికి, ఈ చక్కని వ్యాసం అందించిన రచయిత్రి ప్రేమలీల గార్ని అభినందించక తప్పదు.

బి. మన్‌మోహన్ కృష్ణ, సికింద్రాబాద్.

* * *

'పోనీలే మన ఆంధ్రపత్రికే కదా' అని నేను చదువుతూంటే 'రామచంద్ర ప్రభో, సీతారామచంద్ర ప్రభో' వదలలేక చస్తున్నానంటే నమ్మండి! ఇదిగో! 'ఆఖరుసారి చెబుతున్నా' ఇకముందు కూడా మీ పత్రికను యీ స్టేండర్డులోనే (యింకా ఎక్కువైనా పరవాలేదనుకోండి) ఉంచేలా చూడాలి.

# ★ ఉత్తరాలు ★

## భామాభిరామాయణం

విజయా కౌండిన్యగారు "భామాభి రామాయణం" అన్న వ్యాసాన్ని చక్కగా వ్రాశారు. ఎక్కువగా ఆడవారి ఆడంబరాలను గురించి విమర్శిస్తూ తగిన సలహాలను యిచ్చారు. ఏ కొద్దిమందో తప్ప వారు చెప్పినంత నిర్లక్ష్యంగా ప్రవర్తించేవారు లేరంటే అతిశయోక్తి కాదేమో! విమర్శించడమంటూ వస్తే ప్రతిదాన్నీ విమర్శించవచ్చును. ఆడంబరాలపై యింతగా యిన్ని పేజీలు వ్రాయడం భావ్యంగా లేదేమో? ఏది ఏమైనా స్త్రీ ఆడంబరాలకి పోయి అధోగతి పాలవడానికి యిష్టపడుతుందా?

శీలాకృష్ణ, విజయవాడ ★

# "పన్నులచెలగాటం: సినీఉద్యోగుల ప్రాణసంకటం"

బడ్జెట్ వస్తున్నదీ అన్నా, ఎగుమతి దిగుమతి విధానం కొత్తది వస్తున్నది అన్నా తారల కాళ్ళు బలపాలుకట్టినవన్నమాటే!

ఫిలిం పరిశ్రమపై రకరకాల పన్నులు విధించినందుకూ, హెచ్చించినందుకూ తారలు, నిర్మాతలు, సాంకేతిక ప్రవీణులు నిరసనప్రదర్శనాలు జరపడం పరిపాటి. ముడిఫిలిం కోటా చాలా తగ్గించేసరికి తారలు వీధులవెంటపడి ప్రభుత్వ విధానాన్ని దుయ్యబట్టుతూ నినదించారు. వారి వెంటవచ్చిన సామాన్య జనాన్ని అదుపులో వుంచేసరికి పోలీసులకు తలప్రాణం తోకకు వచ్చింది.

ప్రభుత్వం ఇటువంటి "తీవ్ర చర్యలు" మొదట తీసుకోవడం, దేశమంతా నిరసన ప్రదర్శనాలు జరిగిన పిమ్మట కొన్ని సడలించడం అలవాటు అయిపోయింది. ఇది అంతా "చావుకు బడితే లంకణాలకు దిగుతుంది" అన్న ధోరణిలో సాగుతున్నది.

ఈసారి ఎక్స్పోజ్డ్ ఫిలింపై మీటరుకు 10 నయాపైసలనుంచి 50 నయాపైసల వరకు ఎక్సయిజ్ డ్యూటీని ప్రభుత్వం విధించింది. ఇందువల్ల 75 లక్షలరూపాయల ఆదాయం వుంటుందని అంచనా.

ఇటు పన్నులూ, అటు నిరసనచర్యలూ మధ్య సినిమా పరిశ్రమలోని సాదా ఉద్యోగులు, సాంకేతిక ప్రవీణులు రెండు కొట్ల గిత్తల మధ్య నలిగిన లేగదూడలా గిలగిలా కొట్టుకొంటున్నారు.

పన్ను గురించి వార్త వచ్చిందో లేదో సిబ్బందిని తగ్గించివేస్తామని నిరుద్యోగం పెరిగిపోతుందని భారత్‌లో కొందరు ఫిలిం ప్రముఖులు అప్పుడే హెచ్చరించారు. దాంతో ఉద్యోగులు ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నారు.

ఈ పన్నువల్ల చిత్రనిర్మాణం చాలా తగ్గిపోతుందనడంలో సందేహం లేదు. అందువల్ల సాదాఉద్యోగులేకాక సాటి టెక్నీషియనులు, చిల్లర పాత్రధారులు కూడా "కేరాఫ్ రోడ్స్" అడ్రస్ ఇచ్చుకోవలసి వుంటుంది. కొత్త నటీనటులను తీసుకొంటే ఎక్కువ "టేక్స్" అవసరమౌతవి కాబట్టి, తత్కారణంగా ఎక్కువ ఫిలిం ఎక్స్పోజ్ చెయ్యవలసి వస్తుంది కాబట్టి కొత్తతారలను ఇక ఎవ్వరూ తీసుకోనబోరు. కాగా అసలే ఏ కథ ఎలా పోతుందో తెలియనందున చాలామంది నిర్మాతలు చిత్రాల కాపీకి పరుగులెత్తుతున్నారు. పదికి ఒక రిద్దరు ఒరిజనల్ కథలకు వెతుకుతూ వుండవచ్చు. కొత్త పన్ను పుణ్యమా అని ఇక వీరుకూడా, కొత్తకథలను, కొత్తరకం కథనాలను పాపాసించక "ఛలో బెంగాల్" "డెస్టినేషన్ బాంబే" అంటూ బృందగానం చెయ్యవచ్చు. డబ్బింగ్ చిత్రాల సంఖ్య పెరిగి నటీనటులకు పని తగ్గి "వాక్ టెక్ట్స్" అని తూర్పుకు తిరిగి సమూహంగా ప్రశ్నించనూ వచ్చు.

## సినిమా

75 లక్షలరూపాయల కోసమని ప్రభుత్వం ఇందరిని హైరానపెట్టడం తగదు. తారలు తలచుకొంటే తమకుతామే ఈ మొత్తం ఇయ్యగలుగుతారు. అయినా అటు ప్రభుత్వం ఆశయాన్ని కూడా ఇటు నిర్మాతలూ పాటించాలి. నిర్మాతలు చిత్రాల నిడివిని తగ్గించుకోవాలి. టేకులు వీలైనంత తగ్గించాలి. ప్లాన్డ్ ప్రొడక్షన్ను ఇకనైనా అలవరుచుకోవాలి. పొదుపరితనం పాటించాలి. నిర్మాతలు ఇటునుంచి ఇలా "నరుక్కు" వస్తే ప్రభుత్వం అటునుంచి "చావును" "లంకణాల"కు దించి పన్ను తగ్గించగలదు. ఉభయవర్గాలు ఏ 80 లక్షల వద్దానికో రాజీకివస్తే లేగదూడలైన సాదాఉద్యోగులు తదితరులు ఒకతుపానునుంచి బైటపడుతారు.

జీవన్మరణాలమధ్య ఊగిసలాడుతున్న సినీకళాలక్ష్మికికూడా కొంత కాంతి కలుగుతుంది. ఈసారయినా కాళ్ళు బలపాలు కట్టుకొనేటట్లు కోర్టువెంట తిరిగి, గొంతుక బొంగురుపోయేటట్లు నినాదాలుచేసే దుస్థితి లలిత శరీరంకల తారలకు రాదనే ఆశించుదాము.





వీనస్ వారి "పెళ్ళికానుక"లో కృష్ణకుమారి, సరోజాదేవి

# మనతారలూ - స్టూడియోలూ

ఈవారం చిత్రలోకంలో చాలా చిత్రాలు జరిగాయి.

ఓ తారపై టపాకాయవేస్తే టక్కున తిరగగొట్టింది. ... ప్రాచీనకాలపు ఒక సంస్కృతమహాకవి సినిమా రచయితల ముందు నిలబడి "దిస్ ఈజ్ టు ఇంట్రడ్యూస్ మైసెల్ఫ్..." అంటూ ఆరంభించారు. ఇంకొక ఈ కాలపుకవి చేతిలో "కాళిదాసు" అనే అరఠావు పేజీపుస్తకం చూసి అది "కవికాళిదాసా?" "భోజకాళిదాసా?" అని ప్రశ్నిస్తే రెండూ కాదు "నా కాళిదాసు, మనకాళిదాసు, ప్రపంచ కాళిదాసుకూడా" అన్నారు!...కిరీటంవున్నవాడల్లా వైకుంఠంనుంచి ఊడిపడ్డాడని ఒక యువకుడు భ్రమించి గమ్మత్తుపాటలు నేర్చుకొన్నాడు....కూచిపూడి కొరియోగ్రాఫరుతో రాక్ ఎన్ రోల్ నృత్యాలు గురించి ప్రస్తావించేసరికి ఆయన "ఊ" అంటూ ముందుకువచ్చి ఊహించని అభిప్రాయం వెలిబుచ్చారు నిరదరిరిచి తెగింతం...

## పద్మినిపై "టపాకాయ"

కేరళ సోదరీమణులలో కల అంగకర్త. చారిత్రక, నామం సార్థకంచేసిన పద్మిని, హాలీవుడ్ నటుడు ఫ్రెడరిక్ మార్చ్ స్వంతంగా నిర్మించనున్న ఒక ఆంగ్ల చిత్రంలో నటించనున్నట్టు ఒక విశ్వవ్యాప్తవార్తాసంస్థ ఒక టపాకాయవంటి వార్త ప్రచారం చేసింది.

మార్చి మూడవ తేదీన పద్మిని మద్రాసుకు తిరిగివచ్చారు. బొంబాయిలో ఆర్. కె. ఫిలిమ్స్‌వారి "జిస్‌దేశ్ మేం గంగాబహతీ హై" అశోక్ పిక్చర్ వారి "కల్పన" హిందీ చిత్రాలలో నటించివచ్చారు.

మాస్కోనుంచి హాలీవుడ్‌కు నాట్యప్రాంగం మార్చనందుకు అభినందించగా ఆమె ఆశ్చర్యపోయిందామె. రామ! రామ! హాలీవుడ్ ఆఫర్ గానే లేదన్నారు.

ఫ్రెడరిక్ మార్చ్ మద్రాసు రాగానే మమ్మల్ని గురించి విచారించారు. నేనూ సోదరి రాగిణి వెళ్ళి కలుసుకొన్నాము. ఆ మహానటునితో పిచ్చాపాటి చేశాము. అంతే—అని కేరళకన్య అమాయకంగా చెప్పినట్లు చెప్పి...

...అంతటితో రాగుకోక...

"ఇంగిలీకం అంటే అగ్గో పులి అంటారు కలం బలంకొద్దీ" అని రచయితలపైనే టపాకాయ ఎగురగొట్టారు.

ప్రస్తుతం కైరోలో ఆసియా, ఆఫ్రికా

అశ్వరాజ్ వారి 'దీపావళి'లో సావిత్రి





సారణివారి "కాళిదాసు"లో మహాకవికి, మహానటికి మధ్య మనస్సంఘర్షణ (నాగేశ్వరరావు, రాజసులోచన)

చలనచిత్రోత్సవం జరుగుతున్నది. పద్మిని నటించిన "వీరపాండ్య కట్టబొమ్మన్" తమిళ చిత్రం అక్కడ ప్రదర్శిస్తున్నారు.

పద్మిని కైరో ప్రయాణ సన్నాహంలో వున్నారు.

## వెర్రి కాళిదాసు గొప్పా?
## వేత్త కాళిదాసు గొప్పా?

జలగర్భంలో తీసిన "అండర్ వాటర్" హాలీవుడ్ చిత్రం ప్రివ్యూను జలగర్భంలోని ఒక కేవ్‌లో ఇచ్చారు. తెలుగు రంగం అంత ముందుకుపోలేదు కాని కొత్త సంస్థ సారణి ప్రొడక్షన్స్ మాత్రం ఒక కొత్త పుంత వేశారు. వీరు తొలి చిత్రం "మహాకవి కాళిదాసు" పూర్తిచేశారు. మార్చి ఒకటవ తేదీన పత్రికా ప్రతినిధులను సారణీవారు సమావేశపరచి "కాళిదాసు" కష్టసుఖాలు వివరించారు. "ప్రివ్యూ" కాక ఇటువంటి "ప్రీ-ప్రివ్యూ" లు ఏర్పాటుచేయడం తెలుగు చిత్రరంగంలో బహుశా ఇదే మొదటిసారి. చిత్రదర్శకుడు శ్రీ కమలాకర కామేశ్వరరావు, ఆర్జునగోఖలే.

సమావేశం శుభ్రంగా జరిగినందుకు ఆనందపుటంచులు కొలుస్తున్న నిర్మాత శ్రీ నాగమణిగారిని ప్రక్కకు పిలిచి......"మనలో మాట... మీకు వెర్రి కాళిదాసునచ్చాడా? ... వేత్త కాళిదాసు నచ్చాడా? ఎవరు మిమ్మల్ని కదలించివేశారు?..." అని మెల్లిగా చల్లగా కదలించాను. "ఇద్దరూ చెరోవైపూ యమ కదలించారు" అని గూడలు నొక్కుకుంటూ జవాబిచ్చారు.

"అబ్బాయిగారూ, మొదట కాళిదాసు అని చెప్పగానే కాళికముందు వణికినట్టు వణికాను. రంగంలో దిగాక కథ పాకాన పడ్డది. ఏమ్ మజాగా వుందండీ!" అని ఉవ్వెత్తున ఎగిసిన ఉత్సాహంతో ఆ నిరాడంబర నిర్మాత వాక్రుచ్చారు.

## పింగళి నాలుగు పాయింట్ల పాళీ!

ఈ కాలపుకవి ఆ కాలపుకవి గురించి ఎంత శ్రద్ధ తీసుకొన్నారో ఒక్కమాటు ఫ్లాష్ బ్యాక్‌లో చూస్తే ఆనందము, ఆశ్చర్యము కలుగుతుంది.

ఉదయం ఆగదిలో కాలు పెట్టగానే అనేక బృహద్గ్రంథాలు, చిత్తరువుల సంపుటి, వివిధ ఆంగ్ల నాటకాలు, నవలలు, స్పోర్స్ గ్రంథాలు, "చివరకు" సినిమా మ్యాగజైనులూ చక్కగా అమర్చివుంచటం చూచాను. ఒకవైపు రిసెర్చి గ్రంథాలు మరోవైపు నోటుపుస్తకాలు కన్పించాయి. ఆ ప్రక్కనే ఒక బైండు పుస్తకం మీద "కాళిదాసు" అన్న నాలుగు అక్షరాలు ఆర్టిస్టిక్‌గా వున్నాయి. ఆదికవి కాళిదాసా భోజకాళిదాసా అన్న ప్రశ్నతో అడుగు ముందుకు వేసేసరికి "పింగళి కాళిదాసు, అందరి కాళిదాసు" అని జవాబిచ్చారు బందరు నాటకాలకు, మద్రాసు సినిమాలకు నవరంగులిచ్చిన నాగేంద్రరావుగారు.

"కాళిదాసు ఏకాలంవాడని నిర్ణయించారు?" అన్నాను. "అన్నికాలాలవాడూ కాబట్టే ఈకాలంలోనూ తలచుకుంటున్నాము" అని క్రీగంటిచూపుతో జవాబిచ్చారు.

"క్రీస్తుశకం ఒకటి - నాల్గవ శతాబ్దాల మధ్యవాడని కొందరు, భోజునికాలంనాటి వాడని కొందరు కుమ్ములాడుకొన్నారే? అందుకని అడుగుతున్నా?" అని శాంతంగా చెప్పా. బెంగాలీ, హిందీ, ఒరియా, కన్నడం, తమిళం, తెలుగు సాహిత్యాలలో కాళిదాసుకాలంపై, వ్యవహారంపై జరిగిన తర్జనభర్జనలను సంక్షిప్తకోశంగా చెప్పాను.

శ్రీ నాగేంద్రరావు బీరువా రిసెర్చి గ్రంథాలవైపు ప్రక్క నోటుపుస్తకాల వైపు దృష్టి "ప్యాన్" చేశారు

"అవిగో అన్నీ అవే. కాళిదాస సాహిత్యంపైన కాలంలోని భారతీయ జ్ఞాన మందిరంవారు సుదీర్ఘంగా పరిశోధించి పరంపరగా వ్యాసరచనలు ప్రకటించారు. అరవిందుడు, రవీంద్రకవీంద్రుడు, ప్రపంచ రచయితలూ కాళిదాసు రచనలపై వ్యాఖ్యలు చేసివున్నారు. వీరందరి భాష్యాలలోని విశే

## మన తారలూ - స్టూడియోలూ

ఘాంశాలు సేకరించాను. కన్యాకుమారినుంచి కాశ్మీరంవరకు కాళిదాసుగురించి ప్రచారంలోవున్న పవాలతుకథలు తీసుకొన్నాను. వీటన్నింటిని తెలుగుసినిమా చట్రంలో పెట్టి భీమ, నలపాకం తయారుచేశామన్నారు. ఒకప్పుడు గోదాలోదిగి కుస్తీలు పట్టిన వాటి ఒకాలి పింగళి.

సాంఘిక, చారిత్రిక, పౌరాణిక, జానపద కథావీథులలో కలందన్ని అఖండపు పంటలు పండించిన శ్రీ నాగేంద్రరావు ఆ నాలుగు పాయింట్లూ (అనుభవాలూ) కాళిదాసులో మేళవించి అన్ని తరగతుల ప్రేక్షకులు ఆనందించేరీతిగా కథనం సాగించారు.

దేనిలో చూచినా కాళిదాసు మొదట మూఢుడని, తర్వాత మహాపండితుడై మన్ననలు పొందాడనీ స్పష్టంగా వుంది. మూఢుడు మహాపండితుడు ఎలా అయినాడనే దానిలోనే ఈకని కలంబలం కనిపించింది.

మూఢుడైన కాళిదాసు "వాగే" ప్రతివాక్యం ద్విముఖమైనది. ఆ వాక్యాకు ఒకఅర్థం చూస్తే మూఢుడనే నిర్ధారణ అవుతుంది. కాని రెండవ అర్థం లోతులు తరచిచూస్తే మున్ముందుగ ఆయనకు మహాకవియోగం కనిపిస్తుంది.



“విరజగ్గడు”లో షీలావాజ్

కాళిదాసు శాపగ్రస్తుడై మూఢునిగా జన్మిస్తాడు. వాడిని వివాహమాడిన పుణ్యవనిత రాకుమార్తె ప్రార్థనపై నవరూపం దాల్చుతాడు. కొత్తకాళిదాసుకు పాతకాళిదాసే కాక గతంలో ఏదీ జ్ఞప్తికి వుండదు. తనకు నవజీవన మిప్పించిన అర్ధాంగినే (శ్రీరంజని) గుర్తించడు. కాళిదాసుకు పూర్వస్మృతి వచ్చేభాగాన్ని అడుగడుగునా ఉత్కంఠ ప్రేరేపింపజేసే రీతిని తీర్చిదిద్దారు.

కాళిదాసు కావ్యాలు, నాటకాలు వియోగ సమయంలో రచించి వుంటారని పింగళి పరిశోధనవల్ల తేలింది. ఆ సమయంలో నే కుమారసంభవం, మేఘసందేశం కావ్యాలు, అభిజ్ఞాన శాకుంతలం నాటకం రచించినట్లు, రాకుమార్తె నిగూఢంగావుండి ఆయా రచనలలో తోడ్పడినట్లు కథ రచించారు. ఈ నిగూఢగాథలో రాకుమార్తె, భర్త మరుపుకు గురైపడే నరకం ప్రేక్షకులకంట తడిపెట్టించక మానదు. సాంఘికాలలో కన్పించే సెంటిమెంట్. సస్పెన్స్ ఇందులో నూటికి నూరుపాళ్లు వున్నాయి.

ఇక రాజకొలువులో తమాషాను వ్యంగ్యాత్మకంగా అల్లినారు. దేవి సత్యం నిరూపితమయ్యే దృశ్యాలలో పౌరాణిక జానపదాలలోని గమ్మత్తులు, మాయలు, మహిమలు, ఇంద్రమహేంద్రజాలములు ఎన్నో గుదిగుచ్చారు.

కవి అనుభూతి ఆయన రచనలలో తొంగి చూడక మానదని సోమర్సెట్ మామ్ వాదం. పింగళి అభిప్రాయం కూడా ఇదే. కాళిదాసు రచనలలో ఆ మహాకవి జీవితచ్ఛాయలను చక్కగా ప్రసరింపజేశారు.

“కవి కోరేది తనకావ్యం స్థిరంగా నిలచి వుండడం; తనపేరు కాదు” అని కాళిదాసే అన్నారు. ఈ విషయం ప్రస్తావించి కవిత్వం చగా “ఈ దీక్షతోనే మన పాళీ పని చూపాను” అన్నారు నాటకకర్త నాగేంద్రరావు.

## వైకుంఠమంటే.... పడుచు చెప్పేసది...

కిరీటం వున్నవారల్లా వైకుంఠవాసులే! ఈ ప్రభలోవున్న ఋష్యశృంగుని (హారనాథ్) రాజనర్తకి మాయ (రాజసులోచన) తన మాయలో వేసుకొన్నది. తను ఆడిందల్లా ఆడించి, పాడిందల్లా పాడించి ప్రేమపాఠాలు వన్--టూ--త్రీ చెప్పివేస్తుంది. పాలువంటి మనసు పాపాయివంటి ప్రకృతి కల ఋష్యశృంగుడు శృంగార గృహప్రవేశం చేశాడు.

అంగదేశంలో క్షామం వచ్చింది. ఋష్యశృంగుడు పాదంపెడితే కాని మేఘాల గుండెలు ద్రవించవు. ఋష్యశృంగుడు రమణీలోలుడౌతాడేమోననే బెడదతో తండ్రి విభాండ



సుఖీభవ ప్రొడక్షన్సువారి "భక్తశబరి"లో సీతారాములుగా రాజశ్రీ, హరనాథ్

కుడు(భుమ్మడి) ముని ఆశ్రమంనుంచి ఋష్యశృంగుని కాలు కదపనివ్వడు. అట్టి ఋషి కుమారుని వంచించియయినా అంగదేశానికి తీసుకొనిపోవడానికై రాజనర్తకి మాయ ఈ మధ్యనే మద్రాసు నెప్ట్యూన్ స్టూడియోస్‌కు వచ్చింది! ఋషి ఆశ్రమానికి కొంచెం చేరువలో శిబిరాలు వేసుకొని వున్నది. ఆమె కిరీటం చూడకలిగిన ఋష్యశృంగుడు "కిరీటం వున్నవారల్లా వైకుంఠ వాసులన్న భ్రాంతి"లో ఆమె వైకుంఠవాసి అనుకొంటాగా, ఋష్యశృంగుని, మాయచే తన అధీనం చేసుకోదలచిన రాజనర్తకి మయ తాను వైకుంఠవాసే అంటుంది. వైకుంఠంద్వారా పరిచయమైన ఈ యిద్దరి హృదయాలు శృంగారం వైకుంఠద్వారం దాటుతున్నవి. మునికుమారుడు, తండ్రి కను చాటు దప్పి అడపా దడపా మాయ శిబిరానికి వస్తూ వుంటాడు. మాయ సహచారిణి (గిరిజ), తోటి నాట్యకత్తెలు "ఘల్లు ఘల్లు అందియల కిలకిల సందడిలో చిందులపాటలే వైకుంఠ"మని గానసహిత నృత్యం చేస్తారు. వైకుంఠపు మోజులో మునికుమారుడు మైమరుస్తాడు. మాయకు అంతకంటె కావలసిందేముంది? మాయ, మునికుమారుని తన మాయలోకి దించుకుంటే ముక్కామల కృష్ణమూర్తి "షి. కే." "షి. కే." అన్నారు.

గీతా పిక్చర్స్‌వారి "ఋష్యశృంగ" చిత్రంలో పై శిబిరఘట్టాలు ఈ మధ్య నెప్ట్యూన్ స్టుడియోస్‌లో చిత్రీకరించారు. దర్శకుడు ముక్కామల. నర్తకిగా అందె వేసిన చెయ్యి రాజసులోచన. చింజామరాల వంటి ఆ నేత్రాలు, తెల్ల ముత్యాలవంటి ఆ పలువరుస, పెదవిపై నాట్యం చేసే చిలిపితనం ఆ పాత్రకెంతో సహజత్వాన్ని సమకూర్చినవి.

అంత అనుభవశాలి అయిన నటితో, నిన్ననే వెండితెరకు పరిచయమైన "నాయింటి మహాలక్ష్మి" నవయువకుడు హరనాథ్ నిర్భయంగా, ఒక్కొక్కప్పుడు ఆమె నటనకే సొగసుపరుస్తూ అభినయించాడు. ఒక చెంప అమాయకత, వేరొక చెంప అప్పుడే బీజంపడిన శృంగారం, ఇంకొక చెంప వైకుంఠంపై భక్తి ఈ త్రివిధ అనుభూతులను క్విక్ ఎక్స్‌ప్రెషన్‌లో చూపారు ఆ అరడుగుల షట్భద్రుడు. ఇంతలో గంభీరముద్ర అంతలో హాస్యభంగిమ ప్రదర్శించి కాకినాడ, మద్రాసు గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీలలో నాటకానుభవం విరివిగా అభినయానికి యిచ్చిన మేలు నిరూపించాడు.

14 రీళ్ళ పైచిలుకు తయారైన "ఋష్యశృంగ"కు నృత్యదర్శకుడు పసుమర్తి కృష్ణమూర్తి. కలంచేత చిందులు త్రొక్కించింది జూనియర్ సముద్రాల. కుంచెల కళాబలం చూపుతున్నది టి. వి. ఎస్. శర్మ. అది ఇరాని కంపెని, టి. వి. రాజు కర్ణములను రంజింపజేసే బాధ్యత వహించిన ఈ చిత్రంలో రేలంగి, పేకేటి, వంగర నటిస్తున్నారు.

## రాక్ ఎన్ రోల్...

## కూచిపూడి...

ఒక తెలుగుచిత్రంలో ఎక్కడమ్మన మెరుపుగా సాగిన ఐదురకాల నృత్యాలు చూడబోతున్నారు. పాటలేకుండా, కేవలం నేపథ్య సంగీతంలో నృత్యానికి నవ మాధుర్యం కలిగినది. నృత్యదర్శకుడు వి. జె. శర్మ, సంగీత దర్శకుడు రాజేశ్వర

## "గిలిగింత"

విలేఖరి: మీ అనుభవంలో స్టేజి నటనకు, సినిమా నటనకు కని పించిన భేద మేమిటి?

నటుడు: ఆ, ఏముంది? మొదటిది కొంచెం రిస్కు! వొళ్ళు కొంచెం దగ్గర పెట్టుకొని నటించాలి!!

## మన తారలూ—

రావుల ప్రజ్ఞావిశేషంతో అమరిన ఈ పంచ నృత్యపుష్పం సమర్పించ బోతున్నది బి. ఏ. సుబ్బారావు ప్రొడక్షన్స జానపద చిత్రం. ఈరకమైన నృత్యసమ్మేళనాన్ని చూపడం తెలుగు చిత్రంలో బహుశా ఇదే మొదటిసారి.

భరతనాట్యం, పంజాబీ, పర్షియన్, మణిపురి, కథక్ నృత్యాలుకల ఈ చిత్రభాగం రషెస్ చూచుకొన్న నృత్య దర్శకుడు వేదాంతం జగన్నాథశర్మ ఉత్సాహంతో ఉప్పొంగిపోయారు. వి. టి. సరోజ పంజాబీ నృత్యాన్ని, కమల పర్షియన్ నృత్యాన్ని, మాధురిమణిపురి, సుశీల కథక్, ఆంధ్రసిస్టర్స్ భరతనాట్యాన్ని ప్రదర్శించారు. రాజదర్బార్‌లో ఈ నృత్యప్రదర్శనం జరుగుతుంది. కళాదర్శకుడు వాలి.

కూచిపూడి నాట్యానికి జీవితం అంకితం చేసిన కుటుంబ సభ్యుడు వి. జె. శర్మ (స్వర్గీయ వేదాంతం లక్ష్మీనారాయణ కుమారుడు) తెలుగు చిత్రాలలో కూచిపూడి నాట్యానికి తగుస్థానమివ్వకపోవడంపట్ల విచారం ప్రకటించారు.

కూచిపూడికి "ప్రెజెంటబుల్ ఫారమ్" లేదని విద్వద్ఘోష్ఠులలో నే ప్రకటించారు కదా! అని ఎత్తిపొడిచాను.

ఆ భావం సరికాదని, ఈ కొంపు తెలుగు సినిమాలకు దాదినమ్మ వేషమంటే కూచిపూడి రీతులూ యక్షగానాలూ శేషుగ్గా పనికి వస్తవని శర్మజవాబిచ్చారు. దాదినమ్మకు విశిష్ట నృత్యరూపమిస్తున్నారు "పెద్దమనుషులు" తో పెద్దవారై దాదాపు పాతిక చిత్రాలకు నృత్యదర్శకత్వం వహించిన శ్రీ శర్మ.

"రాక్ ఎన్ రోల్" రీతి నృత్యాలు, తెలుగుచిత్రాలలో చొప్పించవచ్చునా అని అడిగితే అశ్లీలం లేకపోతే వేగ ప్రధానమైన ఏ నృత్యమైనా ప్రవేశపెట్టవచ్చునన్నారు.

సినిమాలకు సంబంధించినంతవరకు కథక్‌కు మొదటి వోటు వేస్తానన్నారు.

యక్షగానాలకు, కూచిపూడికి మంచి రోజు లెప్పుడో!

—బొమ్మకంటి సుబ్బారావు

## హాలీవుడ్‌పై ప్రాగ్ మోజు

ప్రాగ్‌నుంచి వెలువడే "ప్రేస్" అనే పత్రిక సమకాలిక చిత్రాలపై ప్రజాభిప్రాయాన్ని సేకరించింది. చెక్ చిత్రాలు ప్రచారధోరణిలో వున్నందుకు కొందరు విచారం ప్రకటించగా అమెరికా తదితరదేశాల్లో తయారయ్యే వినోదాత్మక చిత్రాలు చూచే అవకాశం తమకు లేకపోయినందుకు మరికొందరు అసంతృప్తి వ్యక్తం చేశారు. "మన దేశంలో పుట్టిన శ్రీమతి కిమ్ నోవక్ నటించిన హాలీవుడ్ చిత్రాలనే మనం చూడ నోచుకొనకపోవడం అవమానకరం" అని ఒకరు 'కారం'చల్లి కార్డు పంపారు.




రెమి హాస్యనాటకం—ప్రతి శుక్రవారం రేడియో సిలోన్—41.7 మీటర్ల మీద సా|| 6-30 నుండి 6-45 గం||లవరకు వినండి.



# కాపురం...



(12-వ పేజీ తరువాయి)

ఎప్పుడైనా జానకిని చూస్తే చనువుగా మాట్లాడ్డము అలవాటు. "ఏవమ్మా జానకీ అల్లా చిక్కి పోయావేమిటి. ఒంట్లో బాగా లేదా?" అన్నాడు నవ్వుతూనే. జానకి సమాధానంగా చిన్నగా నవ్వి వూరుకుంది. లోపలికివెళ్లి అత్తగార్ని లేపి 'వెంకటేశం గారూ యింకో యిద్దరో వచ్చారని చెప్పింది. "ఎందుకే మీ మామగారితో చెప్పు. వాళ్ళని కూర్చోమన్నావా? నా పెట్లో గులాబీ చీర జరీది యిల్లాతీసుకురా" అంటూ ఖంగారుగా లేచి తల దువ్వుకోవటం మొదలు పెట్టారావిడ. మామగారికి చెప్పి వచ్చి పెరటి గుమ్మంలో కూర్చుంది జానకి. అత్తగారు ఆగోలుసు యివ్వవే అని తీసుకుని మెడలో వేసుకుని 'రాజమ్మగారితో కాఫీ పెట్టమని చెప్పు' అని చెప్పి వెళ్లారు.

వాళ్లు చాలాసేపు వున్నారు. వాళ్లు వెళ్లాక అత్తగారు నవ్వుకుంటూ వచ్చారు. "ఏమేవ్ జానకీ! నీ చిన్న మరదికి పెళ్లి సమ్మంధం తీసుకువచ్చారే. మన గోపీ వెర్రిబాగులవాడూ అనుకుంటాము. వారు మనకి చెప్పకుండానే వాళ్లు రమ్మంటే వెళ్లి పిల్లని చూసి తనకినచ్చింది అనిచెప్పి, మిగిలిన విషయాలు మావాళ్లతో మాట్లాడమని చెప్పాడుట. జాతకం తీసుకు వెళ్లారు. జాతకాలు సరిపోతే పెళ్లి ముహూర్తం వారంలో వుందిట. ఆ ముహూర్తానికే చేసెయ్యాలి అంటున్నారు. ఏమోనుమా నాకు యింత తొందరగా చెయ్యటం యిష్టంలేదు. అబ్బాయి పెళ్ళి కూడా వుడిగా చెయ్యటం యిష్టంలేదు" అన్నారు. అత్తగారు యిల్లా తనతో ఆప్యాయంగా మాట్లాడి చాలాకాలం అయింది. ఆ రాత్రి భోజనాలు, గోపీ పెళ్ళినిగురించిన మాటలతోటి, మామగారి హేళనతోటి కులాసాగా పూర్తిఅయ్యాయి. సుశీలకి ఆరాత్రి మళ్ళీ ఫిట్సు మొదలుపెట్టాయి. అత్తగారు కొంచెము విసుక్కోవటము మొదలుపెట్టారు.

రెండురోజులయ్యాక అన్ని జాతకాలు కుదిరాయని ఆ ముహూర్తానికే పెళ్ళిజరగాలని వాళ్లు అన్నీసిద్ధంచేసుకున్నారని పెళ్లి పెద్దలువచ్చి చెప్పివెళ్ళారు.

"అత్తగారు పెళ్ళిహడావిడిలో సుశీల విషయం పట్టించుకోవటంలేదు. జానక్కి కొన్ని పనులు పురమాయించి వాళ్ళచేత చేయించమని అత్తగారు బట్టలకొట్లకి నగల కొట్లకి తిరగటంతో పెళ్ళిరోజు దగ్గరికి వచ్చింది. ఆవిడ కొనితెచ్చినవి చూస్తూ మామగారు, "తెచ్చినవాటిలో మూడువంతులు నీకోసమే తెచ్చుకున్నట్టున్నావే!" అన్నారు. "ఆ కామనను ఎప్పుడు తీరను మరి. మీరు ఎల్లాగా తేరుకనక నేనే తెచ్చుకున్నా" అంటూ మూతితిప్పుతూ హేళనగా చూశారు అత్తగారు.

## కొత్తకోడలు

"ఆరాత్రి పెళ్ళికి బయలుదేరివెళ్ళాలి. జానక్కి మధ్యాహ్నంనించి చలితో పెద్ద పెట్టున జ్వరమువచ్చింది. అత్తగారికి బెంగ పడింది. తనుకదలకుండా అన్నీ పెద్దకోడలు చేత జరిపించుకోవటానికావిడ అలవాటు పడింది. సరీగా యీ సమయానికే జ్వరం రావటం, తనకంటే ఎక్కువగా కూర్చోటం నేర్చిన చిన్నకోడల్ని తీసుకు పెళ్ళికి వెళ్ళటంఅంటే తనకే జ్వరంవచ్చినట్టు బాధపడటం మొదలుపెట్టారు. జానక్కితోడు, వచ్చినబంధువుల్లో పెద్దవాళ్ళని యిద్దర్ని వదిలిపెట్టి, పనివాళ్ళని యింటిదగ్గర వుండమని అంతా వెళ్ళిపోయారు. మూడవరోజాక రాముం తిరిగివచ్చాడు. జానక్కి యింకా జ్వరంతగ్గలేదు. ఆరాత్రికి పెళ్ళికూతుర్ని తీసుకువస్తారని గృహప్రవేశం ఆతెల్లవారు జామునే చెయ్యాలన్నారని తనని ముందు వెళ్ళి కావలసిన ప్రయత్నం చెయ్యమన్నారనీ చెప్పాడు. రాముం, వద్దుఅంటున్నా జానకి మెల్లిగాలేచి యింటపనులుచేయించటం మొదలుపెట్టింది. ఆరాత్రి అంతా రావటం, చిన్నకోడలూ, అత్తగారూ చిన్నగా మొదలుపెట్టి పెద్దగా గొడవ పెంచుకోవటం చిన్నకోడలికి ఫిట్సుతో మామగారికోపంతో, అత్తగారి ఏడుపుతో తెలవారింది. జానక్కి మళ్ళీ జ్వరముఎక్కువయింది. అత్తగారికోపము జానకిమీదకి వెళ్ళింది. ఈవంకబాగా నేవుంది. ఈవిడకో రోగము ఆవిడకో రోగము ఏమీలేనిదాన్ని నేనే అంటూ విసుక్కోవటం మొదలు పెట్టారు.

కొత్తకోడలు మాలతి, జంకూభిడియమూ లేకుండా యిల్లుఅంతా తిరుగుతూ అందర్నీ ప్రశ్నలువేస్తూ అత్తగారిదగ్గరికి వచ్చింది. ఎందుకండీ అంత కట్టిగా మాట్లాడుతున్నారూ అంటూ అత్తగార్ని ప్రశ్నించింది. అత్తగారు కొంచెము తెల్లబోయి 'ఏమీలేదులే' అంటూ అక్కడనించి వెళుతున్నారు.

చిన్న అత్త మహాలక్ష్మిగారు జానకిదగ్గరికి వచ్చి 'నువ్వు లేచి తిరగకపోతే యిల్లే చిన్నబోయిందే' అంటూ అటూ యిటూచూసి, 'మీ అత్తగారికితగ్గ కోడలేవచ్చిందిలే. ఇది అనవచ్చు అనకూడదూ అని లేకుండా యిష్టం వచ్చినట్లల్లామాట్లాడుతూ మొగరాయుడుగా అ తిరగటం చూడు. నీమీదలా అథారటీ చలాయించమను బండారం బయటపడుతుంది" అన్నారు

ఇంతలో అత్తగారు అక్కడికివచ్చి "ఏమిటే ఆ గుసగుసలు. అల్లాకూర్చోకపోతే పెళ్ళివారి తాలూకు వాళ్ళకి నీళ్లు కావాలో ఏం కావాలో కనుక్కోరాదూ" అని ఆవిడని అక్కడనించి పంపేశారు. వాళ్ళ తాలూకు పెట్టెలు జానకి పడుకున్న గదిలోకి మార్పించారు. గోపీ స్నేహితుడుకి ఓ గది కావాలని పెళ్ళివారితాలూకు వాళ్ళని రాముం గదిలోకి పిల్చుకు వచ్చాడు. మాలతి వదినగారుట, కాళ్ళజోడు, కళ్ళజోడు సవరించుకుంటూ ప్రతీది కాళ్ళతో పక్కకి నెడుతూ బల్ల మీద ఫోటోలో తనని చూసుకొని "ఇంకో రామూ నా ఫోటో పెట్టుకున్నాడే" అంటూ తీసి చూసుకు మురిసిపోతూ మాలతిని పిలిచి చూపించింది. జానకికి, ఆ మాట వింటోంటే ఎందుకో మనస్సు చివుక్కుమన్నట్టు అయింది. వాళ్ళు ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంలో బట్టలు మారుస్తున్నారు. రాముం ఎందుకో ఆ గదిలోకి రాబోయాడు. నగము కుచ్చిళ్ళు పెట్టుకున్నావిడ ఎదురువెళ్ళి "మీరేనారండి. ఫరవాలేదు" అంటూ రామాన్ని రానిస్తున్నట్టు నిల్చుంది. జానకి వోరగా చూసి పక్కకి తిరిగి పడుకుంది. వాళ్ళు ఎప్పుడు వెళ్ళారో జానక్కి తెలవదు. నీరసంతో నిద్రపట్టింది. మెలకువ వచ్చేసరికి మాలతి గందరగోళంగా మాట్లాడుతూ, తనని పరుపుమట్టదొర్లించినట్టు దొర్లిస్తోంది.

"పెరట్లోవున్నది ఏమయిపోతుంది, మీరు యిక్కడే వున్నారుగా" అంటూ ప్రశ్నలు మొదలుపెట్టింది. జానకికి గుండె గబగబా కొట్టుకోవటం మొదలుపెట్టింది. తనకేమిటో అర్థంకాక తెలబోయి చూస్తోంది. ఆ గొడవ అంతా చుట్టూ మూగారు. ఎవరో యేమి

# ★ కాపురం ★

పోయింది అన్నారు. "ఏం పోవడం ఏమిటి నా పెట్లెను వెయ్యరూపాయిల్లి పోయిందా" అంటూ అక్కడవున్న పెట్టెలన్నీ కలికి, జానకి పెట్టె బోర్లించింది. అంగలో బొమ్మని విసిరికొట్టింది. "ఎక్కడ పెట్టారో యిచ్చెయ్యండి, ఇంక ఎవరు నసారు కొట్టేవాళ్ళు" అంటూ జానకిమీద కసుక్కుంటూ మొరలు పెట్టింది. జానకికి నీరసం మీద ఎక్కువగా గకళుంగన్ని ఏడుపు మొదలుపెట్టింది తన బొమ్మని తీసుకు విరిగిన చెయ్యి సవరించుకొంటూ వెక్కి వెక్కి ఏడుస్తోంది. మాలతి గట్టిగా, 'ఏడుపు కట్టిపెట్టి నాది నాకివ్వండి' అంటోంది. అప్పుడే వస్తున్న వదినగారు తిప్పుకుంటూ. "ఏమిటి మాలతీ గొడవ" అంటూ వొయ్యారంగా నిలబడింది. "గొడవ ఏమిటి, నా పెట్టెను తీసుకు ఇవ్వటంలేదు" అంది. అంతలో రామం వచ్చి 'ఏం తీసుకొన్నా'రని అడిగాడు. "ఎవరు తీసుకొనటం యేమిటి, అవిడే కనపడటంలేదే?" అని జానకిని చూపించింది.

"నీకు ఊరికే తొందర. ఇందాకా నువ్వేగా నా చేతికిచ్చావు" అంటూ తన మెడలోది తీసి యివ్వబోయింది వదినగారు. "ఉండనీలే" అంటూ మాలతి తన పెట్టెలు మళ్ళీ సదుకోవటం మొదలుపెట్టింది చిరచిరలాడుతూ. అప్పటిదాకా వింత చూస్తున్న వాళ్ళు అంతా తలో మాటా అని వెళ్ళిపోయారు. అత్తగారు చివరిదాకా తనకి అర్థమే కానట్టు, "తియ్యలేదని చెప్పకర్లేదే జానకీ" అంటూ వెళ్ళిపోయారు. రామం తనవేపు మాట్లాడతాడు అనుకుంది జానకి. తనని వోదారుస్తాడనుకుంది. అది యేమీ లేకండా తక్కువ కూడా అనకండా వెళ్ళిపోవటం జానకిక్కి యెందుకో చాలాబాధగా తోచింది. మెల్లిగా లేచి, తన నగన్నీ క్రిందవి తీసి పెట్టెలో పెట్టుకుని అప్పలమ్మ ఆసరాతో వెనకవేపు వసారాలోకి తన పక్క మార్చుకుంది. సాధారణంగా అక్కడికి ఎవరూ రారు పాలు పితికేందుకు వస్తే తప్ప యింటివాళ్ళు ఎవ్వరూ రారు. జానకి అలా పాలకా కనుక్కున్నవాళ్ళే లేరు. అప్పలమ్మే వంటావిడని అడిగి కాఫీ తెచ్చి బలవంతంగా తాగించింది. జానకిక్కి ఎన్నో ఆలోచనలు వచ్చాయి. ఎప్పుడూ రామంతో మాట్లాడకూడదని తనకీ రామానికీ సంబంధం తీరిపోయిందనీ. రామానికి తనమీద ఇష్టము లేదనీ, ఉంటే ఎవరయినా భార్యపైన దొంగతనము వేస్తే. విని వూరుకుంటారా అని అనుకుంది. చిన్న కొడుకు మొన్న పెళ్ళియినా. గోపీ, ఎంత రభస చేసినా భార్యని ఏమీ అనలేదు. అన్ని మాటలు అన్నా విని ఊరుకున్నాడు. మొదటి నించి రామానికి తనమీద యిష్టం లేదనుకుంది. అందుకు నిదర్శనాలెన్నో గుర్తుకి తెచ్చుకుంది. ఈ యింట్లో తనంటే ఎవరికీ యిష్టం లేదని తనని కటువు పనిమనిషి క్రింద వుపయోగించుకుంటున్నారని యిల్లా ఏవేవో వూహించుకుని, యిష్టము వచ్చినంతసేపు ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది.

* * *

మెళుకువ వచ్చేసరికి చాలా ప్రొద్దుపోయినట్లుంది. చుట్టూ చీకటి. చిన్న దీపము మెట్లమీద పెట్టివుంది. తనదగ్గరలో అప్పలమ్మ నిద్రలో చేసేగప్పుడు పిల్లలు దెబ్బలాడినట్టు వినిపిస్తోంది. పాకలో పశువులు కదిలినప్పుడు, గడ్డిశబ్దము వినపడుతున్నాయి. కీచురాళ్ళ చప్పుడు అంటే తనకెంతో భయము. కళ్ళు తెరచి చుట్టూ చూస్తున్నా వూపిరి తీసేందుకు భయమేసి. అటూ ఇటూ చూస్తూ బిగుసుకు పడుకుంది. కొంతసేపటికి అడుగుల అలికిడి అయినట్టు తోచింది. వెంకడు దూడలకి గడ్డివేసేందుకు వచ్చినట్టున్నాడు. వోరక్కడే అంటూ అప్పలమ్మని లేపాడు. 'నీకోసం పెద్దమ్మగారు యిలు పోయేటట్టు కేకలు వేస్తూంటే నువ్వు యీడ నిద్రపోతుండావు' అన్నాడు. "ఏం నాతో ఏం పనొచ్చే. అల్లంత వున్నారుగా. పెద్దకోడలు గారు యీడ ఒంటరి పడుకుంటే వేరిసికూకుండా' అంది. సర్లే పోయి చెప్పాలే అంటూ కిర్రు రాళ్ళ చెప్పులు కిర్రు కిర్రు శబ్దము చేసుకుంటూ వెళ్ళాడు. దూరంగా గంటలశబ్దము వినపడ్డప్పుడు లెక్కపెట్టుకుంటూ చీకట్లోకి అలా చూస్తూ పడుకుంది.

నూగురుమీద చల్లగా చెయ్యి తగిలేసరికి భయమేసి అరవలేక గట్టిగా మూలిగింది. అప్పలమ్మ ఏవమ్మ అంటూ లేచి, "వోరారు మీరా... పెద్దఅబ్బాయిగారు వచ్చారు లెగండి లోపలికి పోదాము" అంటూ లేచి చాపచుట్టుకు బయలుదేరింది. "మీరు పిల్చుకురండి అమ్మాయిగార్ని" అంటూ అది వెళ్ళిపోయింది. రామం చెయ్యితీసి పక్కన పెట్టి దూరంగా జరిగింది జానకి. "అబ్బా ఎంత వేడిగా వుంది" అంటూ తన పైకండువా తీసి కప్పి ఎంతో ఆప్యాయంగా చెంపలునిమిరి "క్రిందికి జరక్కు. అంతా పుట్టి" అని చాపమీదకి జరిపాడు తనని. తను అనుకున్నవన్నీ మరచిపోయి పిల్లిపిల్లలా ఒదిగి పడుకుంది జానకి. "అబ్బా నువ్వెక్కడా కనపడకపోతే భయమేసింది" అంటూ దగ్గరగా తీసుకున్నాడు. జానకి దూరంగా వెళ్ళేందుకు ప్రయత్నించింది. వాళ్ళేదో అంటే నామీద కోపమైతే ఎలా అన్నట్టు జరిగి పడుకున్నాడు. అన్ని కోపాలూ చీకట్లో కలిసి కరిగిపోయాయి.

తెల్లవారుతోంది. జానకి బద్దకంగా కళ్ళు తెరవకండా పడుకుంది. తండ్రీ కొడుకుల సంభాషణ వినపడుతోంది. "కొంతకాలం వాళ్ళవూరు పంపుదామనుకుంటున్నాను. నాన్నగారూ! మీరేమంటారు?" అంటున్నాడు రామం "అన్నీ గొడవలూ వింటూనే వున్నా. మీ అమ్మ మనసు తీర్చుకోడలే వచ్చిందిలే. చిన్నప్పటనించి ఎరిగివున్న పిల్ల కావటంవల్లనో ఏమో జానకి నాకు కూతురులా వుంటుంది కాని కోడలులా అనిపించదు. అమ్మాయి నడుస్తుందన్నా నాకు ఏమిటోలా వుంటుంది. పోనీ కొన్నాళ్ళు మీరు యిద్దరూ వేరే వుండరండి అసలు నీకు చెబుదామనుకున్న మాటమర్చాం. కొత్తవియ్యంకుడు, రెండోవాని మామగారు పెళ్ళిలో మాట్లాడుకున్నారట. ఆస్తి ఎవరిది వాళ్ళకి పంచేస్తే బాగుంటుందని. ఇంక చేసే కార్యాలూ ఏమీ లేవాయెను, ముగ్గురివీ పెళ్ళిళ్ళుకూడా పూర్తయ్యాయి కనక పంచిపెట్టడంలో ఏమీ యిబ్బంది వుండకపోతే అట్లాచేస్తే బాగుంటుందని వాళ్ళ యిష్టము—ఇ వల్లగా పాడుగ్గా ఉన్నాడే—ఆయన చేతి నాకు తెలియ పరిపించారు. నాకు వలుండింది. అయినా పైకి ఏమీ అనలేదు, దాని దేం వుందిలెండి. ప్రస్తుతము, నేను ఏమీ అనలేను. నాకు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు మీకు తెలియపరుస్తా. అవసరమైతే వారిదగ్గర పోటీబాటు మీ ఎలహాకూడా తీసుకుంటా. ఇల్లా అన్నానని తెలియచెయ్యండి వాళ్ళకి అన్నా. ఇప్పుడే వీళ్ళకి ఆస్తిమీద కన్ను పడింది. వీళ్ళు మమ్మల్నేమి చూడనిస్తారంట మా బ్రతుకు ఇంతే రిపెట్టే... 'మీ అత్తగారు యిన్నేళ్ళు అయింది మాటవరసకైనా ఎప్పుడైనా అన్నారా? పొలము జానకి నగలమ్మి పొలముమీద పెడితేకూడా వాళ్ళు ఆ సొమ్ములు ఏమయినాయనికూడా అడగలేదు. మనము ఎప్పుడు పంపమంటే అప్పుడు పంపి, ఈ రోజుకికూడా వాళ్ళు అంత అగ్గలాడుతూ వుంటారు. పెద్దలు పూరికే అనలేదు. 'కులమింటికోతిని తెచ్చుకొమని' నువ్వు వెడితే మీ మామగార్ని ఒకసారి రమ్మని చెప్పు. ఆయన సలహా తీసుకు పంచి పారేస్తాను. ఒకవేళ నాకే వృద్ధాప్యము వాళ్ళు అడిగారని రాలేదు. నువ్వూ జానకీ అయినా సుఖంగా వుంటారని. నాకేం కావాలి, రామకృష్ణా అంటూ కూర్చోక, మీ అమ్మకి కావాలంటే ఆ కోడళ్ళ దగ్గర మనసు తీర్చుకోమను. కాని నేను మాత్రము మీదగ్గర వుంటానుసుమా" అంటూ చెప్పుకుపోతున్నారు మామగారు.

"ఏమిటి నా విషయము పెద్ద కొడుకుతో యింత ప్రొద్దున్నే వ్యాఖ్యానం చేస్తున్నారు ఏమిటి" అంటూ అత్తగారి కంఠం విని

పించింది.

"ఏవుంది. నీ కొత్త వియ్యంకుళ్ళు యిద్దరూ కూడబలుక్కుని అపూర్వమైన సలహా పంపారు. ఆస్తి పంచితే బాగుంటుందని."

"పోనీ యింతేనా. ఇంకా ఏదో కొంప మునిగే రహస్యం అనుకున్నా" అన్నారు అత్తగారు.

"ఈ మాటే పెద్ద వియ్యంకుడు అని వుంటే నన్నూ వాళ్ళనీకూడా తిట్టిపోసే వాడిని. వీళ్ళు గొప్పవాళ్ళనీ, వాళ్ళన్నది కాదంటే ఏమనుకుంటారో అనీ వాళ్ళు అన్నదానికల్లా తాళం వేస్తున్నావు. కొంతకాలం ఆ కోడలిని పెట్టుకువుండు. అప్పుడు బైటపడుతుంది బండారం" అన్నారు మామగారు.

"నాకేమిఖర్మ వాళ్ళ దగ్గర వీళ్ళ దగ్గరా వుండేందుకు. నాకు ఎవరూ పెట్టక్కరలేదు. నా తండ్రి యిచ్చింది నాకుంది. హాయిగా డబ్బు పారేసి మనిషిని పెట్టి చేయించుకొంటాను. మీరు నన్ను ఏమీ చెప్పక్కర్లేదు" అని అత్తగారు అంటున్నారు.

"వల్లె నీ గొప్పలు తరవాత చెపుదువుగాని, రామాన్ని జానకిని వాళ్ళ వూరు తీసుకువెళ్ళమన్నా. ఏం కావాలో చూడు."

"బాగానే వుంది మీ సలహా. యింటినిండా చుట్టాలు వుంటే, కోడల్ని కొడుకునీ పంపుతానంటారేమిటి? ఎవరైనా వింటే నవ్వుతారు. వూరుకోండి."

నాలుగైదు రోజులు గడిచాయి. ముఖ్యమైన చుట్టాలు వకళ్ళూ, యిద్దరువున్నా, అంతా వెళ్ళిపోయారనే చెప్పవచ్చు. మామగారు ఒకరోజు ప్రొద్దు ఎక్కి, బండినిండా ఏవేవో క్రొత్త సామాన్లు పెట్టుకు వచ్చారు. మొదట అంతా ఎవరో, చుట్టాలు వచ్చారేమోనని ఎదురు వెళ్ళి, మామగారు రావటం చూసి యిదేమిటి, యీ సామాను అంటూ వింతగా చూస్తూ నిల్చున్నారు. మామగారు గంభీరంగా ఎవరితో మాట్లాడకండా ఆ సామాను అంతా మా గదిలో పెట్టించి "జానకీ మీ కొత్తకాపురానికి యింకేం కావాలో చూసుకో" అంటున్నారు. అత్తగారు అక్కడికి వచ్చి "ఇవన్నీ యింట్లో లేనవే తెచ్చారా? ఇలాంటి పిచ్చిపన్లు చేసి, నెత్తి ఎక్కించుకుంటే తరవాత వాళ్ళకి ఏమి గౌరవం వుంటుంది మనమీదకి? నేను రేపు గోపీభార్యని తీసుకుని వాడిదగ్గరికి వెడుతున్నా. నేలేకపోతే ఎల్లా చూస్తుందో మీకు తెలిసి రావాలి" అంటూ కళ్ళు ముక్కు తుడుచుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయారు. మర్నాడు నిజంగానే అత్తగారు గోపీ భార్యను తీసుకుని అతని దగ్గరికి వెళ్ళిపోయారు.

ఇంటి బాధ్యత అంతా జానకిమీద పడేసరికి మొదట కొంచము బెంగగావున్నా కొద్ది రోజుల్లోనే అలవాటుపడి, మామగారికి ఏమి లోపము వస్తుందో అని జాగ్రత్తగా చూసుకుంటూ ఇల్లు చక్కబెట్టుకుంటూ కాలంవెళ్ళబుచ్చింది. తనుఒక్కర్తే చేసుకోలేదేమోనని రామం కూడా జానకికి కొన్ని పనుల్లో సహాయపడుతూంటే ఏదో కొత్తగా అపూర్వమైన ఆనందంగా వుండేది. నాలుగైదు నెలలు గడిచాయి. గోపీదగ్గరనించి మామగార్కి వుత్తరం వచ్చింది. కోడలికి అత్తగార్కి పడటంలేదని అందుచేత "మీరు వచ్చి అమ్మని తీసుకు వెళ్ళాలి" అనీను. మామగారు వెళ్ళటమా, మానటమా, అని ఆలోచనలో రెండు రోజులు గడిపారు. ఆరోజు గోపీదగ్గరనుంచి టెలిగ్రాము వచ్చింది. తల్లిని తీసుకు తనే బయల్దేరి వస్తూన్నట్లు

"అమ్మ వస్తోందని బెంగా? అల్లా అగదము తాగినట్లు పెట్టావు మొహం?" అన్నాడు, రామం, జానకి కేసి చూసి నవ్వుతూ.

"బాగానే వుంది, ఎవరైనా వింటే ఏమనుకుంటారు. ఇంతకీ ఎప్పుడు వస్తున్నారు!" అంది జానకి సంభాషణ మార్చాలని.

మర్నాడు అత్తగారు, గోపీ వచ్చారు. భోజనాల దగ్గర మాటల మధ్యలో, "గోపీకి డబ్బు కావాలిట, డి కో పరీక్షకి కడతాడుట" అని అత్తగారు చెప్పబోయారు- "నాక్కావలిసింది నేను అడిగి తీసుకుంటా. నువ్వు భోజనం కానీ ముందు అని తను లేచివెళ్ళాడు గోపీ. ఇదివరకన్నట్లు మామగారికేసి చూశారు అత్తగారు.

"రామంకూడా యిక్కడ వుండడుట. వాడికి వేరే వుద్యోగము వచ్చిందిట. ఈ రోజే తెలిసింది. మన మిద్దరం ఏమి వుండగలం యిక్కడ" అన్నారు విచారంగా జానకికేసి చూస్తూ మామగారు.

"మీరూ మాతోటే వస్తారు" అంది జానకి.

"మీరు అంటే మామగారు వక్కరు అనా అర్థము" అన్నారు నవ్వుతూ అత్తగారు.

"మీరు అంటే యిద్దరూ అనీలే. నువ్వు మనమణ్ణి ఆడిస్తే నేను బజారుపనులు చేసి కాయగూరలు తెచ్చిపెడతా. ఇద్దరికీ వేళకి యింత వండిపెడుతుంది జానకి. అంతేనా" అన్నారు మామగారు.

కొంగుతో మూతి మూసుకు నవ్వు ఆపుకుంటూ, గోడపక్కకి తిప్పుకుంది జానకి.

గోపి రెండు రోజులు వుండివెళ్ళాడు. రామంకూడా వెళ్ళాల్సిన రోజు వచ్చింది. జానకిని వాళ్ళ వూరు పంపి వెడతానని తల్లితో చెప్పడానికి వచ్చాడు. "ఉన్న వూళ్ళో జీతము తక్కువైతే మాత్రము ఏమిరా. వెళ్ళటము మానెయ్యకూడదా" అన్నారు ఆవిడ ఏదో బాధగా. "మానెయ్యడము ఏమికష్టం. ఎప్పుడు యిష్టము లేకపోతే అప్పుడే వచ్చెయ్యవచ్చు. అక్కడ అన్నీ చూసి ఇల్లు దొరికాక రాస్తాను. జానకిని తీసుకుని నువ్వు, నాన్నగారూ రండి" అన్నాడు రామం.

జానకి అత్తగారికి మామగారికి నమస్కరించి బండి ఎక్కింది. అత్తగారు కళ్ళనిండా నీళ్ళతో అటూ యిటూ చూస్తున్నారు. సాధారణంగా ఆవిడకి ఎవరు వచ్చినా ఎవరు వెళ్ళినా కళ్ళల్లో నీళ్ళు రావటం చూడలేదు. రామం మళ్ళీ తల్లితో వస్తానని చెప్పి బండి ఎక్కాడు. తల్లి నోట్లో మాటరాక తలవూపి పెదవులు బిగించి వచ్చే దుఃఖాన్ని ఆపుకుంది. స్టేషనులో మామగారు, మేము రావటము ఆలస్యము అయినందుకు ఖంగారుపడుతున్నారు.

రైలు కదిలేదాకా అటు యిటు చూసి కొంత డబ్బుతీసి కొడుకు చేతిలో పెడుతూనేవున్నారు. "ఇంక వద్దు నాన్నా. సరిపోతుంది."

"దూరం వెడుతున్నావు దగ్గర వుండటం మంచిది. అమ్మాయికూడా కొంత యియ్యి దగ్గర పెట్టుకోమని" అన్నారు మామగారు.

రైలు కదిలింది. కంపాట్లో కళ్ళు వత్తుకుంటూ "జాగ్రత్త" అంటూ హెచ్చరిక చెబుతూ రైలుతోకూడా కొంతదూరము నడిచి నిలిచి కనపడేదాకా చూస్తూ వుండిపోయారు.

"మీ నాన్నగారికిమీరంటే చాలాయిష్టం మిమ్మల్ని విడిచి వుండలేరు" అంది జానకి.

"మా అమ్మకి నువ్వంటే అపేక్ష. నిన్ను ఎప్పుడు వూరికి పంపాలన్నా ఆవిడకి కోపము వస్తుంది. గోపీ చెప్పాడు అక్కడ అస్తమానం నీ గొడవే చెప్పేదిట. ఆ అమ్మాయికి కోపంవచ్చి, "ఇక్కడి కెందుకు వచ్చారు. అక్కడే వుండక" అనేదిట. మరి నాన్నకి నేనంటే, అమ్మకి నువ్వంటే, మరి నీకు?"

అతనే చూస్తూన్న కళ్ళు కిందకిదించి కాలిబొటనవేలు పెట్టి కిందరాస్తూ, "నేను యిప్పుడు మా వూరు వెళ్ళకుండా మీతో వచ్చేస్తేనేం?" అంది జానకి. ఇంతలో స్టేషను దగ్గరకి వస్తోన్నట్టు, పడిపోయే కాకలా ఆ పక్కగా అయ్యరు చిన్న హోటలులో గ్రామఫోను చేసేగొడవ, రైలు శబ్దంలో కలిసినా, కొన్ని మాటలు వినపడుతున్నాయి.

రైలు ఆగటం నాన్న ఆత్రంగా వెతుకుతూ, "అమ్మడూ దిగు టైమైపోతోంది," అంటూ వచ్చారు. తను దిగి సామాను దించేసరికి రైలు కదిలింది. కమ్మీలు పట్టుకు కింద చెక్కపైన కాలుపెట్టి వెడతానన్నట్టు తల వూపుతూ తనకేసి చూస్తూన్నారాయన. 'పడతారు లోపలికివెళ్ళండ'ని కళ్ళతో భయపడుతూ తను చూడటం నాన్న గ్రహించి 'భయంలేదులే' అని నవ్వాడు. రైలుతో కూడా తనూ నడుస్తు జాగ్రత్తగా వెళ్ళమనీ వెళ్ళగానే వుత్తరం రాయమనీ చెపుతూ, రైలు వేగం హెచ్చేసరికి అక్కడే నిలబడి, కనపడేవరకూ చూస్తుండిపోయింది. నాన్న చూడకుండా కళ్ళు తుడుచుకొని కంట్లో ఏదో పడ్డట్టు నటిస్తూ, బెంగ కనపడకుండా నాన్నతో మాట్లాడుతూ బండిఎక్కి ఇంటికి బయల్దేరింది జానకి. ★

# ఆంధ్రపత్రిక గళ్లనుడికట్టు 20



## ఆధారాలు

### అడ్డం

1. అంతా పట్టుకోటానికి చిక్కరు.

3. అరఎకరం పొలంలోకూడా దున్నటానికి కావలసింది.

5. కొండలమధ్య ఉంటుంది.

6. అట్నుంచి అటు.

8. పూచిక పుల్లలోకూడా సాధ్యత ఉంది.

10. యుద్ధానికి వెళ్లరు.

11. నిద్ర చెదిరిపోయింది.

13. చీకటిచెట్టు.

15. ఆసాములు చేసే కసరత్తు.

16. ప్రతిమానిసి శరీరములో ఉండేనాడి.

18. అన్నా సిప్పలాంటిదే కాదు, బాకు లాంటిది కూడాను.

20. ముందు పూజించాల్సిన గొప్ప నాయకుడు.

22. సినిమాల్లో చిన్న వేషాలు వేసే నటిని ఇలా అనచ్చు.

23. మత్తు కలిగించే తమాషా.

### నిలువు

1. పాదాభరణం

2. చిరుతిండి మొదలైన ఎందుకిష్టమో తెలుస్తుంది.

3. విక్రయించుబాణము

4. పాపం మురికి

5. అచ్యుతిప్పు అనిపించే మునిభార్య

7. పొరుడులేని పరిస్థితిలో అపోహ

9. చిన్న పులి

10. ఎంతిసేపా గాలం వేసే చేప పడటానికి కారణం అందులోనే వుంది.

12. పీనుగు వెళ్లవలసిన సమయం ముంచే వుంది.

14. మామిడికాయతో పెట్టుకునే ఊరగాయ.

15. మధుపాత్రఅందించేపారసీకావ్యపాత్ర

17. స్త్రీ ధరించె వస్త్రవిశేషం.

18. బాగా అడుగనిదానివల్ల యజమానికి పుట్టనిది

19. తారుమారైంది.

21. నిజం ఒక అనిజం.

## 19-వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1రా | గ | ము | | 2ఇ | సు | 3క | |
| | పి | | | | | | ల | |
| 4అ | డి | యా | 5స | | 6వే | ద | ము | లు |
| | | | 7హో | మ | ము | | | |
| 8మ | రి | యా | ద | | 9ల | క్క | యి | ల్లు |
| | | | 10రు | న | వా | | | |
| | 11ప | గ | లు | | 12దే | వ | 13త | |
| | దు | | | | | | ర | |
| | 14సు | డు | వు | | 15నా | మ | ము | |

## జూదంలో మీ [illegible]

### స్కోరు బోర్డు

1. (అ) 15 (ఆ) 10 (ఇ) 0 (ఈ) 20
2. (అ) 15 (ఆ) 10 (ఇ) 5 (ఈ) 20
3. (అ) 15 (ఆ) 5 (ఇ) 20 (ఈ) 10
4. (అ) 20 (ఆ) 5 (ఇ) 15 (ఈ) 10
5. (అ) 20 (ఆ) 10 (ఇ) 15 (ఈ) 5 (ఉ) 15
6. (అ) 0 (ఆ) 5 (ఇ) 10 (ఈ) 20 (ఉ) 15
7. (అ) 15 (ఆ) 5 (ఇ) 10 (ఈ) 0 (ఉ) 20
8. (అ) 20 (ఆ) 15 (ఇ) 5 (ఈ) 0
9. (అ) 20 (ఆ) 10 (ఇ) 0 (ఈ) 15
10. (అ) 20 (ఆ) 15 (ఇ) 20 (ఈ) 5
11. (అ) 10 (ఆ) 20 (ఇ) 0 (ఈ) 5
12. (అ) 20 (ఆ) 20 (ఇ) 20 (ఈ) 20

### 150 పైన మార్కులు వస్తే

మీరు జన్మలో ఎప్పుడూ జూదం ఆడనని ప్రమాణం చెయ్యాలి. చీట్లాటకేమిటి, గుర్రప్పందాల కమిటి - కాటన్‌మార్కెట్ కమిటి - అసలు మిమ్మల్ని మార్కెట్‌కికూడా పంపించకూడదు. మీరు ఒప్పుకున్నా ఒప్పుకోపోయినా. మీరు చెయ్యిపెడితే ధ్వంసం. తీరా ఓడిపోయింతరవాత గుర్రాన్నో, ఎదుటివాణ్నో తిట్టటం మొదలెడతారు.

### 90-150 మార్కుల మధ్యవస్తే

మాకెంతో-మీరు పెద్దపెద్దవాటి జోలికి పోక పిప్పరమెంటుబిళ్ళలు, లేకపోతే పయాపైసాలు అలాంటి వాటితో ఆడటం మంచిది. సాధారణంగా మీరు గెలుస్తారనుకోండి. అయినా మీమనస్సు జెండా లాంటిది; గాలి ఎటు వీస్తుంటే అటు చూస్తుంది.

### 90 లోపు వస్తే

ఆ మీరూ సభార్హమయిన జూదగాళ్ళు! బహుశా ఏ వ్యాపారం చేపటినా జయం మీదే. మీరు ధీమా చేసినంత ధీమాగా ఉంచగలరు. మీ విజయ రహస్యం, మీ కీలకం ఎందులో ఉంది అంటే-మీరు యథార్థానికి జంకరు. పరిస్థితిని రెండు చేతులా ఒడిసి పట్టుకుంటారు.



## జాజులు జవరాలు

(33-వ పేజీ తరువాయి)

తీవ్రంగా. "ఏమీ లేదు" అన్నారు, మామూలుగా. తను యింక ఆగకూడదని అడిగింది. "ఎందుకో కాకో అలా చేశారు? మీకు యీ విధంగానైనా బుద్ధి చెప్పాలనుకుంటున్నా" అంది తను. "మంచిది. యింతకంటె శాకే శిక్ష వద్దు సుజా!" అంటూ తన రెండు చేతులూ ఆయన కండ కదుకుంటూ, చెప్పేరు. "నిన్ను చూడగానే, పోయిన నా జ్ఞాపకాల గుర్తు వచ్చింది. నీలాగానే వుండేది. నాకు జాజులంటే యిష్టమని తను ఎప్పుడూ వాటినే పెట్టుకొనేది కూడా! నువ్వు కోపంగా ఆరోజున అలా చూడకపోతే, యింకేమి చేసేవాడినో తెలియదు." అన్నారు నవ్వుతూ. అప్పుడు తెలిసింది అసలు సంగతి.

* * *

వచ్చే వేళయింది. పెలరోజుల క్రిందటనే వుద్యోగంలో చేరేరు. జాజిపందిరికూడా వేశాం అక్కడ.

'సుజా!'

'వస్తున్నా!'

"ఇవిగో జాజులు, మనయింటో ఎప్పుడు పూస్తాయో, నీ వెప్పుడు అబ్బాయిని ఎత్తుకుంటావో అని చూస్తున్నా" అతడు కాఫీ అందుకుంటూ చిలిపిగా చూశాడు సుజాత కళ్లల్లోకి.



Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

# మీ బుగ్గలమీద పసిపాప అరచేయి చేసిన అనుభవము

గడ్డము చేసుకొన్న తరువాత క్యూటిక్యూరా పౌడరును రాసుకొంటే మీ గడ్డము మృదువుగానుండును. గడ్డము చేసుకొన్న తరువాత కలిగే చికాకులు లేకుండా ఉపశమనము కలిగించి యీ పౌడరు మీ ముఖమును మృదువుగా మరియు తాజాగా ఉంచుతుంది. మెత్తగా ఉండి తాజాదనమును యిచ్చే క్యూటిక్యూరా పౌడరును రోజూ రాసుకోండి. ఉపశమనము, చల్లదనము చేకూర్చే క్యూటిక్యూరా ఎంతో మెత్తగా ఉండి చెమటను పీలుస్తుంది. ఇది ఉండలు కట్టి రాలిపోదు మరియు ఎట్టి అసౌఖ్యమును కలిగించదు. చర్మ రక్షక ఔషధములు చేర్చబడి, తేలికైన సువాసనగల యీ పౌడరు చెమట వాసన లేకుండా రోజంతా రక్షణనిస్తుంది. సర్వోపయుక్తమగు యీ పౌడరు రాసుకొనుటకు, కాళ్లమీద జల్లుకొనుటకు, పిల్లల మరియు రోగుల సంరక్షణకు దివ్యముగా ఉంటుంది.




డబ్బా ధర
రు. 1.75 నయా పైసలు

## క్యూటిక్యూరా

కుటుంబములో అందరూ వాడదగిన
సర్వోపయుక్తమైన టాల్కం పౌడరు

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

త్వరలో
విడుదల








దర్శకత్వం
వి. మధుసూదనరావు
కథ...సదాశివబ్రహ్మం, ఆరుద్ర, మధు
మాటలు...ఆరుద్ర, సదాశివబ్రహ్మం
పాటలు...ఆరుద్ర, ఛాయ...కమాల్ ఘోష్
సంగీతం...దక్షిణామూర్తి, కళ...కృష్ణారావు
నిర్మాతలు...రంగారావు, రాజేంద్రప్రసాద్

డిస్ట్రిబ్యూటర్లు

* ఆంధ్ర: మెసర్సు వాణీ ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్సు, విజయవాడ * సీడెడ్: మెసర్సు విజయ పిక్చర్స్, గుంతకల్లు.
* నైజాం: మెసర్సు శ్రీ నేషనల్ ఆర్టు పిక్చర్స్, విజయవాడ.